హంస ప్రచురణ
ప్రథమ ముద్రణ
సెప్టెంబరు— 1958
విక్టరీ ప్రెస్, విజయవాడ

వెల : సాదా ప్రతి 2.50
మేలు ప్రతి 3.00

# ముందుమాట

చైనాను తమ క్రీడా స్థలంగా ఉపయోగించుకున్న సామ్రాజ్యవాద దేశాలు అనేకం పూర్వం అక్కడ ఉంటూ ఉండేవి. ఇవాల్టి రోజున, ఏ విధంగా చూచినా సోవియట్ రష్యాలో కోడికూస్తే చైనాలో తెల్లవారుతుంది. ఇవాళ చైనా ఒక కమ్యూనిస్టుపార్టీ అధికారప్రాబల్యం క్రిందఉంది.

ఎందుకు ఇంత తీవ్రమైన మార్పువచ్చింది? ఎందుకు అదృష్టంఅంతా తారుమారు అయింది? దుర్బలంగాఉన్న సోవియట్ రష్యా ఎలా శక్తివంతంగా మారింది? అసమర్థంగావున్న సోవియట్ రష్యా **ఎలా** అత్యున్నతస్థితికి పోయి చైనాలో అధికారం చేపట్టగలిగింది? సోవియట్ రాజ్య తంత్రంలోని విధానాలు, చాతుర్యాలు, ఏమిటి? ఈ విధానాలనూ, చాతుర్యాలనూ, చైనా ఎలా ఎదిరించింది? రష్యాతో సంబంధాలకు దిగటానికి చైనాను ప్రోత్సహించిన దేమిటి? చైనా-సోవియట్ సంబంధాలపై అన్యరాజ్యాల వారి ధోరణులు విధానాలు ఎలాంటిమార్పులు కలగచేశాయి? చైనా-సోవియట్ సంబంధాలు ఎలా పరిణమించాయి? ఆ రెండు దేశాల ఆంతరంగిక పరిణామాలవల్ల ఆ సంబంధాలు ఎలా మారాయి? కమ్యూనిస్టుచైనా-సోవియట్ రష్యాలమధ్య కొనసాగిన సహకారంయొక్క స్వభావం, పరిమితి ఏమిటి? యీ సహకారం కడవరకూ కొనసాగదనడానికి ఏమైనా సూచనలున్నాయా?

ఈ పై ప్రశ్నలన్నింటికీ సమాధానం చెప్పటానికి ఈ గ్రంధం ప్రయత్నిస్తుంది. ఎంతో దీర్ఘకాలం- దాదాపు ముప్పయి అయిదుసంవత్సరాల పైకాలం కొనసాగిన చైనా-సోవియట్ సంబంధాలలో యిమిడివున్న గమనార్హమైన రాజ్యతంత్రపు పన్నుగడలు, యుక్తులు, విజయాలు, పరాజయాలు——ఇవన్నీ స్పష్టంగాను, క్రమపద్ధతిలోను అంచనావేసి చూపటానికి ఈ గ్రంధం ఉద్దేశించింది.

దూరప్రాచ్యంలో శాంతినిర్మాణంకోసం ఒకన్యాయమైన, వాస్తవమైన ఆధారం కనుగొనడానికి చేసిన నిగాడంబర ప్రయత్నమే ఈ రచన.

శాన్ ఫ్రాన్సిస్కో,
మే — 1956

హె. ప్రీ వీ.

# విషయసూచిక :

# 1

# చైనాలో సోవియట్ ప్రభావాభివృద్ధి

నాలుగు వేల మైళ్ళ పైచిలుకు ఒకే సరిహద్దు కలిగి, రాచరిక ప్రభుత్వ పాలనలో వుండిన చైనా, సోవియట్ రష్యాలు ఎడతెరిపి లేకుండా ఒకదానిపై ఒకటి రాజ్యతంత్రపు ఎత్తుగడలతో ద్వంద్వయుద్ధాలు సాగిస్తూ, అప్పుడప్పుడు అన్నదమ్ముల్లా ఒకరి కౌగిట్లో ఒకటి ఒదిగిపోతూ వచ్చాయి. ఈ శతాబ్దంలో రెండవ దశాబ్దంలో ఈ రెండు దేశాలలోనూ, ఒక మహా విప్లవం చెలరేగింది. పాతకాలపు రాచరికాన్ని పడగొట్టి ప్రజాస్వామిక ప్రభుత్వం నెలకొన్నది. ఆ ప్రభుత్వం శైశవదశలోవున్నప్పుడే ఈ రెండు దేశాలూ తీవ్రమైన విదేశాల ఒత్తిడికి గురికావలసి వచ్చింది. దానిఫలితంగా రెండు సామ్రాజ్యవాద వ్యతిరేక దేశాలుగా మారిపోయాయి. ఆ సమయంలోనే ఈ రెండు ప్రజాస్వామిక ప్రభుత్వాలలో అంతర్యుద్ధాలు చెలరేగి, తీవ్ర పీడనకు లోనయినాయి. ఆర్థికంగా, సాంస్కృతికంగా దెబ్బతిని ఒక పెద్ద సుడిగుండంలో చిక్కుపడుతూ చిక్కుపడ్డాయి. దాంతో అనాదిగా పీడిస్తూవస్తున్న ఈ దాస్యబంధాలనుండి బయటపడాలనీ, ఈ విపత్కర విషాదపరిస్థితులను అధిగమించి, స్వేచ్ఛాయుతమైన ఒక నూతన సమాజవ్యవస్థను నెలకొల్పాలనీ రెండు దేశాల ప్రజలలో ఒక తీవ్రమైన ఆకాంక్ష రేకెత్తింది. రెండు దేశాలలోనూ రాచరికాలను కూలద్రోయడంతో విప్లవకర

మైన మార్పులు అనేకం వచ్చాయి. కొత్తకొత్త సమస్యలు ఎన్నో ఉత్పన్నమైనాయి. చైనా, రష్యా సంబంధబాంధవ్యాలలో ఒక నూతనశకం ఆరంభమైంది. రెండు దేశాలూ ఒకే పథాన పయనించడం జరిగింది.

1895 లో చైనా, జపాన్‌తో యుద్ధం కొనసాగించలేక పోయింది. అప్పుడు పరిపాలనలో ఉన్న మంచూ రాజవంశం ప్రజలలో తన గౌరవప్రతిష్ఠలను కోల్పోయింది. అంతేకాదు. 1898 లో రాజ్య సరిహద్దులపై కల అధికారాన్ని కూడా కొంత పోగొట్టుకున్నది. దాంతో మంచూ వంశం మరికొంత అప్రతిష్ఠకు, ప్రజల ద్వేషానికీ గురికావలసి వచ్చింది. ఇవికాక 1901 లో బాక్సర్ అల్లర్లు జరిగాయి. అల్లర్ల అనంతరం చేసుకున్న పరిష్కారం తలవంపులు తెచ్చిపెట్టింది. 1904–1905 మధ్య రష్యా జపాన్‌లకు జరిగిన సమరంలో చైనా తటస్థవిధానం అవలంభించి చెడ్డపేరు తెచ్చుకున్నది. పరిపాలనలో ఉన్న మంచూ వంశ ప్రతిష్ఠాభంగానికి ఇవి రెండూ ప్రధానకారణాలయ్యాయి. వీటికితోడు డాక్టర్ సన్‌యెత్ సేన్ అద్భుతమైన ప్రతిభ, ఆకర్షకమైన వ్యక్తిత్వం, ఆయన వాగ్ధాటి, ధారావాహికంగా ఆయన ఇచ్చే ఉపన్యాసాలు చైనా ప్రజలలో ఒక నూతన జాతీయభావాన్ని పెంపొందింపచేశాయి.

డాక్టర్ సన్‌యెత్ సేన్ 1895కు పూర్వమే ఒక రహస్య విప్లవసంఘాన్ని స్థాపించి, కాంటన్‌లో స్థానికమైన తిరుగుబాటు నొకదాన్ని లేవతీశాడు. కాని అందులో విఫలుడై అరెస్టు కాకుండా తప్పించుకునేందుకు చైనావదిలి వెళ్ళాడు. జన్మతః నాయకుడు, మంచివక్త అయిన డాక్టర్ సన్ త్వరలోనే అనేక

మంది అనుచరులను, శిష్యకోటిని తయారుచేసుకున్నాడు. 1911 నాటికల్లా డాక్టర్ సన్ అనుచరులు చైనాముఖ్యనగరాల్లో వ్యూహాలు పన్ని విప్లవం నడిపించసాగారు. 1911 అక్టోబరు 9న విప్లవకారులు తమ ప్రధానకార్యాలయమైన ఊచెంగ్ లో ఒక బాంబును ప్రేల్చారు. అంతటితో ఆగక బాహాటంగా తిరుగు బాటుచేసి మధ్య చైనాలో కీలకస్థానాలయిన హాంకో, ఊచెంగ్, హెన్యాంగ్ అనే మూడు నగరాలను పట్టు కున్నారు. క్రమక్రమంగా పెద్దపెద్ద పట్టణాలు, రాష్ట్రాలు, ఆఖరుకు ప్రభుత్వం విప్లవకారుల హస్తగత మయినాయి. బాంబు ప్రేలుడుజరిగి నెల అయినా కాకముందే యాంగ్ట్జీ నదికి దక్షిణాన ఉన్న రాష్ట్రాలన్నీ విప్లవకారుల పరిపాలన క్రిందికి వచ్చాయి.

పెకింగ్ లోని మంచూ న్యాయస్థానం ఆదరాబాదరా, యువాన్ షికాయ్ కోసం కబురుపెట్టింది. పదవినుంచి తొల గింపబడిన ఒక చైనీస్ జనరల్ అతను విప్లవకారులపై దండ యాత్ర నడపమని అతన్ని నియమించారు. కాని మంచూ పరి పాలనపట్ల ప్రజలకేమాత్రం సానుభూతిలేదు బలీయమైన వ్యతి రేకత, అనిష్టత వారిలో వ్యాపించిఉన్నది. అంచాత వారిని అను కూలంగా తిప్పుకోడం సాధ్యంకాలేదు. తన ప్రయత్నం నిష్ఫల మవుతున్నదని త్వరలో నే గ్రహించాడు యువాన్. విప్లవనాయ కులకూ మంచూలకూ. మధ్య సంప్రతింపులు మొదలయినాయి. యువాన్ షికాయ్ మంచూలపక్షంవహించి సంప్రతింపులు కొనసాగించాడు. కాని సంప్రదింపులువిఫలమయినాయి. రాచరి కపు విధానాన్ని కూలద్రోయడమే తమనిశ్చయమని విప్లవనాయ

కులు ప్రకటించారు. త్వరలోనే పదహారు రాష్ట్రాలకు చెందిన ప్రజాస్వామిక ప్రతినిధులు, అప్పుడే విదేశాలనుంచి తిరిగివచ్చిన డాక్టర్ సన్ యెత్ సేన్‌ను అధ్యక్షునిగా ఎన్నుకున్నారు. ఆ విధంగా చైనారిపబ్లిక్‌కు తొలి అధ్యక్షుడైనాడు డాక్టర్ సన్. తరువాత అతను అధ్యక్షపదవికి రాజీనామా ఇచ్చాడు. అతని స్థానంలో యుయాన్ షి కాయ్ ఎన్నుకోబడ్డాడు

ఏమైనప్పటికీ చైనాలో ఏర్పడిన ప్రజాస్వామ్యం శైశవ దశలోనే విదేశ సామ్రాజ్యవాదులవల్ల అణగద్రొక్కబడింది. ముఖ్యంగా జార్ ప్రభుత్వపు రష్యా, జపాన్‌లు ఇందుకు తోడ్పడ్డాయి. రష్యా, జపాన్‌ల సామ్రాజ్యవాదపు కార్య కలాపాలు ప్రధానంగా మంచూరియాలో కేంద్రీకృతమయ్యాయి 1904 – 1905 లలో జరిగిన రష్యా – జపాన్ సమరానికి పూర్వం, రష్యా అధికారం మంచూరియాలో దృఢంగా పాతుకునిఉంది. రష్యా ఆధిపత్యానికి చైనీస్ ఈస్టర్న్ రైల్వే, హార్బిన్‌నుంచి డైరెన్‌కు వేయబడిన ఆ రైలుమార్గపు దక్షిణశాఖ ప్రధాన సాధనాలయినాయి.

రష్యా – జపాన్ సమరం తరువాత రష్యా ఓడిపోయిన పక్షాలలో ఒకటయింది. ఆర్థర్, డైరెన్ రేవులపై తనకుగల గుత్తాధికారాన్ని జపాన్‌కు ధారాదత్తం చేయవలసివచ్చింది. చైనీస్ ఈస్టర్న్ రైల్వేలో కొంతభాగం – అనగా చాంగ్ చున్ నుంచి డైరెన్ వెళ్లే శాఖనుకూడా జపాన్‌కు వదిలిపెట్టవలసి వచ్చింది. ఒక్కమాటలో చెప్పాలంటే ఈ రైల్వేల పంపిణీ – మంచూరియాలో రెండు అధికారాల ప్రభావం పడేటట్టు చేసింది: ఉత్తరాన రష్యా, దక్షిణాన జపాన్. మంచూరియాలో తనకు

గల వలుకుబడిని, హక్కును అధిక భాగం పోగొట్టుకుని రష్యా, చైనాలోని సింకియాంగ్, మంగోలియా రాష్ట్రాలనుండి నష్ట పరిహారం కోరాలని నిర్ణయించుకుంది.

చైనాలోని ఊచెంగ్‌లో విప్లవం చెలరేగిన మూడు వారాల తరువాత, వెలుపలి మంగోలియాలోని మంగోల్ రాకుమారులు సాహసంతో తమస్వాతంత్ర్యాన్ని ప్రకటించారు. ప్రధాన లామా మతగురువైన కుటుక్టూను తమ గ్రాండ్ ఖాన్‌గా ఎన్నుకున్నారు. రష్యా ఉంటివా పోతివా అని ఊగిస లాడుతున్న మంచూ ప్రభుత్వంమీద ఒత్తిడి తెస్తూంది. గొంతెమ్మకోరిక లనేకం కోరింది. వెలుపలి మంగోలియా యొక్క స్వాతంత్ర్యాన్ని గుర్తించాలనీ, తనతో సంప్రదించ కుండా మంగోలియాకుగల హోదాను మార్చరాదనీ షరాతు పెట్టింది. మంచూ ప్రభుత్వం ఈ కోరికలను త్రోసిపుచ్చింది. కాని రష్యా పట్టుబట్టింది. చివరకు అధ్యక్షుడైన యుయాన్‌ను కూడా అర్థించింది. అప్పుడు యుయాన్ తన స్వవిషయాలతో తలమునకలవుతూ వీటిని పట్టించుకోలేదు. 1912 ఏప్రిల్ 26 న రష్యా విదేశాంగమంత్రి సజానావ్, డ్యూమాలో ఒక ప్రకటన కావించాడు. తమ కోరికలను ఎలా మన్నించరో చూస్తామనీ, వెలుపలి మంగోలియాలో చైనా వలసరాజ్యాలు స్థాపించడం వెంటనే ఆపివెయ్యాలనీ, సైన్యాలు సమీకరించడం కూడ దనిన్నీ, అక్కడి ప్రభుత్వ వ్యవహారాల్లో చైనా జోక్యం కలిగించుకోరాదనీ ఆ ప్రకటనలో సజానావ్ స్పష్టపరిచాడు.

అధ్యక్షుడు యుయాన్, కుటుక్టూతో నేరుగా ఉత్తర ప్రత్యుత్తరాలకు దిగాడు. స్వాతంత్ర్యప్రకటనను ఉపసంహరిం

సుకోవలసినదని అర్థించాడు. కుటుక్తూ దాన్ని నిరాకరించాడు. అందుకుమారుగా రష్యా మధ్యవర్తిత్వం వహించాలని సూచించాడు. ఆ ప్రకారంగానే రష్యా ప్రభుత్వంతో సంప్రతింపులు మొదలయినాయి. వెలుపలి మంగోలియాకు స్వతంత్రాధికారం ఇవ్వడానికి చైనా సమ్మతించింది. ఆచరణలో దానిపైగల ఆధిపత్యం రష్యాతోపాటు తనూ పాలుపంచుకోడానికి ఒప్పుకున్నది.

1914 జులై 28న ప్రథమ యూరప్‌లో ప్రపంచసంగ్రామం మొదలయింది. జపాన్, చైనాలోని షాంటుంగ్ రాష్ట్రంలోగల జర్మన్‌సంస్థలపై దెబ్బతీస్తూవచ్చింది. ఆవిధంగా జపాన్, చైనా అధికారాన్ని, తాటస్థ్యాన్ని ఉల్లంఘిస్తూవచ్చింది. 1915జనవరిలో జపాన్, తన ఇరవైఒక్క కోర్కెలపత్రం ఒకదాన్ని చైనాకు అందచేసింది. ఆ పత్రం ఉద్దేశం చైనా, జపాన్‌ను సంరక్షించడమే. అమెరికా సంయుక్తరాష్ట్రాలు ఆ కోర్కెలకు బాహాటంగా తమ వ్యతిరేకతను తెలియచేశాయి. కాని జపాన్ తన కోర్కెలపత్రంలో కొద్దిమార్పులుచేసి దాన్ని ఒప్పుకోవలసినదిగా చైనాను బలవంతంచేస్తూ ఒక 'అల్టిమేటమ్' పంపింది. అవి జపాన్‌కు దక్షిణ మంచూరియాలో, తూర్పు లోపలిమంగోలియాలో కొన్ని ప్రత్యేకహక్కులను, అర్హతలను మంజూరు చేశాయి.

చైనా ప్రజాస్వామిక ప్రభుత్వం తీవ్రమైన విదేశాల ఒత్తిడిమధ్యను, వ్యతిరేక పరిస్థితులమధ్యను ఉత్పన్నమైంది. పోనుపోను ఎవరిమద్దతు లేకుండానే విదేశాల ఒత్తిడి కొనసాగుతూ వచ్చింది. సామ్రాజ్యవాద వ్యతిరేకతను ఆధారంగా తీసుకొని కొత్తగా ఏర్పడిన రష్యా ప్రభుత్వం చైనాలో తనప్రచార

యాత్ర ప్రారంభించింది. చైనీయుల జాతీయభావాలతో టి స్వేచ్ఛగా ఆటలాడసాగింది. పశ్చిమరాజ్యాలపై చైనాకుగల విరోధభావాలను రెచ్చగొడుతూ ఆనందించసాగింది.

* * *

శతాబ్దాలుగా నిరంకుశ ప్రభుత్వ చక్రాలక్రింద అణగారి పోయిన రష్యాప్రజలు ఈ శతాబ్దంలో వచ్చిన మార్పులవల్ల, జార్ పరిపాలనమీద ప్రత్యక్షచర్యలు తీసుకునేందుకు ఇతః పూర్వమే తీవ్రోద్దేశులయినారు. 1914 నాటికి పరిస్థితి బాగా విషమించి పోయింది. కాని ప్రథమ ప్రపంచసంగ్రామం తలఎత్తడంవల్ల రష్యన్ ప్రజల ఆశక్తి విదేశాలలోని కల్లోలాలవంకకు మళ్ళింది. కాని అది ఎంతోకాలం నిలవలేదు. జార్ ప్రభుత్వపు సైనిక బలహీనతవల్ల ఆ పరిపాలనలోని అవినీతి, అసమర్థత పూర్తిగా బయటపడ్డాయి. ఉధృతమైన, శక్తిమంతమైన విప్లవానికి త్రోవతీసింది. సైనికబలం రోజురోజుకు క్షీణిస్తూవచ్చింది. అంతటా అసంతృప్తి, అశాంతి అలుముకున్నాయి. ఆకలిగొన్న తోడేళ్ళలా రష్యాప్రజలు ఒక్కమారుగా హింసాత్మకచర్యల్లో దూకారు. దేశం నలుమూలలా ఉధృతమైన అల్లర్లు చెల రేగాయి. జార్ చక్రవర్తి తిరుగుబాట్లు అణచడానికి పంపిన సైనిక దళాలుకూడా, ప్రజల్లో కలసిపోయి విప్లవం మరింత ఉధృతం కావడానికి తోడ్పడ్డాయి.

1917 మార్చి 15న ఒక కార్యనిర్వాహకవర్గం ఏర్పాటయింది. ఆ కమిటీలో ముఖ్యంగా అక్టోబరిస్టులు, రాజ్యాంగములో ప్రజాస్వామిక పక్షాలుగా గుర్తింపబడినవారు, సభ్యు

లుగా ఉన్నారు. ఆ కార్యవర్గం సంపూర్ణ అధికారాన్ని చేపట్టింది. తానే తాత్కాలిక ప్రభుత్వంగా వ్యవహరిస్తుంది. పూర్వం జార్ ప్రభుత్వంలో ఇతర రాజ్యాలతో ఏర్పాటు చేసుకున్న ఒడంబడికలు, ఆర్థిక, విదేశాంగ వ్యవహారాలు యథాతథంగా అమలుజరిగేటట్లు నిర్ణయించుకున్నారు. ఆ ప్రభుత్వం అనేక అద్భుతచర్యలు చేస్తుందనీ, తమ దౌర్భాగ్య స్థితిని తొలగిస్తుందనీ ప్రజలు ఆశించారు. కాని ఆ ప్రభుత్వం అనుకున్నంతగా ప్రజావసరాలను తీర్చడానికి మార్గాలను కని పెట్టలేకపోయింది. ఇహ ఇప్పుడు సామ్యవాదులంతా ఆ ప్రభుత్వాన్ని బాహాటంగా దుయ్యబట్టసాగారు. సామ్రాజ్య వాదాన్ని ఆక్షేపించడం మొదలుపెట్టారు. దేశంలో మార్పులు శాంతి కావాలని పట్టుపట్టారు.

రాజకీయాలు ఇలా గడబిడగా ఉన్న తరుణంలో వ్లాడిమిర్ లెనిన్ యూరప్‌నుంచి తిరిగివచ్చాడు. ఆయన అసాధారణమైన వ్యక్తిత్వం, శక్తి, అంతవరకూ దుర్బలంగా, చెల్లాచెదురయిఉన్న బోల్షివిక్కులు మళ్లీ ఒకమాటుగా తమ బలాన్ని కూడగట్టుకునేట్లు చేశాయి. లెనిన్ వారికి ఒకనిర్మాణ కార్యక్రమాన్ని ఇచ్చాడు. అందులో ప్రధానంగా ఈ క్రింది అంశాలున్నాయి. 1. దేశంలో సాధారణశాంతి భద్రతలు నెలకొనేందుకు సంప్రదింపులు సాగించాలి. 2. జమీందారీలను నష్టపరిహారం ఏమీ ఇవ్వకుండా, తక్షణం ప్రభుత్వం స్వాధీన పరుచుకోవాలి. 3. కర్మాగారాలు కార్మికుల అధీనంలోఉండి, వారిచేతనే నడపబడాలి. 4. ఉత్పత్తినీ, పంపిణీని తక్షణం

జాతీయం చెయ్యాలి. 5. ప్రభుత్వం సోవియట్ కార్మిక, కర్షక, సైనికులవశం అవ్వాలి.

లెనిన్ ఇచ్చిన ఈ కార్యక్రమం జనాన్ని విశేషంగా ఆకర్షించింది. ఆశలను, ఆకాంక్షలను రేకెత్తించింది.

ఈ మార్పులవల్ల ప్రభుత్వం ఉన్నట్టుండి, నిష్ప్రభావంతో రాజీనామా చేసింది. ఏవర్గానికి చెందని ఒక కొత్త ప్రభుత్వం తిరిగి నెలకొల్పబడింది. ఈ ప్రభుత్వాన్ని నడిపేవాడు కెరెన్స్కీ. అప్పుడు తక్షణమే బోల్షివిక్కులపై తీవ్రమైన చర్యలు తీసుకున్నారు. ట్రాట్‌స్కీ, లెనిన్‌లను అరెస్టు చేయవలసిందిగా ఉత్తర్వులు జారీచేశాడు. అంతట సైనికదళాలు అవినీతికి దిగజారిపోయాయి. దేశమంతటా ఒక కొత్తరకమైన అరాజకత వ్యాపించింది. ఎక్కడా శాంతిభద్రతలు, రక్షణ, లేని లక్షణాలు గోచరించాయి. బోల్షివిక్కులు మంచి కట్టుదిట్టంతో తయారై ఉన్నారు. ఆ మరుసటిరోజే, తాత్కాలిక ప్రభుత్వం అంతమైందని వారు ప్రపంచానికి తెలియచేశారు. తుదకు ఆనాడే సోవియట్‌రష్యా, కాంగ్రెస్ ఒక కొత్తప్రభుత్వం స్థాపించడానికి అధికారం ఇచ్చింది. ఆ ప్రభుత్వం 'సోవియట్ పీపిల్స్ కమిస్సార్స్' అని పేర్కొనబడింది. దానికి లెనిన్ అధ్యక్షుడుగా ట్రాట్‌స్కీ, విదేశవ్యవహారాల మంత్రిగా నియమితులైనారు. ఈ ప్రభుత్వానికి ఆదిలోనే విజయం సిద్ధించింది. 'రాజ్యాంగ నిర్మాణ సభ' అని పేరుపెట్టి బోల్షివిక్కులు, అనుకున్నట్లుగా తమ వాగ్దానం నెరవేర్చారు. రాజ్యాంగసభకు సార్వజనిక నియోజన ఓటింగ్ పద్ధతిపై రహస్యపద్ధతిపై ఎన్నికలు జరిగాయి. ఏమైనప్పటికీ దమకు అల్పసంఖ్యాకమైన ఓట్లుమాత్రమే ఉన్నా

యని బోల్షివిక్కులు తెలుసుకున్నారు. 1918 జనవరి 18 న పెట్రోగ్రాడ్‌లో రాజ్యాంగసభ తొలిసమావేశం జరిగింది. ఆ మరుసటిరోజే బోల్షివిక్కులు రాజ్యాంగసభను రద్దుచేసి ప్రభుత్వాన్ని తమ అధీనంలోనే ఉంచుకుని పరిపాలన సాగించారు. న్యాయంగా వారు తమ అధికారాన్ని కోల్పోయినప్పటికీ, సర్వాధికారాలూ తమ చేతుల్లోనే ఉంచుకున్నారు. కాని తమ కార్యక్రమం కొనసాగదని వెంటనే తెలుసుకున్నారు. పూర్వపు వారిలాగానే తామూ, దేశీయవ్యవహారాలను, సైనిక బలాలను నడపడానికి అశక్తులమనీ, అసమర్థులమనీ గ్రహించారు.

బోల్షివిక్కుల కార్యక్రమాలలోని దేశీయ, విదేశీయ విధానాలు చూచి మిత్రరాజ్యాలవారు చాలా ఏవగించుకున్నారు స్వంత ఆస్తి ఉండకూడదనే బోల్షివిక్కుల సిద్ధాంతం. పెట్టుబడిదారి విధానాన్ని ఒక్కపెట్టుగా అణగద్రొక్కింది. ఇదే శ్రామికవర్గ నియంతృత్వానికీ, ప్రపంచ విప్లవానికీ బోల్షివిక్కుల హెచ్చరిక అయింది, ఇంతేకాక పూర్వపు ప్రభుత్వాలు చేసిన అప్పులతో తమకు సంబంధంలేదన్నారు బోల్షివిక్కులు. ఇది పశ్చిమరాజ్యాలవారికి, ముఖ్యంగా ఫ్రాన్సుకు గొప్ప నష్టం కలిగించింది.

మిత్రరాజ్యాలపై బోల్షివిక్కులు కొట్టిన ఈ దెబ్బవల్ల, ప్రధాన రాజ్యాలతో సంధి కావించుకోవాలనే ఆకాంక్ష సోవియట్ ప్రభుత్వంలో ప్రబలింది. ఈ ప్రధానరాజ్యాలవారు ప్రతిపాదించిన సంధి షరతులు, తమ కేవిధంగానూ ప్రయోజనకరం కావని బోల్షివిక్కులు తెలుసుకున్నారు. కాని వారికి మరోమార్గం ఏదీ లేకపోయింది.

బోల్షివిక్కుల సైనికదళాలు అన్నీ — సంపూర్ణంగా విచ్ఛిన్నమైపోయాయి. బ్రెస్టులిటోవిస్కు సంధితో వారు శత్రువుకు పాదాక్రాంతు లయిపోవలసివచ్చింది. దాంతో సంపూర్ణ శాంతి నెలకొన్నది.

1914 సెప్టెంబరు 5 న మిత్రమండలితో చేసుకున్న ఒడంబడిక ఉల్లంఘించడం అలాఉంచి, బోల్షివిక్కులు జర్మనీతో వ్యతిరేకంగా చేసుకున్న ప్రత్యేకసంధి, మిత్రమండలి విధానానికి, హక్కులకు విపరీతంగా దెబ్బకొట్టింది. రష్యన్‌లు జర్మనీతో సంధి కావించుకున్న కారణాన, పశ్చిమరాజ్యాలవారి పటాలాలు వృద్ధి అవడమే కాకుండా, ఆ సైన్యాలకు అవసరమైన ఆహారపదార్థాలు, యుద్ధసామాగ్రులు సమకూడాయి. దాంతో యుద్ధం కొనసాగించడానికి కూడా అవకాశం ఏర్పడింది. మిత్రమండలి — అనగా ముఖ్యంగా ఫ్రాన్సు, బ్రిటన్‌లు దీనికి ప్రతీకారంగా తూర్పురాజ్యాల సైనిక బలాలను తిరిగీ సమీకరించడానికి, బోల్షివిక్కు పాలనను సమూలంగా నాశనంచేయడానికి నిశ్చయించుకున్నాయి. అప్పుడు సోవియట్ రష్యా సాయుధ దండయాత్రకు, నౌకాముట్టడికి గురి అయింది. 1918 మే నాటికల్లా ఈ దౌర్జన్యపరుల బలాలు, విప్లవ ప్రతికూలుర బలాలు; అన్ని రంగాలలోనూ విజృంభించి మాస్కోనగరాన్ని ముసురులో ముంచివేశాయి.

# చైనాతో భాహాటమైన సంబంధాలకు సోవియట్ యత్నం

తన ఉనికికే ప్రమాదం వాటిల్లి, ఒంటరిగా దిక్కూ మొక్కూ లేకుండా, నలుదిశలా చుట్టుముట్టబడి, అన్ని దేశాలవల్లా వెలివేయబడి, పశ్చిమరాజ్యాలు, జపాన్ తనను ఎదుర్కొని, ఉన్న ఈ విషమ, విపత్కర పరిస్థితులలోనే సోవియట్ రష్యా, సైబీరియా ద్వారా చైనాతో స్నేహసంబంధాలకు చేతులుచాచింది. దాన్ని తన కౌగిలలోకి తీసుకోవాలని కాంక్షించింది. ఇది జరిగింది. జులై 26న రష్యన్ విదేశాంగ ఉపమంత్రి లియోకారఖాన్ దీనికి నాంది పలికాడు. ఆయన చైనాప్రజలను, ఉత్తరదక్షిణ చైనా ప్రభుత్వాలను ఉద్దేశిస్తూ ఒక ప్రకటన చేశాడు. ఆ ప్రకటనలో కొంతభాగం ఇలాఉంది:

"జార్ ప్రభుత్వంలో రష్యా, చైనా జపాన్‌లతోటి, ఇతరమిత్ర రాజ్యాలతోటి చేసుకున్న సంధులు, రహస్యపు ఒడంబడికలు, తూర్పురాజ్యాల ప్రజలను బానిసలుగా బంధితులుగాచేసే ఆ ఒడంబడికలు ఏవీ చెల్లవని రష్యన్ కార్మిక కర్షక ప్రభుత్వం 1917 అక్టోబరులో ప్రకటనచేస్తున్నది. జార్ ప్రభుత్వం వశపరుచుకున్న చైనావారి బంగారపుగనులు, అడవులు, గనులకు సంబంధించిన అన్నిరకాల సౌకర్యపుహక్కులు, చైనీస్ ఈస్టర్న్ రైల్వేను, ఈ సోవియట్ ప్రభుత్వం ఎలాంటి నష్ట పరిహారం అడగకుండానే చైనాప్రజలకు తిరిగే ఇచ్చివేస్తున్నది... చైనాప్రజలు ఒక్కవిషయం గమనించాలి—వారి స్వాతంత్ర్య

సమరంలో పాలుపంచుకునే మిత్రులు, సోదరులు రష్యా కార్మిక కర్షక ప్రజలు, వారి ఎర్రసైన్యం తప్ప మరెవ్వరూ కారు."

ఈ ప్రకటన 1920 మార్చి 26 న చైనాకు అందింది. వెంటనే చైనాప్రజల్లో ఒక విధమైన ఉత్సాహం వెల్లివిరిసింది. వెర్సెయిల్స్ సంధితో సతమత మయిపోతున్న చైనీయుల కిది ఒక ఆశాజ్యోతి అయింది. సోవియట్‌నుంచి ఇంత తేలిగ్గాను, ఉదారంగాను వచ్చిన ఈ ప్రకటనకు చైనా తన నిరాకరణను వెలిబుచ్చనూ లేదు. ఆతృతతో కార్యకలాపాల్లోకి దిగనూ లేదు. దీనికి ఒక ముఖ్యకారణం వున్నది. 1920 మార్చినాటికే పెకింగ్ ప్రభుత్వం, వెలుపలి మంగోలియామీద, చైనా తూర్పు రైల్వేమీద అధికారం హస్తగతం చేసుకున్నది. రష్యాలో బోల్షివిక్కుల విప్లవంవల్ల మంగోలియాలో పరిస్థితులు తీవ్రమక అయ్యాయి. 1919 శిశిరఋతువు చివరలో తన రాజరికపు హక్కులను పునరుద్ధరించేకోర్కెను వెలిబుచ్చుతూ చైనా, వెలుపలి మంగోలియాకు సైన్యాలను పంపింది. కుటుక్తూను తిరిగీ ప్రజాస్వామిక పాలనలో వచ్చి చేరవలసిందిగా ఒత్తిడి చేసింది.

చైనా తూర్పురైల్వేలో కొంతభాగం అదివరకే చైనీయుల అధికారంక్రిందికి వచ్చింది. ఆనాటితో పూర్తిగా రక్షణక్రిందికి వచ్చింది. 1917 డిసెంబరు 12 న బోల్షివిక్కుల ఏజంట్లు తామే అసలైన కార్మికులమనీ, సైనికప్రతినిధులమనీ చెప్పుకుంటూ బలవంతాన ఆరైల్వే నిర్వహణాధికారం చేపట్ట డానికి సమర్థులయ్యారు. కిరిన్‌రాష్ట్ర మిలిటరీగవర్నరు, రైల్వే అధికారం వదులుకోవలసిందిగా వాళ్ళకొక హెచ్చరికచేశాడు.

నిరాయుధులైన బోల్షివిక్ సైనికులు సైబీరియాను తరిమివేయ బడ్డారు. 1900లో జరిగిన బాక్సర్ అల్లర్లలో రష్యన్లు కాజేసిన ఈ రైల్వేహక్కులను ఇప్పుడు చైనావారు తిరిగి సంపాదించుకున్నారు.

పెకింగ్ ప్రభుత్వం కాలంకోసం నిరీక్షిస్తూ ఉండగలిగింది. సోవియట్తో సంబంధ బాంధవ్యాలు నెరిపే అవకాశం వచ్చి నందుకు సంతోషించినప్పటికీ, కారఖాన్ చేసిన ప్రకటన చైనా ప్రభుత్వాన్ని అంతగా ఆకర్షించలేదు. ఈలోగా రష్యాలో బలాలన్నీ వ్యతిరేకంగా మారనూలేదు, 1919 ఆఖరుకల్లా నాశనం కావడమూ జరగలేదు. కారఖాన్ ప్రకటనచేసిన సంవత్సరానికి ముందటేడు రష్యాలో చాలా తీవ్రమైన మార్పులొచ్చాయి. అవి మంచికి త్రోవతీశాయి. 1920 వేసవిలో, చైనా - రష్యాలు సంబంధబాంధవ్యాలకు పూను కునేనాటికి రష్యా, విదేశసైనిక శృంఖలాలనుండి బయటపడింది. ప్రభుత్వం గట్టిగా నిలద్రొక్కుకోగల ధైర్యం ఏర్పడింది. ఇంకా చెప్పాలంటే విదేశాంగ విధానం ఒక స్థిరరూపం దాల్చింది. 1919లో కారఖాన్ ప్రకటన నాటికంటెకూడా ఎక్కువ స్థిరత్వాన్ని పొందింది.

1920 అగస్టు ఆఖరుకల్లా పెకింగ్కు ఒక రష్యన్ ప్రతి నిధివర్గం వచ్చింది. దానికి నాయకుడు ఇగ్నేషియస్ యోరిన్. తాను దూరప్రాచ్య ప్రజాస్వామిక రాజ్యాల ప్రతినిధినని అతను చెప్పుకున్నాడు. అనగా సోవియట్చే నిర్మితమైన తటస్థరాజ్య ప్రతినిధినని అన్నాడు. అతనిమాట ఎవరూ సందేహించలేదు. కాని అతను నిజానికి నేరుగా రష్యాప్రతినిధే. తనువచ్చినది

వాణిజ్యసంబంధాలను పెంపొందించుకోడానికేనని అతను తెలియ జేశాడు. వాస్తవంగా తాను రావడంలో ఉద్దేశం, హెచ్చు తగ్గులుగాఉన్న ఒడంబడికలను రద్దుచేయడానికీ, వాటిస్థానంలో సక్రమమైన కొత్తఒడంబడికలను రూపొందించడానికేనని అనేక మార్లు అతను చూచాయగా వెలిబుచ్చాడు.

నవంబరు 30 న చైనా దూరప్రాచ్య ప్రజాస్వామిక దేశాలమధ్య వాణిజ్యపు ఒడంబడికలను సూచించాడుయూరిన్. ఈ సూచనకు చైనా విదేశాంగమంత్రిత్వం వ్యతిరేకిస్తూ కొన్ని నిర్దుష్టమైన కోర్కెలను కోరింది రష్యా చైనా సరిహద్దుల్లో ఎలాంటి ప్రచారం చేయరాదనీ, సైబీరియాలో నివసించే చైనా వారికి ఈ విప్లవపు గందరగోళం జరిగినకాలంలో కలిగిన నష్టా లకు పరిహారం చెల్లించాలనీ, మొదలయిన కోరికలు అందులో ఉన్నాయి. నిర్దుష్టమైన వివరణతో కూడిన ఒక ఒడంబడిక తయారుకావించబడింది. ఏమైనప్పటికీ జులై ఆఖరుకు పరిస్థితులు పూర్తిగా తారుమారయ్యాయి. పెకింగ్ ప్రభుత్వం ఇకఏమాత్రం ఆ ఒడంబడికకు సంబంధించిన సంప్రదింపులకు ఇష్టపడలేదు.

బహుశా పెకింగ్ ప్రభుత్వంయొక్క ఈ మార్పిడిలోగల ఉద్దేశం, తలవని తలంపుగా వచ్చిన రెండుకారణాలు కావచ్చు. మొదటిది, వెలుపల మంగోలియాలో జరిగిన చిత్రవిచిత్రమైన మార్పులు, రెండవది సోవియట్ రష్యా పురికొల్పిన మంగోల్ విప్లవపక్షం, దాని సైనికదళాలు. "1921లో రష్యన్ ఎర్రసైన్యం మంగోలియన్ దుస్తులతో మారువేషాలువేసుకుని మంగో లియాకు వెళ్ళడం, అక్కడ జనసామాన్యంలో కలిసి మంగోల్ విప్లవకారులుగా నటించడం, స్వతంత్ర మంగోలియా ప్రజా

ప్రభుత్వ స్థాపనకు యత్నించడం; ఇవన్నీ నేను నా కళ్లార చూశాను." (ఈ మాటలు "దూరప్రాచ్య దేశాలలో రష్యా రాజనీతి" అన్న గ్రంథంలో ఫెజోర్ మన్స్వెటోవ్ వ్రాసినవి) మంగోలియా ప్రజాప్రభుత్వం అనబడే ఒక కొత్తపరిపాలన ఆరంభమైంది. నెలాఖరుకల్లా మంగోలియానుండి సేనలను తరలించకుండా ఉండేటట్లు సోవియట్ ప్రభుత్వానికి ఈ కొత్త ప్రభుత్వం ఒక విజ్ఞాపన పంపింది. తత్ఫలితంగా పెకింగ్ ప్రభుత్వం సోవియట్ రష్యాతో కాని లేక దాని దూరప్రాచ్య ప్రజా ప్రభుత్వాలతో కాని ఎలాంటి ఒడంబడికలు చేసుకోడానికి ఇది తగిన సమయంకాదని అనుకున్నది.

యూరిన్ రాయబారం విఫలంకావడానికి వాషింగ్టన్ చర్చలు మరికొంత దోహదం చేసిఉంటాయి. ఆతరుణంలో చైనాకు రష్యాతో సంబంధాలకంటె ముఖ్యంగాను, తొందరగాను పరిష్కరించవలసిన స్వకీయసమస్యలు అనేకం ఉన్నాయి: ఈసమస్యలు సంతృప్తికరంగా పరిష్కారం కావడానికి చైనా, ఆ చర్చల్లో అమెరికా తోడ్పాటుకు ఎదురుచూస్తోంది. ఆ సమయంలో సోవియట్ రష్యాపట్ల అమెరికా సంయుక్త రాష్ట్రాల దృక్పథం స్నేహావిదూరంగా ఉండడంవల్ల, సోవియట్లతో స్నేహసంబంధాలు నెరపడం అంత మంచిదికాదని చైనా కూడా ఉద్దేశించింది.

వాషింగ్టన్ చర్చలవల్ల చైనాతో పొత్తుకలవడానికి మాస్కో ఇంకా ఎక్కువ ఔత్సుక్యాన్ని కనపరిచింది. చైనా, పాశ్చాత్యరాజ్యాల కౌగిళ్ళలో ఒదిగిపోతుందేమోనని భయపడిందికూడా. సోవియట్ ప్రభుత్వం, రాజ్య తంత్రజ్ఞులతో

కూడిన మరో దౌత్యవర్గాన్ని పంపింది. ఈ ప్రతినిధివర్గానికి ఒక ప్రసిద్ధమైన, సమర్థుడైన రాజకీయ దురంధరుడు నాయకుడు. ఆయన పేరు అడాల్ఫ్ జోఫ్. చైనాతో నిలిచిపోయిఉన్న అన్ని సమస్యలను పరిష్కరించడానికి సోవియట్ ప్రభుత్వం అతనికి అధికారం ఇచ్చింది. ఆసమస్యల్లో మంగోలియాసమస్య, చైనా తూర్పు రైల్వే సమస్య కూడిఉన్నాయి. చైనా విదేశాంగ మంత్రి డాక్టర్ వెల్లింగ్ టన్ కు, ఈ సంప్రతింపులు ప్రారంభం కాకముందే మంగోలియాలో ఉన్న సోవియట్ సైన్యాలను తరలించవలసిందిగా షరతు పెట్టాడు.

దానికి జవాబుగా జోఫ్, చైనా విదేశాంగమంత్రిత్వానికి ఒక లేఖ పంపాడు. సోవియట్ సైన్యాలను మంగోలియా నుంచి తరలించడంవల్ల చైనా, రష్యా, మంగోలియాల శత్రువులకు లాభంకలిగించినవారం అవుతాం. మంగోలియాపై దండయాత్రలు సాగించడానికి చైనా సరిహద్దులను స్థావరంగా ఉపయోగించుకుంటున్న 'వైట్ గార్డ్సు' ఇది మరింత సావకాశాన్ని కలిగిస్తుంది- అని అతను ఆ లేఖలో సూచించాడు.

సోవియట్ ప్రతినిధివర్గం చైనా విదేశాంగమంత్రిత్వానికి ఈ ప్రతినిధివర్గం మరోలేఖను పంపింది. 1919, 1920 లలో కావించబడిన ప్రకటనలను ఇంకా గౌరవిస్తామనీ, ఆ పద్ధతినే ఆధారంగా తీసుకుంటామనీ చైనాలో తమకు ఉండబడే హక్కులన్నిటినీ వదులుకొని వారికి సంపూర్ణమైన స్వేచ్ఛను ఒసంగుతామనీ, నిష్పక్షపాతంగా వ్రాసింది.

చైనా శాంతికోసం పాటుపడుతుందని డాక్టర్ కూ మొట్టమొదట చెప్పాడు. ఇటు తెల్లవారిని కాని, అటు ఎర్ర సైనిక

లను కాని సమర్థించమని స్పష్టపరిచాడు. చివరకు చైనా తూర్పు రైల్వే పైగల హక్కులను, అధికారాలను ఎట్టి నష్టపరిహారం లేకుండా తిరిగి చైనాకు హస్తగతం చేయవలసిందిగా సోవియట్ ప్రభుత్వాన్ని కోరాడు. దానికి ఆధారంగా 1919 లో కార ఖాన్ ప్రకటనలోని ఈ క్రింది పంక్తులను ఉదాహరించాడు :

"సోవియట్ ప్రభుత్వం ఎట్టి నష్టపరిహారం కోరకుండానే చైనా తూర్పురైల్వేను చైనాప్రజల చేతుల్లో పెట్టడానికి సిద్ధంగా ఉంది."

డాక్టర్ కూ చెప్పినట్లు 1919 ప్రకటనలో ఈ రైల్వేవిష యంలేదని సోవియట్ ప్రతినిధివర్గం పేచీపెట్టింది. ఔటర్ మం గోలియాను విడిచివెళ్ళడానికి సోవియట్ ప్రభుత్వం అయిష్టతకన పరచడంతోను, ప్రతినిధివర్గం కారఖాన్ ప్రకటనను మార్చుతూ, త్రిప్పిచెప్పుతూ రావడంతోను, ఒడంబడికలు సఫలీకృతం కావడానికి ఎక్కడా ఆశ కనుపించలేదు.

అదే తరుణంలో జపాను వ్యతిరేకభావాలు బాగా అభి వృద్ధి చెందుతూ వున్నాయి. సాంఘిక, రాజకీయ కల్లోలాల పొంగు ఇలా ఉండగా ఒక కొత్తవార్త పాక్కింది. 1919 ప్రక టనకు మూలపురుషుడైన వియోకారఖాన్, చైనాకువెళ్లే ఒక ప్రత్యేకప్రతినిధివర్గానికి నాయకుడుగా నియమితుడైనట్లు తెలి సింది. రష్యా ప్రతిపాదనను ఎదిరించడానికి పెకింగ్ ప్రభుత్వం మార్చి 28న, "చైనా సోవియట్ సంప్రదింపులసంఘా" నికి డైరెక్టర్ అయిన డాక్టర్ సి. టి. వాంగ్‌ను నియమించింది. కారఖాన్, వాంగ్‌లమధ్య సాధారణ ధోరణిలో సంప్రతింపులు కొనసాగాయి. తొలిసంభాషణలలోనే సోవియట్‌రష్యా,

చైనానుగుర్తించడాన్నిగూర్చి ప్రస్తావనలు జరిగాయి. డాక్టర్ వాంగ్, తనమటుకుతాను రెండు దేశాలమధ్య సాధారణ సంబంధాలు, స్పష్టమైన అభిప్రాయాలతో ఉండాలనీ, నిలిచిఉన్న అభి సమస్యల పరిష్కారం మామూలుగా జరిగిపోవాలనీ అనుకుంటున్నట్లు తెలియపరిచాడు.

ఆవిధంగా కారఖాన్, వాంగ్‌ల సంప్రతింపులు ఒక కొలిక్కి రాకుండా, నిలిచిపోయాయి. ఇద్దరూ ఎవరిమటుకు వారు తమ పంథాలు సక్రమమైనవని విశ్వసిస్తూ వచ్చారు.

ఇలా చాలాకాలం జరిగినతరువాత 1924 మే 31 నాడు చైనా రష్యాలు ఒక సాధారణమైన నిశ్చయానికి వచ్చినట్లు, సంతకాలుచేసి ప్రకటనను వెలువరించారు. సాధారణ సూత్రాలలో ఒక పరిష్కారం కుదిరినట్లు ఒడంబడికను పూర్తిచేశారు. చైనా తూర్పురైల్వేపై తాత్కాలిక అధికారమును గురించి కూడా ఒక నిర్ధారణకు వచ్చారు. ఇంకా ఏడు ప్రకటనలపైన, ఒక మార్పిడిపత్రంపైన సంతకాలు చేశారు. ఇవి విస్తృతమైన విషయాలు. అనేకమైనవాటిని పరిష్కరించాయి. ఆ ప్రకటనలో ఒకవిషయానికి ఒకవిషయం సంబంధించి ఇలా పొందుపరిచి ఉన్నాయి.

1. రెండు దేశాలమధ్య రాజకీయ సంబంధబాంధవ్యాలు తిరిగి వెంటనే పెంపొందాలి. 2. సాధారణ సూత్రాలపై జరిగిన ఒడంబడికపై సంతకాలు అయిన ఒక నెలలోపల, నిలిచిపోయిన సమస్యలమీద సంపూర్ణమైన ఏర్పాట్లు జరగడానికిగాను ఒక గోష్ఠి ఏర్పాటు చెయ్యాలి. 3. చైనా హక్కులను, అధికారాలను భంగపరిచే జారిస్ట్ప్రభుత్వకాలంలోని సంధులు,

ఒడంబడికలు సోవియట్ ప్రభుత్వం రద్దుచేయ్యాలి. 4. రెండు దేశాల అధికారాలకు, హక్కులకు భంగపాటుకలిగే ఏరకమైన సంధులుగాని ఒడంబడికలుకాని ఇకముందు ఈ రెండు దేశాలూ జరుపరాదు. 5. చైనా అధికారాలకు, హక్కులకు దెబ్బతగిలే ఏసంధికాని, ఒడంబడిక కాని సోవియట్ రష్యా మరొక దేశంతో కాని, దేశాలతోకాని నెరపడం జరిగితే, చైనా దాన్ని గుర్తించదు, గుర్తించబోదు. 6. ఔటర్ మంగోలియా చైనాలో అంతర్భాగం, అక్కడ చైనా సంపూర్ణాధికారం సోవియట్ గుర్తించాలి. 7. విషయ నిర్ణయసభలో నిర్ణయింపబోయే విధంగా మంగోలియాలోని సోవియట్ సైన్యాలను తరలించాలి. 8. రెండు దేశాలవారూ, వారివారి సరిహద్దుల్లో తమ ప్రభుత్వాలను పడగొట్టే ఏరకమైన ముఠాలగాని, శక్తులగాని ఉంచరాదు. సాంఘికపద్ధతులలోగాని, రాజకీయ పద్ధతులలోగాని పరస్పర వ్యతిరేకప్రచారాన్ని సాగించడం పనికిరాదు. 9. బాక్సర్ అల్లర్లలో రష్యాకు ముట్టవలసిన నష్టపరిహారం సోవియట్ ప్రభుత్వం వదులుకోవాలి. 10. తన సరిహద్దులకు ఆవలగల హక్కులను, రాజకీయ అధికారాలను సోవియట్ ప్రభుత్వం వదలుకోవాలి. 11. విషయ నిర్ణయసభ నిర్ణయించే సమస్య అలా ఉంటూఉండగా, చైనా తూర్పురైల్వే వాణిజ్యానికి సంబంధించినంతవరకూ ఉమ్మడి అధికారానికి లోబడి ఉండాలి.

ఈ వివిధ ప్రకటనలపైన, ఒడంబడికలపైన సంతకాలు జరిగిన అనంతరం, చైనా విదేశాంగశాఖ ఉభయదేశాలమధ్య మామూలు సంబంధబాంధవ్యాలు తిరిగి కొనసాగుతున్నట్లు

తెలియచేసే ఒక పత్రాన్ని విడుదలచేసి కారఖాన్‌కు అంద జేసింది. అంతట చైనా రష్యాల ప్రతినిధులు ఒకరికొకరు అభి నందనలు తెల్పుకున్నారు. చైనా-సోవియట్ల సంబంధాలను సంతృప్తికరంగా పరిష్కరించుకోడానికి చేసిన సుదీర్ఘ ప్రయ త్నాలు అప్పటికి ఫలించాయి.

చైనా రష్యాల సంబంధ బాంధవ్యాలను గురించి పెకింగ్‌లో ఇలా సంప్రతింపులు జరుపుతూ ఉండగా, దక్షిణాన ఉన్న ముఖ్యనగరమైన కాంటన్‌లో సోవియట్‌వారు అత్యంత ప్రధానమైన రాజకీయ సంఘటనలలో చిక్కుకున్నారు ఈ గందరగోళాన్ని తెచ్చిపెట్టినవాడు ప్రబలమైనవ్యక్తి డాక్టర్ సన్‌ యెత్ సేన్.

తన రాజకీయజీవితం పొడవునా చైనా దేశపు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకోసం నిర్దాక్షిణ్యమైన సంఘర్షణలో నిమగ్నం కావిస్తూ వచ్చాడు డాక్టర్ సన్. 1912 లో తన అధ్యక్షపదవికి రాజీనామా ఇచ్చిన తరువాత ఆయన, చైనాలో నియమబద్ధ మైన ప్రభుత్వాన్ని అమలుపరచడంకోసం, అహర్నిశలూ వేయి కళ్ళతో కనిపెట్టిఉన్నాడు. త్వరలోనే ఆయనకు అసంతృప్తి వెల్లడించడానికి కావలసినంత కారణం దొరికింది. 1917 జూన్‌లో అధ్యక్షుడు లియున్-హూంగ్ పార్లమెంటును రద్దు చేశాడు. అలా చేయడంవల్ల అనేకమంది కోమిన్‌టాంగ్ సభ్యులు దక్షిణదిశకు - షాంగైకీ, కాంటన్‌కూ పలాయితు లయ్యారు. ఈ మార్పులకు ప్రతిక్రియగా డాక్టర్ సన్, ఆయన పక్షీయులు రాజ్యాంగరక్షకులుగా పాత్రవహించి పెకింగ్ ప్రభుత్వం నియమబద్ధమైంది కాదని ప్రకటించారు. కాంటన్‌లో

ఒక నియమబద్ధమైన ప్రభుత్వం స్థాపించడంకోసం సన్నాహాలు చేశాడు. ఈకాలంలో డాక్టర్ సన్, అనేకమైన రాజకీయ ఒడుదుడుకులను శరవేగంతో ఎదుర్కొనవలసి వచ్చింది. ఒక సంవత్సరం ఆయన కాంటన్‌లో ప్రభుత్వం నడిపేందుకు అక్కడికి తరలి వెళ్ళాడు. మరోఏడు ఆయన, స్థానిక సైనిక దళాలచే వ్యతిరేకింపబడి షాంగైకి పలాయితుడైనాడు. 1918 నుండి 1923 వరకు- ఈ అయిదేండ్లలోనూ అతనిలా కనీసం నాలుగు సార్లు పారిపోవలసివచ్చింది. ఇలా తనజీవితంలో తీవ్రమైన ఆశాభంగానికి గురి అయిన తరుణంలో ఒకేఒక విశ్వాసపాత్రుడు ఆయనప్రక్కన అండగా నిలుచున్నాడు. అతనే చాంగ్‌కై-షేక్. డాక్టర్ సన్, ఆయన భార్య మడాంసన్‌లతోపాటు చాంగ్‌కై-షేక్ నిశ్చలుడై నిలుచుని తన విశ్వాసం ప్రకటించాడు.

## రష్యాతో సహకారం :

రాజకీయ అంధకారం అలుముకున్న ఈ సమయంలోనే డాక్టర్ సన్, సోవియట్ ప్రతినిధి అయిన అడాల్ఫ్‌జోఫీని 1923 జనవరిలో షాంఘైవద్ద కలుసుకున్నాడు. చైనా అభివృద్ధికోసం డాక్టర్ సన్ ఇంతకుముందు పశ్చిమ ప్రజాస్వామ్య ప్రభుత్వాల సహాయం అర్థించాడు. కాని సఫలుడుకాలేదు. ఇక ఇప్పుడు ఆయన సోవియట్‌రష్యాపై దృష్టి మళ్ళించాడు. చైనాలో కమ్యూనిజం వ్యాప్తినిగురించి డాక్టర్ సన్, జోఫీలు సంతకాలు చేసి ఒక సంయుక్తప్రకటన అత్యంత త్వరితగతి ప్రజలను ఆకర్షించింది. ఎంచేతనంటే ఇది ముఖ్యంగా సోవియట్‌రష్యా,

కోమింగ్‌టాంగ్‌లమధ్య ముందుఉండబోయే సహకారానికి ప్రాతిపదిక కాబట్టి. ఈ ప్రకటనలో కొంతభాగం ఇలా ఉంది :

"సోవియట్ రష్యా పద్ధతికాని, కమ్యూనిస్టు పద్ధతిని చైనాలో యధాతథంగా అమల్లో పెట్టకూడదని డాక్టర్ సన్ ఉద్దేశిస్తున్నాడు. కారణం ఇక్కడిపద్ధతులు అటు సోవియట్ విధానాన్నిగాని, ఇటు కమ్యూనిస్టు సిద్ధాంతాన్నిగాని నెలకొల్ప డానికి సరిపడేటట్లులేవు. ఈ ఉద్దేశాన్ని జోఫీ పూర్తిగా సమ ర్థిస్తున్నాడు. అంతేకాదు. చైనా, జాతీయ ఐకమత్యాన్ని సంపాదించడం, జాతీయస్వాతంత్ర్యాన్ని నెలకొల్పడం, అత్యంత ప్రధానమనికూడా అతను భావిస్తున్నాడు. ఈ విషయంలో డాక్టర్ సన్‌పట్ల చైనాప్రజల పూర్తిసహకార సానుభూతులు ఉండగలవనికూడా అతను ఉద్ఘాటిస్తున్నాడు."

ఫిబ్రవరి ఆఖరున డాక్టర్ సన్ కాంటన్‌కు తిరిగివచ్చి ప్రభుత్వానికి అధినేతగా అధికారం స్వీకరించాడు. అతను అధి కారంలోకి వచ్చినవెంటనే, సోవియట్ రష్యాతో సంబంధ బాంధవ్యాలను నెరవడానికి తగిన విధానాలను అమలులో పెట్టాడు. 1923 ఆగస్టులో డాక్టర్ సన్, చాంగ్ కై-షేక్‌ను తన రహస్యప్రతినిధిగా మాస్కోకు పంపాడు. అక్కడ లెనిన్, ట్రాట్‌స్కీ, స్టాలిన్‌లను కలుసుకొని కమ్యూనిస్టు, ఎర్ర సైన్యాల నిర్మాణానికి అవసరమైన విప్లవవిధానాలను పరిశీలించి తెలుసుకరావలసిందిగా అతనిని ఆదేశించాడు. ఆ సంవత్సరంటి నెలలో మైఖేల్ బొరోడిన్ కొమిన్‌టాంగ్ ప్రధాన సలహా దారుగా మాస్కోనుంచి కాంటన్‌కు వచ్చాడు.

రష్యా సహకారంలో గల ముఖ్యోద్దేశం చైనా తన దేశంలోని సైనికపాలనను రూపుమాపడం, విదేశీయ సామ్రాజ్యవాదం నుండి విముక్తి చెందడం, జాతీయ ఐకమత్యమును, స్వాతంత్ర్యాన్ని సంపాదించడం, ఇందుకు చైనా ప్రజలలో జాతీయ భావాలను రేకెత్తించడం– ఇంతేకాని రష్యా కమ్యూనిజాన్ని చైనాలో బోధించడానికి కాదు. బొరోడిన్, లెనిన్, జోఫీల తోటి ఒకవిషయం స్పష్టపరిచాడు. చైనా, కమ్యూనిజాన్ని స్వీకరించే పరిస్థితికి ఇంకా రాలేదనీ, మొట్టమొదట పెట్టుబడిదారీ వ్యవస్థనుంచి బయటపడి ఆర్థికాభివృద్ధిని సాధించవలసిన అవసరం ఉన్నదనీ వ్యక్తంచేశాడు.

కొమిన్‌టాంగ్, సోవియట్ల సహకారానికి ప్రాతిపదికగా ఈ క్రింది షరతులను రూపొందించారు:

1. బొరోడినును, అతనివెంటవచ్చిన రష్యను నిపుణులు తమ స్వంతబాధ్యతతో కొమిన్‌టాంగుకు సహాయపడాలి. వారు సోవియట్ ప్రభుత్వపు ప్రతినిధులుకారు, ఏజంట్లు కారు. 2. వారు కొమినుటాంగ్‌వల్ల ఎప్పుడైనా తొలగించబడవచ్చు. 3. వారు సోవియట్ ప్రభుత్వంతో గల సంబంధాలనుండి ఏ క్షణంలోనైనా తొలగించబడవచ్చు. వారికి తమతో సమానమైన హోదాగల చైనా ఉద్యోగులవలెతప్ప వేరే ప్రత్యేకపు హక్కులు, అధికారాలు ఇవ్వబడవు.

ఈ పైఉద్దేశాలతోటే డాక్టర్ సన్ వారి సహకారాన్ని ఆశించి బొరోడినుకు చెవిఒగ్గాడు. రష్యను నిపుణులకు ప్రభుత్వము యొక్క, పార్టీయొక్క వివిధశాఖలలో స్థానం ఇచ్చాడు. ఈ రష్యను నిపుణులంతా విప్లవ యుద్ధతంత్రాలలోను కార్మిక

కర్షక వర్గాలను రాజకీయ అవసరాలకు వినియోగించడంలోను ఆరితేరిన ఘటికులు. వారు తమ ప్రతిభనంతా ఉపయోగించి కొమింటాంగ్‌ను పార్టీ నిర్మాణపద్ధతులలో దృఢతరం కావించారు. కార్యరంగంలో నిర్మాణాత్మక కృషి కావించేదాన్నిగా మార్చివేశారు.

సోవియట్ నిపుణులలో అత్యంత సమర్థుడు, ప్రముఖుడు అయిన బొరొడిన్ కాంటన్‌లో దిగీదిగడంతోనే, డాక్టర్. సన్ అనేక ప్రాజక్టులు ప్రారంభించాడు. ప్రజల మద్దతును, సానుభూతిని చూరగొనే పద్ధతు లనేకం అమలులో పెట్టాడు. రాబోయే విప్లవానికి రాచబాటవేశాడు. రాజకీయ, సైనిక స్తోమతను కలిగించాడు. ఉద్యోగులకోసం వాంగ్‌పో సైనిక పరిషత్తు నొకదాన్ని స్థాపించాడు. 1924లో వేసవిలో చాంగ్ కై–షేక్ మాస్కోనుంచి తిరిగిరాగానే, ఆ పరిషత్తుకు ప్రధానోద్యోగిగా నియమితుడైనాడు. నలభైమంది రష్యానిపుణులు బోధకులుగాను, సలహాదారులుగాను అందులో పనిచేయసాగారు. ఈ పరిషత్తుయొక్క ప్రధానోద్దేశం సైనికోద్యోగులను యుద్ధతంత్ర నిపుణులుగా తయారుచేయడంమాత్రమే కాకుండా, రాబోయే విప్లవపు సాంఘిక, రాజకీయప్రాముఖ్యాన్ని గుర్తించగలిగే ప్రముఖులుగా తయారుచేయడమే.

డాక్టర్. సన్‌కూడా మానసికమైన యుద్ధతంత్రాలకు ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చాడు. అంచాతనే మూడు ముఖ్య ప్రజాసూత్రాలను ఉద్ఘాటిస్తూ బహిరంగ ఉపన్యాసా లనేకం ఇవ్వసాగారు. ఆ మూడుసూత్రాలు ఇవి: 1. జాతీయత. 2. ప్రజాస్వామ్యం. 3. జీవనోపాధి. ఈ ప్రసంగాలు పత్రికల్లో

ప్రచురితం కాబోయేముందు, వాటిని జాగ్రత్తగా సమీక్షించి సరిదిద్దాడు డాక్టర్. సన్. ఈ ప్రచురితమైన ప్రసంగాలకు "సన్ మిన్‌చూ!" అని పేరుపెట్టారు. అది ఉత్తర దండయాత్ర తర వాత వెన్నాడిన మానసిక కలహంలో ప్రముఖపాత్ర వహిం చింది. అందుచేతనే అది జాతీయచైనాకు ఒక "రాజకీయ మత గ్రంథం" అయింది.

మరో ముఖ్యపథకం ఏమనగా కొమిన్‌టాంగ్‌ను పూర్తిగా పునర్నిర్మించడం. డాక్టర్. సన్ రష్యన్ కమ్యూ నిస్టుపార్టీ నిర్మాణాత్మక కృషికి ఎంతగానో సంతృప్తిచెందాడు. తన పార్టీ నిర్దుష్టంగా నిర్వచించబడిన సూత్రాలపై నడవాలనీ, నిర్దుష్టమైనపంథాలు త్రొక్కాలనీ, నైతికాభివృద్ధిచెందిన ఒక గొప్ప సంస్థగా రూపొందాలనీ, వాటిని ఆధారంగా చేసుకుని నాయకులు పార్టీని నడపాలనీ నిర్ణయించుకున్నాడు.

1924 జనవరి 20 న కాంటన్‌లో తన అధ్యక్షతన పార్టీ కాంగ్రెస్ నొకదాన్ని సమావేశ పరిచాడు డాక్టర్ సన్. ఆ తరువాత "మేనిఫెస్టో" ఒకటి ప్రకటించాడు. అప్పటినుంచీ ఆపత్రం చరిత్రలో ఒక ప్రముఖస్థానాన్ని ఆక్రమించింది. ఆ "మేనిఫెస్టో" మూడుభాగాలుగా విభజించబడింది. మొదటి భాగం చైనాలో వచ్చిన 1911 విప్లవ పరిస్థితులను సమీక్షిం చింది. జాతీయ విముక్తికొరకు నిర్వచింపబడిన అనేక కార్య క్రమాలను గురించి సహేతుకంగా ప్రస్తుతించింది. పైమూడు సూత్రాలపై, అన్ని వర్గాలకూ ప్రాతినిధ్యం ఇవ్వబడిన సరియైన ప్రజాప్రభుత్వ స్థాపనకు ఇదే చక్కటి నాంది – అని ముగింపు వాక్యాలు పలికింది.

రెండవభాగంలో "మూడు ప్రజాసూత్రాల"పై స్పష్టమైన వ్యాఖ్యానం ఇవ్వబడింది. పార్టీకీ తక్కిన అన్ని సాంఘిక వర్గాలకూ మధ్య ఉండవలసిన సహకారావశ్యకతనుగూర్చి పునరుద్ఘాటించబడింది. జాతీయ విప్లవానికి అంతిమవిజయం, కార్మిక కర్షకవర్గం కార్యరంగంలో దూకడంమీద ఆధారపడి ఉంటుందని నొక్కి చెప్పబడింది. కాబట్టి కొమిన్‌టాంగ్, కార్మిక కర్షక ఉద్యమాలకు అండగా ఉంటుందనికూడా పేర్కొనబడింది.

ఇక మూడవభాగం: చైనా స్వదేశీయ రాజకీయాలను విదేశీ సంబంధాలనుగూర్చి తీసుకోనవలసిన అనేక నిర్దుష్టచర్యలను వివరించింది. ఈ చర్యలలో అక్రమమైన సంధులు, ఒడంబడికలు రూపుమాపడం, జాతిని మూడుదశలలో పునర్నిర్మించడం, అతి ముఖ్యమైనవి. జాతిని పునర్నిర్మించవలసిన మూడుదశలు ఇవి: సైనిక విజయం, రాజకీయ సంరక్షణ, నియమబద్ధమైన ప్రభుత్వం.

డాక్టర్‌సన్ ప్రతిపాదించిన 'మేనిఫెస్టో'లో వర్గకలహాన్ని, వర్గనియంతృత్వాన్ని వ్యతిరేకిస్తూ అన్నివర్గాల సహకారంతో నడవాలనే ముఖ్యసూత్రం, ఆయన రాజకీయతత్వానికి ప్రశంసాపాత్రమైనవిషయం అయింది. ఏమైనప్పటికీ బొరొడిన్‌కు ఈ అభిప్రాయం సోవియట్ పద్ధతులపై రైతుసంఘాలు, కార్మిక సంఘాలు నిర్మించుకునేందుకు ప్రథమ సోపానంగా, తన కుటిల తంత్రానికి దోహదంగా పనిచేసింది. పార్టీ కాంగ్రెస్‌కూడా కొమిన్‌టాంగ్‌లో చైనా కమ్యూనిస్టుల చేరికకు అనుకూలంగా ఒక తీర్మానాన్ని చేసింది.

అయితే చైనాలో మొట్టమొదట కమ్యూనిస్టులు బయలు దేరడం ఎలావచ్చింది? 1918 నవంబరు 24 ముందు స్టాలిన్ ఒక ప్రకటనచేశాడు. కమ్యూనిస్టుపార్టీ కర్తవ్యం అణగారిపోయిన ప్రాచ్యప్రజానీకాన్ని మేల్కొలపడం. విప్లవాత్మకమైన శక్తితో స్వాతంత్ర్యసాధనకు పురికొల్పడం. రాచరికాన్ని కూలద్రోసే టందుకు పోరాటం సాగించడానికి ప్రోత్సహించడం – ఇదేనని ఆయన స్పష్టపరిచాడు.

తరువాత సోవియట్ప్రభుత్వం యూరప్పైదృష్టి మరల్చింది. అపజయం పొందిన అక్షరాజ్యాలు ముఖ్యంగా జర్మనీ, హంగరీలలో శ్రామిక విప్లవాన్ని లేవదీసి, శ్రామిక నియంతృత్వం స్థాపించడంకోసం ఆతృతతో ఎదురుచూడ సాగింది. ఏమైనా 1919 సంవత్సరం మధ్యకాలంనాటికి, యూరప్లో కమ్యూనిస్టు ఉద్యమం పూర్తిగా విఫలమైంది. దీనిఫలితంగా సోవియట్ తనదృష్టిని ప్రాచ్యదేశాలపైకి మరల్చింది.

చైనా కమ్యూనిస్టుపార్టీ తొలి కాంగ్రెస్ సమావేశం 1921 జులైలో జరిగింది. దానికి పదముగ్గురు మాత్రమే హాజరయినారు. వారిలో మావ్ సేటుంగ్, చాంగ్-కౌ-టువో, టుంగ్-పివోలు ఉన్నారు. నామమాత్రంగా పార్టీని స్థాపించారు. ఆ మరుసటిఏడు కొమిన్టరన్, డాక్టర్ సన్యెత్ సేన్తో సంప్రదించి రావలసినదిగా ఒక ప్రతినిధిని చైనాకు పంపింది. వారిరువురి సమావేశంలో అతను – కొమిన్టాంగ్, కమ్యూనిస్టుపార్టీల మధ్య ఒక మైత్రిని ప్రతిపాదించాడు. డాక్టర్ సన్ ఆ ప్రతిపాదనను త్రోసిపుచ్చాడు. అయితే కొమిన్టాంగ్లో కమ్యూనిస్టులు చేరడానికి ఆమోదించాడు.

1923 జనవరి 12 న కొమింటరన్ కార్యనిర్వాహక వర్గం ఒక ప్రత్యేకతీర్మానాన్ని చేసింది. ఆ తీర్మానం పూర్తి పాఠం ఇది "ప్రస్తుతం చైనాలో జాతీయవిప్లవం తీసుకురాగలిగిన బలీయమైన సంస్థ కొమింగ్‌టాంగ్ మాత్రమే. కాబట్టి శైశవదశలో ఉన్న కమ్యూనిస్టుపార్టీ కొమింగ్‌టాంగ్‌తో సహకరించడం ఎంతైనా అవసరమని గుర్తిస్తుంది." ఈ తీర్మానానికి అనుగుణంగా చైనాకమ్యూనిస్టుపార్టీ కొమింగ్‌టాంగ్‌లో చేరేవిషయమై తాత్కాలిక నిర్ణయాన్ని చేసింది.

కొందరు కొమింగ్‌టాంగ్ సభ్యులు కమ్యూనిస్టులు తమ పార్టీలో చేరడాన్ని తీవ్రంగా ప్రతిఘటించారు. లీ. సౌచాంగ్ (లీ చా చో?) అనే ఒక ప్రముఖ కమ్యూనిస్టు ఈ క్రిందివాదం ఒకటి లేవదీశాడు. "కొమింగ్‌టాంగ్‌లో చేరడం వల్ల, తృతీయ అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీ సభ్యులు కొమింగ్‌టాంగ్ నియమావళికి, క్రమశిక్షణకూ బద్ధులయి ఉండాలనే కోరుతున్నారు. వారికి కొమింగ్‌టాంగ్‌ను కమ్యూనిస్టు పార్టీగా మార్చే ఉద్దేశం ఏమాత్రం లేదు. అంతేకాక, వాళ్ళు కొమింగ్‌టాంగ్‌లో చేరడం పార్టీ మొత్తంగాకాదు, విడివిడిగా వ్యక్తులుమాత్రమే" నని విశదపరిచాడు. ఈ వాగ్దాన ఫలితంగా కమ్యూనిస్టులను చేర్చుకోవాలనే ప్రతిపాదనను అంగీకరించినట్లుగా కొమింగ్‌టాంగ్ ప్రకటించింది.

కొమింగ్‌టాంగ్ నాయకులు సోవియట్ నిపుణుల సలహాతో క్వాంగ్‌టన్‌లోని విప్లవస్థావరాన్ని దృఢతరం చేసుకొనడానికి ఉత్సాహపూరితులై ముందుకు నడిచారు. డాక్టర్. సన్, ప్రజలలో రాజకీయచైతన్యం పెంపొందించడానికి ప్రయ

త్నించసాగాడు. చాంగ్-కై షేక్ కొత్త విప్లవసైన్యం ఒక దాన్ని సృష్టించడానికి పూనుకోసాగాడు. తక్కిన కోమిన్ టాంగ్ నాయకులు విప్లవ అవసరాలకోసం, కార్మిక, కర్షక, విద్యార్థి సంఘాలను శక్తివంతంగా సమీకరించడం మొదలు పెట్టారు. వారు సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రచారానికి పెద్ద పెట్టుగా పూనుకున్నారు.

తరువాత త్వరలోనే డాక్టర్. సన్ ఉత్తరాన జరుగు తున్న జాతీయ పునర్వ్యవస్థీకరణసభ కొకదానికి హాజరు కావ డానికి ఆహ్వానితు డైనాడు. కాని ఆ ప్రయాణంలోనే అతని ఆరోగ్యం దెబ్బతిన్నది. మధ్యలోనే - 1925 మార్చి 12 న ఆయన పెకింగ్‌లో అసువులు వీడాడు.

డాక్టర్. సన్ మరణించిన తరువాత చైనాలో బ్రిటిష్ వ్యతిరేక భావాలు ప్రబలడానికి అట్టేకాలంపట్టలేదు. షాంగైలో ఒక సమ్మెజరిగి, అది విపత్కరపరిస్థితిని తెచ్చిపెట్టింది. దాంతో పాటే బ్రిటిష్‌పరికరాలను నిషేధించాలనే నినాదం బయలు దేరింది. అంతేకాకుండా సోవియట్ అనుకూలభావాలు అంతటా మొలకెత్తి, కాంటన్ వైపు తీగలుసాగడం మొదలుపెట్టాయి.

ఈ చెలరేగిన బ్రిటిష్ వ్యతిరేకోద్యమ అగ్నిజ్వాలల కల్లోలంమధ్య చాంగ్-కై షేక్ జాతీయ వ్యవహారరంగంలో ప్రవేశించాడు. కాంటన్‌లోనూ, ఆ చుట్టూనూ కొన్ని ఏండ్లుగా కూలీకి గడ్డితినేవారు, విశృంఖలంగా వ్యవహరిస్తు న్నారు. వారి అవినీతికి అంతులేదు. ప్రజలకు వారిపై అస హ్యము కలిగింది. చాంగ్ తన వాంగ్‌పో దళాలను ప్రయో

గించి వారిని అణచివేశాడు. డబ్బు కక్కుర్తితో అక్కరులు లేవదీసిన ఆ దుండగీడు లందరిని హతమార్చాడు.

కొత్త పరిస్థితి ఏర్పడ్డకారణాన కొమింటాంగ్ కేంద్ర కార్యనిర్వాహకవర్గం ప్రభుత్వాన్ని పునర్నిర్మించడంకోసం సర్వసభ్య సమావేశం ఒకదాన్ని ఏర్పాటు చేసింది. నూతన ప్రభుత్వపథకంలో, వాంగ్ చంగ్‌వీ రాజకీయ, సైనిక అధికారా లన్నీ తన గుప్పిట్లో ఉంచుకున్నాడు. అతను పార్టీ కేంద్ర కార్య నిర్వాహకవర్గానికి చైర్మన్ అవడంమూలాన, ఉద్యోగ రీత్యా అతనే ప్రభుత్వంయొక్క చైర్మన్, అతనే రాజకీయ కౌన్సిల్‌కు ఛెయిర్మన్, అతనే మిలిటరీ కౌన్సిల్‌కు ఛెయిర్మన్, అన్నీ అతనే అయి ఊరుకున్నాడు. వాంగ్, బొరొడిన్‌పట్ల తలలో నాల్కవలె మెలుగుతూ వచ్చాడు. అతను పూర్తిగా బొరొడిన్ ప్రభావానికి లొంగిపోయాడు. ఇక బొరొడిన్ సలహా దారుడుగా కాక ఒక నియంతలా వ్యవహరిస్తూ వచ్చాడు.

ఇంత కట్టుదిట్టంగా పునర్నిర్మాణం జరిగినప్పటికీ కాంటన్ ప్రభుత్వం క్వాంగ్‌టుంగ్ రాష్ట్రంలో సగభాగంమాత్రమే తన అదుపులోకి తెచ్చుకో గలిగింది. తక్కిన తూర్పు సగ భాగం చీన్‌చ్యూంగ్‌మింగ్ ఆధిపత్యంలో ఉండిపోయింది. అత నికి బ్రిటిష్‌వారి మద్దతు ఉన్నదని అనుకునేవారు.

చాంగ్-కై-షేక్, చీన్‌చ్యూంగ్‌మింగ్‌పైన ఒక పెద్ద దండయాత్రసాగించాడు. వాంగ్‌పూ దళాలు చీన్ సైన్యాలను త్వరలోనే ఓడించి నాశనంచేశాయి. ఈ విజయం కాంటన్ ప్రభుత్వపు గౌరవాధికారాలను ఇనుమడింప చేసింది. అంతే కాకుండా చాంగ్-కై-షేక్ అప్పటి పరిస్థితులకు తగిన నాయ

కుడుగా పరిగణింపబడ్డాడు. వెంటనే అతను, అంతకుముందు హాక్టిన్ సన్ వేసిన ఉత్తరదండయాత్ర పథకాన్ని అమలుజరుప టానికి తీవ్రమైన ప్రయత్నాలు సాగించాడు.

ఇక రాజకీయ పరిస్థితివిషయంలో చాంగ్, వాటిని పటిష్ఠంచేయడానికి స్వయంగా నిశ్చితమైన కార్యక్రమాలను కొనసాగించాడు. 1926 వసంతంలో ఒక వదంతి పొక్కింది. వాంగచింగ్‌వీ, కమ్యూనిస్టులు కలిసి, చాంగ్‌ను పడగొట్టడా నికి రహస్యంగా కుట్ర పన్నుతున్నారని తెలిసింది. అప్పుడు చాంగ్ వాంగుపూ దళాలతో మెరపులా ప్రత్యక్షమై వాళ్ళను దెబ్బకొట్టాడు. మార్చి 20 న కాంటన్‌లో సైనికశాసనం ప్రక టించాడు. బొరొడిన్, తక్కిన సోవియట్ సలహాదార్లు నివ సించే ప్రాంతాలను చుట్టుముట్టవలసిందిగా సైనికదళాలను పంపాడు. చాలామంది సోవియట్ సలహాదార్లు అరెస్ట్ కావించ బడ్డారు. కొందరు అనుమానితులను జైళ్ళలో ఉంచారు. వాంగచింగ్‌వీ పత్తాలేకుండా పారిపోయాడు. ఆ తరువాత ఎంతోకాలం కాకుండానే ఏప్రిల్ 25 న చాంగ్ శత్రువులపై మరో దెబ్బతీశాడు. ఈతడవ ఇది దక్షిణపక్షంమీద ఒక అమెరికన్ పరిశీలకుడి సమాచారం ప్రకారం—చాంగు శత్రువు లపై ఈ రెండో దెబ్బ తీయడంలోగల అంతరార్థం, బొరొడిన్ అభిమానాన్ని చూరగొనడానికేనని తెలుస్తోంది. అదైనా అది వరకే పథకం వేయబడిన ఉత్తర దండయాత్రలో సోవియట్ మద్దతు, ఉండేటట్లు చేస్తానని బొరొడిన్ అభయహస్తం ఇచ్చిన తరువాతనే ఈపని చేశాడు.

మే 15 న జరిగిన కోమింగ్‌టాంగ్ కేంద్ర కార్యనిర్వాహకవర్గ సంపూర్ణ సమావేశంలో చాంగ్‌కై షేక్, చైనా కమ్యూనిస్టులమీద అనేక ఆంక్షలనుపెడుతూ ఒక తీర్మానాన్ని ప్రవేశపెట్టాడు. కేంద్ర కార్యనిర్వాహకవర్గం దాన్ని ఆమోదించి అమలులో పెట్టింది. అంచాత సోవియట్ సలహాదార్లు తమ అధికారాలను నిర్వచించి, పరిమితం కావించుకోవడం జరిగింది. చాంగ్ కేంద్ర కార్యనిర్వాహకవర్గం స్టాండింగ్ కమిటీకి చైర్మన్‌గా ఎన్నిక అయినాడు. ప్రభుత్వాన్ని, పార్టీని తన అధిపత్యంలోకి తీసుకొచ్చుకున్నాడు. చాంగ్ ఇప్పుడు ఉత్తరానఉన్న "యుద్ధాభిలాషుల"ను ఎదుర్కొని వారి రాష్ట్రాలను వశపరచుకోడానికి సిద్ధంగా ఉన్నాడు.

ఇదేసమయంలో సోవియట్ ప్రభావం ఉత్తరచైనాలో, మంచూరియాలోసహా ప్రబలంగా అలుముకోసాగింది. ఉత్తర చైనాలో సోవియట్ల పన్నుగడలలోని ఆంతర్యం, ఆప్రాంతాన్ని అంతా తమ ఆధిపత్యంక్రిందికి తెచ్చుకోడమే. కాని ఈ పన్నుగడల ఫలితం ఉత్తరాన యుద్ధాభిలాషులను బలహీనులుగా చేయడం, దానివల్ల వారు దక్షిణబలాల, కాంటన్‌బలాల తాకిడికి తట్టుకోలేకపోవడం అయింది.

ప్రధాన రాజకీయ సమస్యలన్నింటినీ పరిష్కరించి, క్వాంటుంగ్‌లోని పరిస్థితులను సుస్థిరంచేసి చాంగ్ ఉత్తర దండయాత్రకు నామమాత్రంగా నాందివేశాడు. ఇహ తక్కిన కార్యకలాపాలను ఉత్తరదళాలకు అప్పగించాడు. పదిహేను మంది సోవియట్ సైనికోద్యోగులు జనరల్ గాలెన్(బ్లూచెర్) ఆధిపత్యంక్రింద ఇంకా అనేకమంది సోవియట్ నిపుణులు వెంట

రాగా దండయాత్ర సాగించారు. దళాలు శర వేగంతో ముందుకు నడిచి విజయంపై విజయం సాధించాయి.

1926 అంతానికి దాదాపు దక్షిణ చైనా అంతా జాతీయ విప్లవకారుల ఆధిపత్యంక్రిందికి వచ్చేసింది. విప్లవసైన్యాలు వెళ్ళినప్పుడల్లా, పార్టీవర్కర్లు ప్రజలను రాజకీయ చైతన్య వంతులుగా చేస్తూవచ్చారు. జయించిన భాగాలను ఏకీకృతం కావించడంద్వారా "పార్టీవర్కర్లు"పనిని తేలిక చేస్తూవచ్చారు. ప్రజానీకంలో కలిగిన సాధారణ సంచలనం కోమింగ్‌టాంగ్ వామపక్షీయుల, చైనా కమ్యూనిస్టుల, వారి సోవియట్ సలహా దారుల అధికారాభివృద్ధికి సంకేతమైంది. ఉత్తర చైనాలోను, మంచూరియాలోను సోవియట్ ఏజంట్లు, "యుద్ధాభిలాషుల" ప్రభుత్వాన్ని కూలద్రోయడానికీ, దక్షిణాన విప్లవోద్యమాన్ని సుసంపన్నం చేయడానికీ ఎంతగానో కృషి కావించారు. 1927 వచ్చే సరికి సోవియట్ ప్రభావం ప్రత్యక్షంగానో లేక పరోక్షంగానో, బాహాటంగానో లేక రహస్యంగానో, చైనా అంతటా సంపూర్ణంగా వ్యాపించింది. ఆ తరుణంలో చైనా అంతరిక్షంలో అపూర్వోజ్వల కాంతులు విరజిమ్ముతూ అరుణతార ప్రకాశి స్తూంది.



# 2

## ఆధిపత్యంకోసం చైనా రష్యాల ప్రాకులాట

### చైనాలో సోవియట్ ప్రభావం క్షయం

**1926** అక్టోబరు చివరభాగంలో, బొరోడిన్ విజ్ఞప్తిపై కాంటన్ - కొమిన్‌టాంగ్ ప్రత్యేక సమావేశం ఒకటి ఏర్పాటు కావించబడింది. ఆ సమావేశంలో రెండు ముఖ్య తీర్మానాలు ప్రవేశపెట్టారు. అందులో మొదటిది రాజకీయ జీవితంనుంచి విరమించిన వాంగ్‌చింగువీని తిరిగీ పిలిపించడం. రెండవది జాతీయముఖ్యపట్టణాన్ని కాంటన్‌నుంచి వుహానుకు మార్చడం. ఈరెండు తీర్మానాలూ చేయడమైతే వేగిరంగా చేశారుకాని అమలుజరగడంమాత్రంజరగలేదు. రాజకీయరంగంలో తీవ్రపోరాటం సాగిస్తూ తీరుబడిలేకుండా ఉన్న చాంగ్-కై-షేక్ ఈ తీర్మానాలవిషయం పట్టించుకోలేదు. అవి అతనికి ఇష్టంలేవుకూడా. ఇందుకు బొరోడిన్‌మీద నెపం మోపాడు. వా రిరువురిమధ్య సంబంధాలు తెగిపోయాయి.

మార్చి 10 న కొమింన్‌టాంగు కేంద్ర కార్యనిర్వాహక వర్గం హాంకోలో సర్వసభ్య సమావేశంజరిపింది. చాంగ్ దాన్ని "బాయ్‌కాట్" జేశాడు. ఆ సమావేశంలో చేయబడిన తీర్మానాలలో ఒకటి చైనా కమ్యూనిస్టుపార్టీ, కొమింగ్‌టాంగు-రెండూ కలిసి చైనాను పరిపాలించా లనేది. మరొకటి ప్రభుత్వ కౌన్సిల్ ఛెయిర్మన్ పదవిని, రాజకీయ కౌన్సిల్ ఛెయిర్మన్ పదవిని, సైనిక కౌన్సిల్ ఛెయిర్మన్‌పదవిని-ఈ

మూటినీ రద్దుచేయాలనేది. ఈరెండు తీర్మానాలుకూడా ప్రత్యక్షంగాచాంగునుఉద్దేశించిచేయబడినవే. అతనుఎప్పుడూకమ్యూనిస్టులను దెబ్బకొట్టడానికి చూస్తుండడంవల్ల మొదటితీర్మానం చేయడం జరిగింది.అతని అధికారాలను ఊడగొట్టడానికి రెండవ తీర్మానం ఉద్దేశించబడింది. ఆ సమయంలో ఈ పైన రద్దుచేసిన మూడు పదవులూ చాంగు చేతుల్లోనే ఉన్నాయి.ఏమైనప్పటికీ చాంగు బాహాటంగా దెబ్బలాటకు దిగలేదు. అతను తనదృష్టిని సైనికదళాలపై కేంద్రీకరించి, షాంగైను, నాన్‌కింగును పట్టుకున్నాడు. ఈ రెండునగరాలూ ముట్టడివేయడంతో చాంగు ప్రతిష్ఠఆకాశం అంటింది.

ఈ పరిస్థితిలో నాన్‌కింగులో అంతర్జాతీయపు కుట్ర ఒకటి జరిగింది. అక్కడికి చేరబడిన సైనికదళాలు, అక్కడ నివసించే విదేశీయులను ఎదుర్కొని, భయపెట్టి, క్రూరంగా ప్రవర్తించాయి. పరిస్థితిని చక్కబెట్టడంకోసం బ్రిటిష్, అమెరికన్ యుద్ధనౌకలు ప్రత్యక్షంగా జోక్యం కలిగించుకున్నాయి. ఈ సంఘటన, తరువాత కొత్తగా ఏర్పడిన నాన్‌కింగు ప్రభుత్వంవల్ల సరిదిద్దబడింది. ఈ సంఘటనకు కారకులుగా అనుమానింపబడిన కమ్యూనిస్టులనుకూడా అణచివేసింది. ఈ సంఘటనకు కమ్యూనిస్టులే కారకులని చెప్పబడిన సందర్భంలో ఒక కథకూడా నడిచింది. చాంగ్-కై-షేక్ అధీనంలోఉన్న జాతీయసేన పురోగమనాన్ని నిరోధించాలని ఆదేశిస్తూ బొరొడిన్ వద్దనుంచి వచ్చిన ఒక ఆజ్ఞాపత్రాన్ని చేరనివ్వకుండా మధ్యలో పట్టుకున్నారు. ఈ కథ బ్రిటిష్‌వారి అనుమానాలను ధృవపరిచింది. మే 9 న సర్ ఆస్టిన్‌చాంబర్లేన్, ప్రజాప్రతినిధుల సభలో ఇలా

ప్రకటించాడు: "నాన్‌కింగు తిరుగుబాటుదారుల దౌర్జన్యాలు చాంగ్-కై-షేక్‌కు, విదేశీయులకు మధ్య విభేదాలు కల్పించ టానికి ఉద్దిష్టమైనవిగా కనిపిస్తున్నాయి. కొమింటాంగులో వచ్చిన చీలికలు కమ్యూనిస్టులకు, వారి విదేశీ సలహాదారులకు చైనా ప్రజలందరిదృష్టిలో తీరని అవమానాన్ని తెచ్చిపెట్టాయి."

1927 మొదటిఅర్ధభాగంలోజరిగిన తీవ్రమైన అంతస్సంఘర్షణ సందర్భంలో, చైనాలోని రాజకీయ పరిస్థితులు, ముఖ్యంగా చైనాలో సోవియట్ పలుకుబడి వ్యాప్తిచెందే విషయంలో అత్యంత వేగంగా మార్పుచెందుతూ వచ్చాయి. పెకింగ్ ప్రభుత్వం చాంగ్‌ట్జాలిన్ నాయకత్వాన చైనాలో సోవియట్ కుట్రదార్లని అనుమానింపబడేవారిపై కఠినచర్యలను తీసుకున్నది. ఏప్రిల్ 6 న పెకింగ్ పోలీసులు క్రైస్తవ గురువుల్ల వారంటుపత్రం పుచ్చుకుని, సాయుధులైన పటాలాలతో వెళ్ళి రష్యావారి మతగురువు గృహాన్ని, తదితర గృహాలను సోదా చేశారు. ఈ సాహసకృత్యాలకు సోవియట్ ప్రభుత్వం తన తీవ్ర అభ్యంతరాలను తెలిపింది. కాని చైనాప్రభుత్వం నాటిని లక్ష్యపెట్టలేదు. పదిరోజుల తరువాత సోవియట్ విదేశాంగ ఉద్యోగి, అతని అనుచరులు పెకింగ్‌ను వదలివెళ్ళారు.

దండయాత్రలు జరిగిన సమయంలో పట్టుబడిన సామగ్రే పెకింగ్ ప్రభుత్వం ఇంత తీవ్రంగా వ్యవహరించడానికి కారణ మైంది. ఈ ముట్టడులలో అనేక రష్యన్ రహస్య పత్రాలు కూడా దొరికినాయి. ఈ పత్రాలలో పెకింగ్ ప్రాంతంలో నాలుగువేలమంది కమ్యూనిస్టు ఏజంట్లు హింసాత్మక చర్యలకు దిగడానికి సిద్ధంగా ఉన్నట్లు ఒక జాబితాకూడా బయటపడింది.

అంతేకాదు; 1927 లో మాస్కోలో అంతర్జాతీయ కమ్యూనిస్టు కార్యనిర్వాహక కమిటీచేసిన ఒక తీర్మానపు ప్రతికూడా వీటిల్లో ఉన్నది. చైనాలో కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని స్థాపించాలని ఆ తీర్మానపు పూర్తిపాఠం. ఇంకా తక్కిన పత్రాల వల్ల, బొరొడిన్, అతని రష్యన్ అనుచరులు మాస్కోనుంచి ఎప్పటికప్పుడు ఉత్తర్వులు పొందుతున్నట్లు, చైనాలోని సోవియట్ రాయబారులు మాస్కో కాంటన్‌లమధ్య ఏజంట్లుగా పనిచేస్తున్నట్లు, ఆయుధాలు, మందుగుండు సామగ్రి అందిస్తున్నట్లు, కమ్యూనిస్టు రాజ్యస్థాపనకు పరిపూర్ణ ప్రయత్నాలు జరుపుతున్నట్లు బయటపడింది. తరువాత పెకింగ్ పోలీసుశాఖవారు రష్యన్‌పత్రాల అసలు ప్రతులకు, ఛాయాచిత్రాలు తీసి ఇంగ్లీషు తర్జుమాలతో ప్రచురించారు. సోవియట్ నాయకులు ఆ పత్రాలు కేవలం సృష్టించబడినవని నేరం మోపారు. కాని తక్కిన దేశాలన్నీకూడా – ముఖ్యంగా యూరప్, అమెరికాలు ప్రచురితమైన ఆ పత్రాలు సోవియట్ వారి సంతకాలతో ఉన్న అసలుపత్రాలేననీ, అందులో ఏమాత్రం సందేహంలేదనీ పూర్తిగా విశ్వసించాయి.

కొన్ని సంవత్సరాలతరబడి చైనాప్రజలు పాశ్చాత్య సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా తాము జరుపుతున్న పోరాటంలో సోవియట్ రష్యావారు తమ ఆప్తులనీ, అనుచరులనీ ఎంతో విశ్వాసంతో ఉంటూవచ్చారు. కాని ఇప్పుడు బొరొడిన్ కాని, అతని సోవియట్ సలహాదార్లుకాని చైనాలో జాతీయ విప్లవానికి తోడ్పడడానికి మాత్రమే ఉత్సాహులై ఉన్నారని నమ్మలేకపోయారు. అంతేకాదు. "సోవియట్ రష్యాకూడా

ఒక సామ్రాజ్యవాద కూటమికి చెందినదా? కేవలం పురోరకమైన ఎత్తుగడలు ఉపయోగిస్తున్నదా?" అని ఆశ్చర్యపోయారు.

ఏప్రిల్ 7 న యుహాన్ ప్రభుత్వం, జాతీయదళాల ఛీఫ్ కమాండర్ పదవిని రద్దుచేస్తూ ఒక శాసనం చేసింది. ఈపదవిని అంతవరకూ చాంగ్ కై షేక్ నిర్వహిస్తూవచ్చాడు. ఈ శాసనం బహుశా పార్టీ అంతఃకలహానికి నాంది అని చాంగ్ ఉద్దేశపడ్డాడు. ఎంతో ఆత్రం చెందినవాడిలాగా కమ్యూనిస్టులకు వ్యతిరేకంగా ఒక సంస్కరణోద్యమాన్ని ప్రారంభించాడు. ఈ ఉద్యమంలో అనేక వేలమంది కార్మికులు, చాలామంది కమ్యూనిస్టు నాయకులు బందీ చేయబడ్డారు, ఊచకోత కోయబడ్డారు. యుహాన్ ప్రభుత్వం తక్షణమే చాంగ్‌ను, అతని ప్రధాన అనుచరులను కొమింగ్‌టాంగ్‌నుంచి బహిష్కరించింది. జనరల్ ఫెంగ్‌యు హైస్యాంగ్‌ను కొమింగ్‌టాంగ్ దళాలకు కమాండర్‌గా నియమించింది.

ఈ ఇరుపక్షాలమధ్య సమరం తప్పనిసరిగా కనుపించసాగింది. ఉత్తరానఉన్న యుద్ధోన్మాదులకొరకు కావించబడిన సైనికోద్యమాలు కాకపోయినట్లయితే యుద్ధం ఎప్పుడో ఆసన్నమైఉండేది. నాన్‌కింగు, హాంకో _ ఈ రెండూకూడా ఎంతోకాలం స్నేహంగా ఉండలేకపోయినా ఉత్తర దండయాత్రనుమాత్రం సాగించగలిగాయి. చాంగు_కై_షేక్ ఆధీనం క్రిందఉన్న నాన్‌కింగు దళాలు త్వరితగతి పురోగమించాయి. కాని షాంటంగులో జపాను సాయుధదళాలు జోక్యం కలిగించుకోడంవల్ల ఆశాభంగం పొందాయి. అప్పటిస్థితిలో 'షీన్సీ

రాష్ట్రంనుంచి జనరల్ ఫెంగు నాయకత్వాన వచ్చిన దళాలు షాంగ్ట్జాలిన్‌కు చెందిన దళాలను, చాంగు మిత్ర దళాలను నాశనంచేశాయి. ఆవిధంగా జనరల్ ఫెంగు అప్పుడున్న సైనిక రాజకీయ పరిస్థితులను సరియైన పద్ధతిలో పెట్టడానికి త్రోవ తీయవలసిన వీరుడు అయాడు.

జూన్ నెల సగపడ జరిగేసరికి అంతర్యుద్ధం ఉధృతం తగ్గింది. యుహాన్ సంస్థానంలో రైతులు రాడికల్‌పార్టీ వర్కర్ల తోడ్పాటుతో భూములను ఆక్రమిస్తూ, భూస్వాము లకు వ్యతిరేకంగా ఒక విధమైన వర్గపోరాటం సాగించారు. బస్తీలలోను, పెద్దపెద్ద నగరాలలోను లేబరుయూనియన్ల వారు పోలీసుల, న్యాయస్థానాల కార్యకలాపాలను చేపట్టారు సాయుధ సవినయ ప్రచారంద్వారా, అంగళ్లు, ఫ్యాక్టరీలు మూసివేయిం చారు వర్కర్ల సమ్మె సాగించారు. సాంఘికవిప్లవం ఒకటి క్రిందినుంచి పైకి ఎగబ్రాగుతున్నట్లు కనుపించింది. కొమిన్ టాంగు కేంద్ర కార్యనిర్వాహకవర్గం వర్గ సమైక్యవిధానానికి విప్లవ సాధనకు సమిష్టికృషిని కోరుతూ ఒక "మేనిఫెస్టో" ను జారీచేసింది. ఈ విపత్కర పరిస్థితిని చక్కబెట్టుటకు జనరల్ ఫెంగ్ మద్దతు సంపాదించుకొనుటకు యుహాన్ ప్రభుత్వ అధి నేత వాంగ్‌చింగువీ, ఫెంగ్‌ను కలుసుకోడానికి వెళ్లాడు. వాంగ్‌ను కలుసుకున్న తరువాత జనరల్ ఫెంగ్ తనవిష యంలో జనరల్ చాంగ్‌కై షేక్‌తో సమావేశం జరపడానికి వెళ్లాడు. ఆ సమావేశఫలితంగా ఆ ఇరువురు మిలిటరీ అధినే తలమధ్య ఒక స్నేహసంబంధం కుదిరింది. జూన్ 21 న జన రల్ ఫెంగ్ బొరొడిన్‌ను, అతని తోటి సలహాదార్లను తొల

గించవలసినదని జరూరుగా కోరుతూ హాంకో ప్రభుత్వానికి ఒక తంతివార్త పంపాడు. తరువాత కొద్దిరోజులకు చాంగ్-కై-షేక్ కూడా అదేవిధంగా కోరుతూ, ఒక విధమైన మొరటు ధోరణిలో హాంకోకు తుదిహెచ్చరిక చేశాడు.

కోమింగ్‌టాంగు వామపక్షీయులు 1927 జూలైలో ఒక సభ జరపడానికి సమావేశమయ్యారు. సమావేశంలో ఒక తీర్మానం చేశారు. చైనా కమ్యూనిస్టుపార్టీని బహిష్కరించాలని ఆ తీర్మానం. అంతేకాదు, బొరోడిన్, తక్కిన సోవియట్ నిపుణులు, బోధకులు తిరిగి రష్యా వెళ్ళేటట్లు ఆజ్ఞాపించబడాలనీ, అతివాద చర్యలన్నీ ఆపివేయాలనీ "కోమిన్‌టాంగు నిజ స్వరూపాన్ని, దాని ఆవశ్యకతను వివరించడానికి" ఒక ప్రతినిధి వర్గాన్ని మాస్కో పంపాలనీ వారు ఆ సమావేశంలో నిర్ణయించారు.

కోమిన్‌టరన్ కేంద్రకార్యవర్గం చైనాలో ఏర్పడిన ఈ విషమపరిస్థితులను ఎదుర్కొనడానికి అంచనా వేసుకుని ఒక కొత్తతీర్మానంచేసింది. ఆతీర్మానంలో కొంతభాగం ఇలా చెబుతుంది: "యుహాన్‌ప్రభుత్వం వహించిన విప్లవపాత్ర అయిపోయింది. అది ఒకవిప్లవప్రతీఘాతుకశక్తిగా తయారవుతోంది... కమ్యూనిస్టులు కోమిన్‌టాంగులోనే ఉండిపోవాలి...ఇహ ఇప్పుడు కమ్యూనిస్టులు కష్టజీవులయిన ప్రజానీకంలో ఇంకా ఎక్కువ కృషిసాగించాలి...కార్మిక సంస్థలను, కూలి సంఘాలను నిర్మించాలి...ట్రేడ్‌యూనియన్లను పటిష్ఠంచెయ్యాలి... కార్మికప్రజలను నిశ్చితంగా కార్యరంగంలోకి దూకేటట్లు తయారుచెయ్యాలి...కర్షక విప్లవాన్ని అభివృద్ధిచెయ్యాలి...

కార్మిక కర్షకులను సాయుధులుగా చేయ్యాలి...న్యాయవిరుద్ధమైన పార్టీ ఉపకరబాలితో తగిన పోరాటాన్ని నిర్మించాలి."

ఇలా నడపా లనుకున్నవారు యుహాన్ ప్రభుత్వం చేస్తున్న గట్టిప్రయత్నాలను భగ్నపరచలేకపోయారు. బొరోడిన్, మరికొంతమంది అతని సహాయులు మాస్కోకు వెళ్ళిపోయారు. ఆవిధంగా ఒకవైపు కొమిన్‌టాంగుమధ్య, మరొకవైపు చైనా కమ్యూనిస్టులు సోవియట్ సలహాదార్లమధ్య సహకారసంబంధాలు అంతరించాయి. ఇలా తెగిపోవటానికి తమ తుదిగమ్యాలలోను, సామ్యవాద్యానికి చేరే ప్రధాన పద్ధతులలోను ఎంతో వైరుధ్యంఉన్న రెండు విప్లవాలను ఒకటిగా కలపడం అసాధ్యం కావడమే మూలకారణం. కొమిన్‌టాంగుచే పూనుకొనబడిన జాతీయవిప్లవం డాక్టర్. సన్ నిర్వచించిన "మూడు ప్రజాసూత్రాలను" సాధించడానికి ఉద్దేశించింది. అందుకు ఫెబియను పద్ధతులను లేక పరిణామ స్వభావాన్ని అవలంబించింది. చైనాకమ్యూనిస్టులుమాత్రం అలాకాక హింసాత్మక చర్యలను, వర్గకలహాన్ని సాగించటమే తమ ప్రధాన వైఖరిగా పెట్టుకున్నారు. పోతే వారి శ్రామికవిప్లవం శ్రామిక నియంతృత్వస్థాపనకే ఉద్దేశించబడింది. కొమిన్‌టాంగు వామపక్షీయులకు కమ్యూనిస్టులకుమధ్య ఈ కొద్దికాలమైనా ఎందుకు సహకారం సాధ్యమైందీ అంటే, నిజానికి వా రిరువురి మధ్యనున్న ప్రధానప్రయోజనాలు ఒకటి కావడంవల్లనే—అవి చైనాలో యుద్ధోన్మాదులైన భూస్వామి వ్యతిరేకత, సామ్రాజ్యవాద వ్యతిరేకత అనేవి. ఒకటిగా ఉన్న ఈ ప్రయోజనాలు

సాధించిన వెంటనే వారిరువురూ విడిపోవడం, ఒకరితో ఒకరు పోరాడటం తప్పదు.

యుహాన్, నాన్‌కింగ్‌లమధ్య జన్మవైరం కొనసాగుతూనే ఉంది. అన్ని వర్గాలమధ్య సమైక్యస్థితిని సాధించడం కోసం, అంతర్యుద్ధం ఆపుచేయడంకోసం చాంగ్‌కై షేక్ నేర్పుగా తన జాతీయ సైన్యాధ్యక్షపదవికి రాజీనామా ఇచ్చి తప్పుకున్నాడు. నాన్‌కింగ్, యుహాన్‌లమధ్య సమావేశాలు జరిగాయి. చివరకు కేంద్ర కార్యనిర్వాహక వర్గం, కొమింగ్‌టాంగ్ కేంద్ర పర్యవేక్షణకమిటీ పునర్నిర్మితమై నాన్‌కింగ్‌లో కొమింగ్‌టాంగ్ ప్రభుత్వాన్ని తిరిగి కట్టుదిట్టంచేసి కార్యకలాపాలు ప్రారంభించింది. డిసెంబరు 10 న చాంగ్-కై-షేక్ మిస్ మీాలింగ్ సూంగ్‌ను వివాహమాడిన వెంటనే, నాన్‌కింగ్ ప్రభుత్వంవల్ల తిరిగీ జాతీయ సైన్యాధ్యక్షుడుగా నియమితుడైనాడు. ఆ పదవి చేపట్టి ఆయన మళ్ళీ జాతీయవ్యవహారాల్లో ఒక ప్రధానపాత్రను వహించాడు.

ఈలోగా చైనాలోని కమ్యూనిస్టులను ఈ విపత్కర పరిస్థితులనుంచి బయట పడేయడానికి, వారికి మార్గదర్శకులుగా ఉండడానికి స్టాలిన్ ఒక కొమిన్‌టరన్ ప్రతినిధిని పంపాడు. చైనా కమ్యూనిస్టులు అగస్టు 7 న ఒక సమావేశం జరిపారు. ఆ సమావేశంలో "పాలిట్‌బ్యూరో" ను పునర్నిర్మించి నవీన విప్లవ పంథాలలో చర్యలు తీసుకునేందుకు పథకాలు వేశారు. అటుతరువాత ఆ సమావేశం చరిత్రలో ఒక గొప్పస్థానాన్ని ఆక్రమించుకున్నది. ఒక ప్రఖ్యాత చైనా కమ్యూనిస్టు నాయకుడు ఇలా వ్రాశాడు: "అగస్టు 7 సమావేశం కనుక జరిగి

ఉండనట్లయితే చైనా కమ్యూనిస్టుపార్టీ రాజకీయ ప్రాధాన్య మును పోగొట్టుకొని చరిత్రలో నామరూపాలు లేకుండా పోయేది. ఇరువురు కమ్యూనిస్టు జనరళ్లు - యెహ్‌టెంగ్, హూ-లంగ్ అనేవారు కాంటన్‌ను ఆక్రమించుకుని కమ్యూనిస్టు పరిపాలనను ప్రతిష్ఠించారు. ఎర్రజెండా ఎగురవేశారు. వారు తమకెంతో ప్రజాసహకారం లభిస్తుందని ఆశించారు. కాని కార్మికులు, కష్టజీవులను కాపాడేందుకు కంకణం కట్టుకున్న ఈ ఉద్ధారకులను కన్నెత్తి అయినా చూడలేదు. ఈలోగా కమ్యూనిస్టు వ్యతిరేకశక్తులు నగరంలో నలుమూలలా అల్లుకోసాగాయి. కొద్దిరోజులలోనే వారు ఈ సాయుధ కమ్యూనిస్టు దళాలను నాశనం చేశారు. జాతీయవాదులు ప్రతీకారంగా కమ్యూనిస్టులను ఉరితీయడానికి, ఊపిరిసలపని హింసలను జరపడానికి పురోగమించారు.

సోవియట్ ఏజంట్లు తమ రాయబారవర్గంద్వారా, వాణిజ్యసంస్థలద్వారా దెబ్బతీశారనే నెపంపై, వారెవ్వరూ జాతీయచైనా ప్రభావం సోకినంతమేర ఉండకూడదనీ, తక్షణం వారి కార్యాలయాలను మూసివెయ్యాలనీ నాన్‌కింగ్ విదేశాంగ మంత్రి డాక్టర్ సి. సి. వూ డిసెంబరు 14 న ఒక ఉత్తర్వు జారీచేశాడు. ఆ మరుసటిరోజు ఒక వారంలోగా చైనాను వదలి వెళ్ళిపోవలసినదిగా సోవియట్ అధికారులకు ఒక నోటీసు జారీచేశాడు. వారు ఆ గడువులోపలనే చైనా వదలివెళ్ళారు. కొమింగ్‌టాంగ్ ఆధిపత్యంగల ప్రాంతంలోని తమ హక్కులను జర్మన్‌ప్రభుత్వ రక్షణక్రింద ఉంచి సోవియట్లు వెళ్ళిపోయారు.

డిసెంబరు 17న సోవియట్ విదేశాంగమంత్రి చిచెరిన్, నాన్‌కింగ్ ప్రభుత్వానికి తన అభ్యంతరపత్రాన్ని ఒకదాన్ని పంపాడు. కాంటన్‌లో ఉన్న సోవియట్ రాయబారవర్గానికి ఆ చర్యలతో ఏమీ సంబంధంలేదని ఆయన తెలియచేశాడు. అందుకు జవాబుగా డాక్టర్. వూ, కాంటన్‌లోని సోవియట్ రాయబారవర్గంవారు ఆ వ్యతిరేక చర్యలకు వాటి ఫలితాలకు పూర్తిగా బాధ్యులని వివరిస్తూ నిదర్శనాలు అనేకం చూపాడు. తరువాత కొన్నిరోజులకు ట్రాట్‌స్కీ ఇలా ఉత్తరం రాశాడు. "స్టాలిన్ ప్రత్యేక గూఢచారులు కాంటన్‌లో తిరుగుబాట్లు లేవనెత్తే చర్యలకు దిగారు; సోవియట్ యూనియన్‌లో కమ్యూనిస్టుపార్టీ పదిహేనవ కాంగ్రెస్ సమావేశానికి ఎదురుచూస్తున్నారు. బాహాటంగా ఏర్పడిన రష్యన్ వ్యతిరేకతను నిర్మూలించడాన్ని, చైనాలో వచ్చిన రాజకీయ విజయాన్ని, స్టాలిన్ తన కుతంత్రాలతో మభ్యపెడుతున్నాడు."

సోవియట్ పలుకుబడి ఈవిధంగా అకస్మాత్తుగా హరించింది. అంటే అర్థం చైనాలో కమ్యూనిజం అంతరించిపోయిందని కాదు. కాంటన్ తిరుగుబాటు జరిగిన తరువాత సంవత్సరాలలో కొమిన్‌టరన్, చైనాకమ్యూనిస్టుపార్టీని అనేకవిధాల బలపరుస్తూ అధికారం చేపట్టవలసిందిగా ప్రోత్సహిస్తూవచ్చింది. ఆ సమయంలో చైనాకమ్యూనిస్టులు వివిధ ప్రాంతాలలో సైనికదండయాత్ర లనేకం సలుపుతూ వచ్చారు. కాని అవన్నీ కూడా గాలిలో కొట్టుకుపోయాయి. అంచాత పార్టీనాయకత్వంలో తరుచు మార్పులు జరుగుతూ వచ్చాయి. తన వ్యూహాలు, సరిగ్గాపటిష్ఠంగా ఉన్నాయాలేవా అనిప్రశ్నించుకో

డానికి మారుగా, లేక చైనాలో ఏర్పడిన పరిస్థితులను నిర్వహించుకురావడం తనకు కష్టతరం అవుతున్నదా అని ఆలోచించడానికి మారుగా కొమింటరన్, తన బాధ్యతక్రింద ఉన్న పార్టీ నాయకుణ్ని-పార్టీకి బలిపశువుగా చేస్తూ, పార్టీ బలహీనమవడానికంతా అతనే కారణమని నేరారోపణ కావిస్తూ వచ్చింది.

## యుద్ధానికి తలపడుచున్న చైనా రష్యాలు

నాన్‌కింగ్ ప్రభుత్వం 1928 జూన్‌లో జపానువారి జోక్యాన్ని లక్ష్యంచేయకుండా పెకింగ్ (అప్పటివరకుపీపింగ్)ను పట్టుకున్నది. దాంతో పూర్వపు పెకింగ్ ప్రభుత్వం మాయమైంది. ప్రభుత్వ అధినేత చాంగ్‌జోలిన్ మంచూరియాలోని తన స్వగృహానికి తిరిగీ పలాయనంకావడానికి ప్రయత్నించాడు. కాని అతను ఎక్కినరైలు ముక్‌డెన్ ప్రాంతానికి చేరుకునేసరికి ఒక ప్రేలుడుప్రమాదం సంభవించి అతను మరణించాడు. చాంగ్‌జోలిన్ మరణంతో అతని కుమారుడు చాంగ్ హ్యూలియాంగ్‌కు ప్రాధాన్యం లభించింది. అతను మంచూరియాలో ప్రభుత్వాధికారాన్ని చేపట్టాడు. సంవత్సరాంతంలో ఈ "యువక సేనాపతి" జాతీయ ఆశయసాధనే తన జన్మకు లక్ష్యంఅని, నాన్‌కింగ్‌ప్రభుత్వంపట్ల తన రాజభక్తిని ప్రకటించాడు. ఆవిధంగా మంచూరియాను జాతీయవాదుల ప్రభావంక్రిందికి తీసుకొచ్చాడు. 1928 ఆఖరయ్యేసరికి నాన్‌కింగ్‌ప్రభుత్వం పశ్చిమ రాజ్యాలు చాలా వాటిచే చట్టసమ్మతంగా గుర్తించపడింది కూడా. సోవియట్ విదేశప్రతినిధులు, ఉత్తర చైనాలోను,

మంచూరియాలోను ఉండే తక్కిన సోవియట్ సంస్థలవాటిని ఆ ప్రభుత్వం తన కార్యకలాపాలు కొనసాగించడానికి అనుమతిం చారు. పూర్వపు పెకింగ్ ప్రభుత్వం మాస్కోతో సాంకేతికంగా నెరపుతూవచ్చిన రాజకీయ సంబంధాలు అలాగే అట్టిపెట్టడం జరిగింది.

1929 కి ముందుసంవత్సరాలలో, చైనా తూర్పురైల్వేను తన అదుపాజ్ఞలక్రిందికి తెచ్చుకోడానికి సోవియట్ రష్యా చేస్తున్న ప్రయత్నాలకు చైనా ప్రజలు లోలోపల క్రోధంతో రగిలి పోతూ వచ్చారు. అయినప్పటికీ రష్యన్లు రైల్వేను తామే నడుపుతూ రైల్వే లైనుకు ఇరువైపులా తమ పలుకుబడిని విస్త రింపచేస్తూ వచ్చారు. ఇవికాక చైనా అధికారవర్గాన్ని కలవర పెట్టిన మరొకవిషయం, సోవియట్లు తమ ప్రచారానికి రైల్వే ఏజన్సీలను సాధనాలుగా ఉపయోగించుకున్న దోపిడీవిధానమే. సోవియట్ విదేశప్రతినిధులు సాగిస్తున్న కార్యకలాపాలు ఏమిటో రూఢిగా తెలుసుకుని, ముందుగా కొంత సమాచారం సేకరించడంకోసం వారి కార్యాలయానికి వెళ్ళి చూడవలసిన దిగా మే 27న హార్బిన్‌లోని స్థానికపోలీసులుకు ఉత్తర్వు వెళ్ళింది. వారా కార్యంలోకి బలాత్కారంగా ప్రవేశించవలసివచ్చింది. తీరా వెళ్ళి చూచేసరికి అక్కడ దాదాపు ఎనభైమందికి పైన సోవియట్ పౌరులు గుమికూడి ఒక సమావేశం జరుపుతూ ఉండడం, పత్రాలు తగులబెడుతూఉండడం కనుపించింది. పోలీ సులు వెంటనే తగులబడకుండా మిగిలిఉన్న పత్రాలను, నెగడి మీాద కాలిపోబోతున్న పత్రాలను స్వాధీనం చేసుకున్నారు. ఈ పత్రాలన్నీకూడా రష్యన్ భాషలోఉన్నాయి. దేశంమొత్తం

మొత్తం భారీయెత్తున కమ్యూనిస్టుప్రచారం సాగించడానికి, దౌర్జన్యవిధానాలతో చైనా జాతీయప్రభుత్వాన్ని కూకటి వేళ్ళతో పెకలించడానికి విస్తృతపథకాలు వేయబడినట్లు ఆ పత్రాలు రుజువుపరుస్తున్నాయి.

నాన్‌కింగ్ ప్రభుత్వం మాస్కోకు తన ఆక్షేపణ తెలియపరచకముందే, సోవియట్ ప్రభుత్వం మే 31 న నాన్‌కింగ్‌కు తన అభ్యంతరం తెలియచేసింది. మే 27 న హార్బిన్‌లో చైనాపోలీసులు జరిపినచర్య చాలా దారుణంగా వున్నదనీ, అంతర్జాతీయ న్యాయసూత్రాలను ఘోరంగా ఉల్లంఘించారనీ ఆరోపించింది. జులై 10, 11 తేదీలలో హార్బిన్‌లోని చైనీస్ అధికారులు కమ్యూనిస్టు ప్రచారాన్ని, విజృంభణను అణచివేయడం అత్యవసరంగా భావించి తగినచర్యలు తీసుకున్నారు. చైనాతూర్పు రైల్వేను, దానికిసంబంధించిన టెలిఫోన్, తంతి వార్తల లైన్లను స్వాధీనపరుచుకోడానికి పూనుకున్నారు. రైల్వే మేనేజిమెంటుకు సంబంధించిన అనేకమంది రష్యన్ ఉద్యోగులను అరెస్టుకావించారు. తరువాత వీరిని సరిహద్దుల అవతలికి వెళ్ళగొట్టారు.

చైనాప్రభుత్వం సోవియట్‌వారి ఆరోపణకు సమాధానం పంపింది. దేశంలో శాంతిభద్రతలు నెలకొనేందుకు చైనా అధికారులు అటువంటిచర్యలు తీసుకోవలసిన అగత్యం కలిగిందని స్పష్టపరిచింది. ఈ తగువును సంప్రతింపులద్వారా పరిష్కరించవలసిందనికూడా చైనాప్రభుత్వంకోరింది. ఈజవాబు వచ్చిన తక్షణమే సోవియట్‌ప్రభుత్వం చైనాకు రెండవ ఉత్తరం వ్రాసిపంపింది. చైనా సోవియట్‌రష్యాలమధ్య రైల్వే రాక

పాకలన్నీ, రాజకీయ సంబంధాలన్నీ తెగ[్రె]ంపులయినట్లుగా ఆ ఉత్తరంలో ఉంది. తరువాత చైనాలోని సోవియట్ హక్కులను రష్యాలోని చైనాహక్కులను తన అధీనంలో ఉంచుకోవలసినదిగా జర్మన్ ప్రభుత్వాన్ని అర్థించింది. జర్మనీ అందుకు అంగీకరించింది.

రాజకీయ సంబంధాలకు ఇలా విఘాతం కలిగినతరువాత వెంటనే మంచూరియా సరిహద్దులలో సోవియట్ బలాలు ఎప్పటికంటె అతి చురుకుగా పనిచేయ్యడం మొదలుపెట్టాయి. ఇలా అంతకంతకు పెరిగిపోతున్న విషమస్థితికి మూలం ఏమిటో స్పష్టంగా వివరిస్తూ చైనా ప్రభుత్వం జులై 19 న ప్రముఖ రాజ్యాలకొక "మేనిఫెస్టో"పంపింది ఈతగువు"చైనాప్రభుత్వం ఉనికికి, చైనాజాతి ఏకత్వానికీ భంగం కలిగిస్తున్నది" అని ఆ "మేనిఫెస్టో"లో స్పష్టంచేశారు.

పరిస్థితి ఇలా రోజురోజుకు అరిష్టసూచకంగా తయారు అవుతున్న సందర్భంలో, తృతీయపక్ష రాజ్యాలవారికి - ముఖ్యంగా అమెరికా సంయుక్త రాష్ట్రాలకు జోక్యం కలిగించుకోడం అవసరంగా కనుపించింది. ఆ తరుణంలో అమెరికా విదేశాంగ మంత్రిగా ఉన్న హెన్రీ స్టిమ్సన్ "పారిస్ శాంతి సంధి"పట్ల ఎంతో ఔత్సుక్యాన్ని ప్రదర్శిస్తూ వచ్చాడు. అది జులై 24 నుంచి అమలులోకి రానున్నది. దాన్ని అమలుపరచే సందర్భంలో జరిపే ఉత్సవంలో పాల్గొనడానికి ఆయన సిద్ధంగా ఉన్నాడు. నిన్నగాక మొన్న జరిగిన ఒడంబడికకు అప్పుడే విఘాతం వాటిల్లకుండా చూడాలని కార్యదర్శి స్టిమ్సన్ ఎంతో ఆందోళనపడసాగాడు. చైనా రష్యాల తగువు బహిరంగ సమరం

లోనికి మారకుండా నివారించేందుకు ప్రయత్నాలు చేశాడు. అప్పటికి ఇంకా రష్యా అమెరికా సంయుక్త రాష్ట్రాలమధ్య రాజకీయసంబంధాలు తిరిగీ ఏర్పడనందున, కార్యదర్శి స్టిమ్సన్ ఫ్రెంచి ప్రభుత్వం రష్యాతో రాయబారాలు జరపాలని ఫ్రెంచి రాయబారిని కోరారు. ఫ్రెంచి విదేశాంగమంత్రి బ్రియెండ్, చైనా రష్యాల తగువును శాంతియుతంగా పరిష్కరించడానికి తాను మధ్యవర్తిత్వం వహిస్తానని తెలియజేశాడు. కాని రష్యన్ విదేశాంగ ఉపమంత్రి కారఖాన్ అందుకు నిరాకరించాడు. జులై 13 న కోరిన సోవియట్‌వారి కోర్కెలకు చైనా ప్రభుత్వం అంగీకరిస్తూ రైల్వేపైన సోవియట్‌కు తిరిగీ చట్టబద్ధమైన హోదాను కలిగిస్తే తప్ప లేకపోతే ఫ్రెంచివారి సూచన "అర్ధరహితమైంది" అని అన్నాడాయన.

ఈలోగా చైనా, సోవియట్ సైనిక వ్యాపార క్రియల నుండి మాత్రమేకాక పశ్చిమ ప్రజాస్వామికాల ప్రజాభిప్రాయంనుండి కూడా తన్నుతాను సంరక్షించుకోవలసి వచ్చింది. పశ్చిమ ప్రజాస్వామ్య రాజ్యాలవారు చైనా తూర్పు రైల్వే మీద చైనా చలాయిస్తున్న తాత్కాలికాధిపత్యాన్ని దురాక్రమణగా భావిస్తున్నారు. దాన్నిబట్టి చైనావారు ముందుముందు తమ దేశంలోని తదితర విదేశీయసంస్థల హక్కులను అధికారాలనుగూడా కబళిస్తారని తలపోస్తున్నారు. ఈ అభిప్రాయాన్ని తొలగించడం ఎంతో అవసరమని భావించి చైనా విదేశాంగమంత్రి డాక్టర్ సి. టి. వాంగ్ "చైనాలోని రష్యన్ కమ్యూనిస్టు ఏజంట్లు అపకారేచ్ఛతో కుట్రలను సాగిస్తున్నారని కనుగొనడంవల్లనే చైనా తూర్పురైల్వే విషయంలో అలా

ప్రవర్తించాంకాని మరో ఉద్దేశంతో కాదు. చైనా ప్రభుత్వం ఈచర్య తీసుకోటంలో ఉద్దేశం కమ్యూనిస్టుల కార్యకలాపాలను సరిచిద్దాలనేకాని రైల్వేను ఆక్రమించుకోవాలని కానేకాదు" అని స్పష్టంగా తెలియచేశాడు.

ఇంచుమించు ఈ సమయంలోనే మంచూరియాలో స్థానిక సంప్రతింపులు మొదలయినాయి. ముక్డెన్ ప్రభుత్వం చేసిన ప్రతిపాదనలు సోవియట్ ప్రభుత్వం ఒప్పుకోలేనని చెప్పి త్రోసిపుచ్చింది. ముక్డెన్ ప్రభుత్వం తగువు పరిష్కారం అయ్యే అవకాశాన్ని భగ్నం చేస్తున్నదనీ, ఉత్తరోత్తరా వచ్చే ఫలితాలకు బాధ్యులాలనీ కారఖాన్ ఆ ప్రభుత్వంమీద నేరారోపణ చేశాడు. తరువాత అగస్టు 6 న నాన్‌కింగ్‌లోని విదేశమంత్రిత్వ శాఖ సంప్రతింపులు విఫలమైపోయాయని సాధికారంగా ప్రకటించింది. సోవియట్లు చైనీయులను భయపెట్టడంకోసం తమ సైనిక సంరంభాన్ని తీవ్రం చేస్తూవచ్చారు.

ఇలా రోజురోజుకు పరిస్థితి విషమిస్తోంది. ఈ పరిస్థితిని అమెరికన్ ప్రభుత్వ కార్యదర్శి స్టిమ్సన్ ఎప్పటికప్పుడు జాగ్రత్తగా పరిశీలిస్తున్నాడు. ఇక ఆయనకు జోక్యం కలిగించుకోక తప్పిందికాదు. జులై 25 కు ముందుగానే ఆయన బ్రిటిష్, ఫ్రెంచి, జపాన్, ఇటలీప్రభుత్వాలకు సఖ్యమార్గం ఒకటి సూచించాడు. "చైనారష్యాలు అంగీకరించిన ఒక ప్రధాన జాతీయప్రభుత్వాన్ని కాని, మరేదైనా తటస్థదేశాన్నికాని" చైనా తూర్పురైల్వే తాలూకు తగువును పరిష్కరించడానికి ప్రెసిడెంటుగాను, జనరల్ మేనేజరుగాను నియమించి, "చైనా రష్యాలు సమ్మతించిన సభ్యులతో నిష్పాక్షికమైన మధ్యస్తి

పరిష్కారసంఘం ఒకటి ఏర్పాటు చెయ్యాలనీ" ఇరుపక్షాలవారి కష్టాలకు హక్కులకు సంబంధించిన "వాస్తవాలు పరిశీలించేందుకు ఆ సంఘానికి పూర్తిఅధికారం ఉండాలనీ" ఆయన సూచించాడు. దానిమీద కారఖాన్ తృతీయపక్ష ప్రభుత్వాలను హెచ్చరిస్తూ ఒక ప్రకటన చేశాడు. చైనా అధికారవర్గం చైనా తూర్పు రైల్వేను ఆక్రమణ చేసినపిదప, పరిష్కారమార్గం చూపుతున్నామన్న పేరుతో ఇతరులు జోక్యం కలిగించుకోనడానికి తాము అంగీకరించమని ఆయన ఆ ప్రకటనలో స్పష్టపరిచాడు.

ఈలోగా మంచూరియా సరిహద్దుపొడుగునా ద్వేషాలు, కావేషాలు తీవ్రరూపం దాలుస్తున్నాయి. నవంబరు 18 న రష్యన్‌లు మంచూలీ, చెలైనార్లపైన తీవ్రమైన దాడులు జరిపారు. మంచూరియా స్టేషన్‌లో కొంతభాగం నేలమట్టం చేశారు. చెలైనార్ బొగ్గుగనులు ధ్వంసంచేశారు. ఈదాడుల్లో సోవియట్ విమానాలు పాల్గొన్నాయి. చైనాలో రాకపోకల సంబంధాలు తెగిపోయేటట్లుగా చైనా తూర్పురైల్వేలో ఒక భాగాన బాంబులు వేశాయి. మూడురోజులు తీవ్రంగాపోరాటం సాగినపిదప మంచూలీ, చెలైనార్-రెండూకూడా సోవియట్ దళాలకు స్వాధీనమైనాయి. నవంబరు 25 న నాన్‌కింగ్ ప్రభుత్వం నానాజాతిసమితికి, పారిస్ శాంతి ఒడంబడికపై సంతకాలుచేసిన వారికీ మంచూరియాపై సోవియట్ దండయాత్రను గమనించవలసినదని విజ్ఞప్తిచేస్తూ తంతివార్తలు పంపింది. ఇది వాషింగ్‌టన్‌లో తీవ్రసంచలనాన్ని కలిగించింది. ఆ మరుసటిరోజే కార్య

దర్శి స్టిమ్సన్ ఒక ప్రకటన తయారుకావించాడు. చైనా రష్యాలు తమ వివాదాన్ని శాంతియుతమైన మార్గాలద్వారా పరిష్కరించుకోడం ఎంతైనా అవసరమనీ, చైనా రష్యాలతో సహా-యాభైఅయిదురాజ్యాలవారు ఆమోదించిన పారిస్ శాంతి ఒడంబడికకు బద్ధులై ప్రవర్తించవలెననీ ఆయన ఆ ప్రకటనలో స్పష్టంచేశాడు. అమెరికన్ సంయుక్తరాష్ట్రాలతోపాటు - ఇదే రీతిగా ఒక బహిరంగ ప్రకటన చేయవలసిందిగా ఫ్రాన్సు, బ్రిటను, జపాను, ఇటలీప్రభుత్వాలవారికి సూచించాడు. స్టిమ్సన్ ప్రతిపాదించిన ఈ ప్రకటనకు వివిధరీతుల ప్రత్యుత్తరాలు వచ్చాయి.

నవంబరు 30న కార్యదర్శి స్టిమ్సన్ స్వతంత్రచర్య తీసుకున్నాడు. తన నవంబరు 26 ప్రకటనను, నేరుగా చైనా ప్రభుత్వము పేర పంపుతూ, అమెరికా సంయుక్త రాష్ట్రాల పక్షాన అలాటి ప్రకటనే ఒకటి సోవియట్ప్రభుత్వానికి అందజేయవలసిందిగా ఫ్రెంచిప్రభుత్వాన్ని కోరాడు. అంతేకాదు. అలాటి ప్రకటనలనే తనపేరుతో చైనా రష్యాలను ఉద్దేశిస్తూ పంపవలసిందిగా ఫ్రెంచిప్రభుత్వానికి చెప్పాడుకూడా. డిసెంబరు 1న ఆయన మరికొంత చొరవతీసుకుని, పారిస్ శాంతిఒడంబడికకు బద్ధులైఉన్న తక్కినదేశాలన్నింటికీకూడా అలాంటి పత్రాలు పంపాడు. ఆ దేశాలవారంతా, అమెరికన్ ప్రకటనలాంటిదే ఒక్కొక్కప్రకటన చైనా రష్యాలపేర జారీచేయవలసిందని ఆయన వారిని కోరాడు.

అమెరికా సూచనను, ఫ్రెంచిప్రభుత్వం డిసెంబరు 3న పూర్తిగా అమలుపరిచింది. బ్రిటను, ఇటలీ, పారిస్ శాంతి

ఒప్పందాలపై సంతకాలు చేసినవారు ఇంకా అనేకులు-ఒక్క జపాను, జర్మనీతప్ప, అందరూకూడా అలాంటి ప్రకటనలే చైనా రష్యాలకు పంపారు. లోకాభిప్రాయం అంతా ఒకటయి తెచ్చిపెట్టిన ఒత్తిడివల్ల ముఖాముఖి సాగుతున్న సంప్రతింపులు ఎక్కడివక్కడ సడలిపోయేటట్లు కనుపించాయి. తగవు పరిష్కరించడానికి అప్పటికే రష్యన్లతో సాగుతున్న సంప్రతింపులలో నాన్‌కింగ్ ప్రభుత్వం మార్షల్ చాంగ్‌హ్యూలియెంగ్‌కు కావలసినంత స్వేచ్ఛ ఇచ్చింది. ఖబరోవ్‌స్క్ వద్ద డిసెంబరు 22 న సమావేశంలో సంతకాలు చేసి కుదుర్చుకున్న రాజీలో వివాద పరిష్కారానికి ఈ క్రింది షరతులు పొందుపరచబడ్డాయి:

1. తగువుకు పూర్వం ఉన్న పరిస్థితి తిరిగి నెలకొనేటట్లు చేయాలి. 2. సంఘర్షణ జరిగిన సందర్భంలో అరెస్టు కావించబడిన చైనా పౌరులను, సోవియట్ పౌరులను విడుదల చెయ్యాలి. 3. రైల్వే పదవులనుంచి తొలగించబడిన సోవియట్ ఉద్యోగులకు తిరిగి ఆయా పదవులను పొందే హక్కును, అవకాశాన్ని మంజూరు చేయాలి. 4. చైనా అధికారులు రష్యన్ "వైట్‌గార్డ్" దళాలను నిరాయుధులచేసి దేశంనుంచి పంపించివెయ్యాలి. 5. మంచూరియాలో ఉండే సోవియట్ స్థానిక ప్రతినిధులను, సోవియట్ దూరప్రాచ్య రష్యాలోఉండే చైనా స్థానికప్రతినిధులను తక్షణం పూర్వంలాగే ఉండనీయటానికిఏర్పాట్లుచేసి, వారికి అంతర్జాతీయన్యాయ సూత్రాలప్రకారం, ఆచారప్రకారం అన్ని సౌకర్యాలు కలిగించాలి. 6. మంచూరియాలో ఉండే సోవియట్ ఆర్థికసంస్థలన్నీ రష్యాలోవుండే చైనా

వాణిజ్యసంస్థసన్నీ తిరిగీ పోరాటానికి పూర్వంలాగానే తిరుతీపు కార్యకలాపాలు నిర్వహించుకునేటట్లు చెయ్యాలి. 7. వివాదం తాలూకు సమస్యలన్నీ పరిష్కరించుకునేందుకు 1930 జనవరి 25న మాస్కోలో చైనా-రష్యాప్రతినిధుల సమావేశం ఒకటి ఏర్పాటు చెయ్యాలి.8.తక్షణం ఇరుపక్షాలవారూ తమతమ సైనిక బలాలను ఉపసంహరించుకుని చైనా, సోవియట్ రష్యాల సరిహద్దుల పొడుగునా తిరిగీ శాంతి నెలకొనేటట్లు చెయ్యాలి. 9. ఈ ఒడంబడిక సంతకాలు అయిన మరుక్షణంనుంచే అమలులోకి రావాలి.

ఒడంబడిక జరిగిన ఒక నెలరోజులలోగానే ఈ షరతులలో చాలాభాగం ఆప్రకారం నెరవేర్చబడినాయి. చైనా-రష్యా సమావేశం 1930 జనవరి 25 నాటికి జరగాలని నిర్ణయించుకున్నప్పటికీ, కారణాంతరాలవల్ల ఆలస్యమైంది. తరువాత ఆ సమావేశం నిష్ప్రయోజనమని తేలిపోయింటికూడా.

## శాంతికోసం చైనా రష్యాల వ్యూహాలు

1929 అక్టోబరు చివరలో ఆర్థికమాంద్యం ఏర్పడి విపరీతమైన విషమస్థితికి వెళ్ళిపోయింది. అనేక దేశాలవారిని పారిశ్రామిక అన్యవస్థ, నిరుద్యోగం, సాంఘిక భద్రతా రాహిత్యం, ఇవన్నీకూడా పట్టుకుని పీడించసాగాయి. ప్రపంచమంతటా ఆర్థికమాంద్యం కారుమేఘంలా కమ్ముకున్నది. విశ్వవ్యాప్తంగా వచ్చిన ఈ ఆర్థికమాంద్యంవల్ల స్వేచ్ఛకంటె అన్నం ఎక్కువ అవసరమైపోయింది. జపాను, ఇటలీ, జర్మనీలలోను, తదితర యూరప్ దేశాలలోను సైనికతత్వం, ఫాసిజం, నిరంకుశత్వం; ఇవన్నీ పుట్టి, పెరిగి పెద్దవికావడానికి దోహద

మైంది. అంతర్జాతీయ సంబంధాలలో ఒక నూతన అధ్యాయం ప్రారంభమయింది. కలహానికి కాలుదువ్వి, ప్రబలంగావచ్చి పైన బడడం, అంతర్జాతీయ నీతిని, న్యాయసూత్రాలను ద్వేషించడం దాని స్వభావం అయింది. నానాజాతి సమితి శిధిలావస్థకు వచ్చింది. అంతర్జాతీయ చట్టాన్ని, ధర్మాన్ని అపహాసించింది. అసాధారణ పరిస్థితి ఏర్పడిన ఈ తరుణంలో చైనా సోవియట్ సంబంధాలు, ఆ ఇరుదేశాలమధ్య ప్రత్యక్షంగావున్న సమస్యల కంటే అటు చైనాకు లేక ఇటు రష్యాకు తదితర దేశాలతోగల సంబంధాలకు మరింత ఎక్కువ విఘాతం వాటిల్లింది.

నానాజాతిసమితి నిబంధనలవల్ల, నవరాజ్యసంధి నియమావళివల్ల, కొంతవరకు పాశ్చాత్యరాజ్యాల ప్రాబల్య ప్రాభవాభివృద్ధివల్ల అంతవరకు అణుగుపడి ఉండిన జపానుదేశం మళ్ళీ చైనాపై దౌర్జన్యానికి తలపడుతోంది. ఈ దౌర్జన్యాన్ని ప్రోత్సహించిన ప్రధానహేతువులు రెండింటిలో ఒకటి ప్రపంచ ఆర్థిక మాంద్యం. ఇహ రెండవది 1931 లో సంభవించిన ఘోరమైన వరదప్రమాదంవల్ల చైనా ఆంతరంగిక విషయాల్లో ఆపద సంఘటిల్లడం. 1931 సెప్టెంబరు 18 రాత్రి, ప్రాకారరక్షితమైన చైనీయుల ముక్డెన్ నగరంపై దండయాత్ర చేసేటందుకు జపాన్ తన సైన్యాలను దక్షిణ మంచూరియాలోకి నడిపింది. చైనా రాష్ట్రాలను, ఆర్థికసంస్థలను, అధికారాన్ని సాయుధబలాలతో ఆక్రమించుకొనడం ప్రారంభించింది. కొన్ని నెలలలో మంచూరియా యావత్తూ తన ఇనుప పాదాలక్రిందికి తెచ్చుకుంది. చైనా ఈవిషయం నానాజాతి సమితికి మనవిచేసుకుంది. కాని సమితి జపాన్‌పై తగినచర్యలు తీసుకోలేకపోయింది.

చైనా–జపాన్ తగువుపట్ల తటస్థవిధానాన్ని అవలంభించ వలసిందిగా జపాన్‌ప్రభుత్వం సోవియట్‌ప్రభుత్వాన్ని అడిగింది. అందుకు సమాధానంగా లిట్వినోవ్ జపాను సోవియట్ హక్కులకూ, అధికారాలకు ప్రమాదం వాటిల్లకుండా నడుచుకునేట్లయితే, తటస్థవిధానం అవలంభించడానికి తాను అంగీకరిస్తానని చెప్పాడు. 1928 అక్టోబరు 1 నుండి అమలులోకివస్తున్న తన పంచవర్ష ప్రణాళిక జయప్రదంగా పూర్తికావాలంటే శాంతి అవసరమన్న దృష్టితో సోవియట్‌ప్రభుత్వం జపాన్‌పట్ల సఖ్యవిధానాన్ని అనుసరించింది. మంచూరియా తగువు విషయంలో మాత్రం ఖచ్చితమైన తాటస్థ్యాన్ని వహిస్తూవచ్చింది. సోవియట్లు తీరని ఆశాభంగం చెందారు. వారి శాంతివిధానం పెచ్చుమీరిపోతున్న జపాన్ దుండగాలను అరికట్టలేకపోయింది. మంచూరియాలోని వార్తాపత్రికలవారు, జపాన్, సోవియట్లు మంచూరియాలో రైలుమార్గాలను, వంతెనలను పడగొట్టడానికీ అక్కడ 'కమ్యూనిస్టు విప్లవం' వ్యాపింపచేయడానికీ తమ గూఢచారులను అక్కడికి పంపుతున్నారని ఆరోపించారు. బోల్షివిజంనుంచి కాపాడడానికి తానొక దుర్గమదుర్గంలా ఉంటున్నాననే అభిప్రాయం ప్రపంచానికి కలిగించాలని జపాన్ అనుకుని ఉండవచ్చు. కాని దాని ప్రతికూలవిధానం తేక సటన, తమజాతీయ, సమాజాభ్యుదయ కార్యకలాపాలకు శాంతి అత్యావసరమని భావిస్తున్న సోవియట్ల భయాందోళనలకు మూలాధారం అయింది.

నానాజాతిసమితికి చెందిన లిట్టన్ విచారణసంఘం మంచూరియాకు తరలివెళ్ళి ఒక నివేదిక సమర్పించింది. మంచూ

రియాలో జపాన్ ప్రవర్తన చాలా అసమంజసంగా ఉన్నదని తెలిపింది. కాని జపాను దాడిచేసిందా లేదా అన్న ప్రధాన న్యాయసమస్యను ఆ నివేదిక పూర్తిగా వదిలివేసింది. అంచేత జపాన్ దాడిచేసి సమరంసాగించే చర్యలకు దిగిందనీ, అందుకు దాన్ని శిక్షించాలనీ కాంక్షించే చైనా ప్రజల కోర్కెలను ఆ విచారణ సంఘం మన్నించలేక పోయింది. తన భ్రమలన్నీ పోగొట్టుకుని చైనా, సోవియట్ యూనియన్‌తో తిరిగీ మామూలు రాజకీయ, రాయబార సంబంధాలను ఏర్పరుచుకుంది.

జపాన్ మంచూరియాను ఎప్పుడైతే ఆక్రమించుకున్నదో అప్పటినుంచీ చైనా తూర్పు రైల్వే, జపాన్ రష్యాల మధ్య సంఘర్షణకు మూలకారణమైంది. రైల్వేను జపాన్ సైన్యాల రాకపోకలకు ఉపయోగించుకోడానికి సోవియట్ ప్రభుత్వం అంగీకరించిన తరువాత కూడా చిక్కులు తొలగి పోలేదు. రైల్వే ఇంకా ఎక్కువ నష్టాలకు గురి అయింది. రైల్వే మేనేజిమెంటు అంతకుపూర్వం 1929 లో ఈ రైల్వే వివాదం చైనా సోవియట్లమధ్య ప్రత్యక్ష సమరంగా మారినప్పటికంటె కూడా, ఇప్పుడు ఎక్కువ ఆవేశాలకు లోను అయింది. అయినప్పటికీ జపాన్ మీద తీవ్రచర్యలు తీసుకోడానికి మారుగా సోవియట్ ప్రభుత్వం వెనుకంజవేసే విధానం అవలంభించింది. జపాన్‌కు కీలుబొమ్మ అయిన మంచూ కూకు రైల్వేను అమ్మడానికి ప్రయత్నించింది. ఈ విధానంలోగల తక్షణోద్దేశం జపాన్‌తో తనకువచ్చిన చిక్కుకు మూలాధారమైనదాన్ని వదిలించుకోడమే. కాని ఇందులో అధికారంకోసం సాగుతున్న ప్రపంచ రాజకీయాల దృష్ట్యా మరొక దూరా

లోచనకూడా ఉన్నది. 1927 సంవత్సరాంతానికి పూర్వం స్టాలిన్, అప్పటికే రైల్వేను జపాన్‌వారికి అమ్మి వేయాలనే తలంపుతో ఉన్నాడు. వెనుకటి సోవియట్ రాజ్య తంత్రజ్ఞుడు బెసొడొవిస్కీ "నేను మాస్కోలో దిగీ దిగడంతోనే స్టాలిన్‌ను కలుసుకుని చైనా తూర్పు రైల్వే విషయం ముచ్చటించాను... 'నీవు నన్నడిగినట్లయితే తుదకు మనమీ రైల్వేను అమ్మి వేయటం మంచిదని చెబుతాను. రైల్వే మనకు ఉండడంవల్ల తూర్పున మన విధానం దుర్బలమై పోతోంది, ఈ విషయాన్ని గుర్తుంచుకో. దీన్ని వదులుకోడంవల్ల ఒకే పెద్ద మొత్తంగా డబ్బు మన చేతిలో పడుతుంది. అమెరికా జపాన్‌లమధ్య వైరం ప్రజ్వరిల్లుతుందికూడా' అని స్టాలిన్ నాతో అన్నాడు" అంటూ వ్రాశాడు. ఈ సోవియట్ ప్రతిపాదన చైనాకు తీవ్ర కోపకారణమైంది. చలనం లేకుండాఉన్న చైనా సోవియట్ సంబంధాలను ఒక్కమాటుగా ఊపివేసి కలవరం కలిగించింది. రైల్వేను అమ్మేవిషయంలో చైనా ప్రభుత్వం రష్యా ప్రభుత్వానికి తన ఆక్షేపణను తెలిపింది. 1924 లో చేసుకున్న పెకింగ్ ఒడంబడిక 9 వ నిబంధనలోని "ఖరారు పడుతున్న ఇరుపక్షాలవారికి చెందిన రెండు ప్రభుత్వాల వారూ, చైనా తూర్పు రైల్వే భవిష్యత్తు చైనా రిపబ్లిక్ చేత, యూనియన్ ఆఫ్ సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్స్‌చేత నిర్ణయింప బడడానికి పరస్పరం అంగీకరిస్తున్నారు." అన్న విషయాన్ని తీవ్రంగా ఉల్లంఘించడం జరిగిందని చైనా ప్రభుత్వం సోవియట్ ప్రభుత్వంపైన నేరారోపణ చేసింది. చైనాఆక్షేపణను త్రోసిపుచ్చి

సోవియట్లు రైల్వేను అమ్మివేయడానికి జపాన్‌తో సంప్రతిం పులు జరపసాగారు. 1935 మార్చి 23 న రైల్వే యాజ మాన్యాన్ని మార్పిడి చేయడానికి సంబంధించి ఒక లాంఛన ప్రాయమైన ఖరారునామాపై సంతకాలు జరిగాయి.

చైనా తెలిపిన ఆక్షేపణలో ఒక ప్రశ్నకూడా ఇమిడి ఉన్నది. అసలు సోవియట్ యూనియన్‌కు రైల్వేపైన క్రమ బద్ధమైన యాజమాన్యం ఉన్నదా అన్నదే ఆ ప్రశ్న. సోవి యట్ ప్రభుత్వం "రష్యా ప్రజలు తమ చెమట ధారపోసి సంపాదించిన డబ్బును రైల్వే నిర్మాణానికి ఇచ్చారు" అని వాదించింది. కాని ఇది సరియైంది కాదని చైనా తూర్పు రైల్వే కంపెనీకి పూర్వం అధ్యక్షుడుగా ఉన్న ఒకాయన తెలిపాడు. "ఉక్కుపనితో ఉన్న బిల్డింగు, నిర్మాణ పర్యవేక్షణతప్ప తక్కిన రైల్వే పనియావత్తూ చైనా కూలీలే చేశారు. వారు రోమనోఫ్ రూబుల్ నోట్ల రూపంలో డబ్బు చెల్లించారు... సోవియట్లు రూబుల్ నాణాన్ని ఎత్తివేసినప్పుడు రోమనోఫ్ డబ్బు విలువలేకుండా పోయింది. తరువాత రోమనోఫ్ నోట్లన్ని టిపైన "రష్యన్ సామ్రాజ్యం యొక్క ద్రవ్య సాధనాలు" అని స్పష్టంగా అచ్చువేయబడింది. దానితో ఇవి 'సెక్యూరిటీ బాండ్లు' అయినాయి. అంచాత ఈ నోట్లు కలిగిఉన్నవారు చైనా తూర్పు రైల్వేపైన ప్రత్యక్షంగా హక్కుకలిగి ఉన్నా రన్నది స్పష్టమవుతోంది. కనుక చైనా తూర్పు రైల్వేకు డబ్బు చెల్లించినవారు శ్రామికులయిన మంచూరియా ప్రజలుకాని రష్యన్‌లుకాదు..." అని ఆయన వ్రాశాడు.

1935లో సోవియట్ యూనియన్ తన జాతీయభద్రత విషయంలో పుష్కలమైన అభ్యుదయం సాధించింది. రాజకీయంగా విడివడి ఉండడంవల్ల వచ్చిన ప్రమాదస్థితినుంచి బయట పడింది. ఒక కొత్త రాజకీయరంగాన్ని ఏర్పరచుకున్నదికూడా. సోవియట్ పశ్చిమసరిహద్దులోను, దాని అవతలఉన్న రాజ్యాల వారు సోవియట్ యూనియనుపట్ల దౌర్జన్యరహితమైన ఒప్పందాలకు కట్టుబడి ప్రవర్తించసాగారు. ఏమైనప్పటికీ ఆ ఏడాది సోవియట్ ఒక రాజకీయ ఘనవిజయాన్ని సాధించింది — అమెరికా సంయుక్తరాష్ట్రాలతో సంబంధాలు స్థిరపరుచుకున్నది. ప్రెసిడెంటు రూజ్వెల్టు, సోవియట్ రాయబారి — లిట్వినోవ్ వీరు పరస్పర వాగ్దానపత్రాలు వ్రాసుకున్నారుకూడా. ఒకరి రాజ్యవిషయాల్లో ఒకరు జోక్యం కలిగించుకోరాదనీ, అప్పుడున్న రాజకీయ సాంఘికస్థితికి భంగంకలిగించే విధంగా ఒకరి రాజ్యంలో ఒకరు ఆందోళనకాని, ప్రచారంకానీ సాగించరాదనీ ఏర్పాటుచేసుకున్నారు.

సోవియట్‌రష్యా సంయుక్తరాష్ట్రాలమధ్య ఏర్పాటయిన మామూలుసంబంధాలు జర్మనీ జపానులకు కోపావేశాలకు కారణమయి ఉండవచ్చు. ఈ పరిస్థితులలో సోవియట్‌యూనియన్ మరొకపనికూడా చేసింది. తన రాజ్యతంత్రాలను సరిదిద్దుకోడానికి ప్రయత్నించి, నానారాజ్యసమితిలో చేరగలిగింది. నానారాజ్యసమితిలో సోవియట్ యూనియను ప్రవేశం జపాను జర్మనీలు మరింత సన్నిహిత స్నేహితులు కావడానికి తగిన అగత్యాన్ని కల్పించింది. పెచ్చుమీరి కలహానికి కాలుదువ్వే ఈ రెండుదేశాలూ సోవియట్ యూనియనును రాసు

రాను తీవ్రంగా ఒత్తిడిచేస్తూ వచ్చాయి. ఇక సోవియట్ యూనియను యుద్ధం నివారించలేక నిరాశ చెందింది.

ఇక ఆసియా ఖండంలో జపాను, లోపలి మంగోలియా ఉత్తర చైనాలదిశగా తన సామ్రాజ్యాన్ని విస్తరింపచేస్తూనే వచ్చింది. దానివల్ల ఒక్క చైనానుమాత్రమే కాక సోవియట్ యూనియనునుకూడా బెదిరించసాగింది. ట్రాన్సు-బైకాల్ ప్రాంతంలో భయంకరమైన కపటోపాయాలు కొనసాగాయి. చైనా సమూహాలు తమ సంబంధాలను తెగతెంపులు చేసుకుని, తమ ఉమ్మడిరికీ శత్రువైన జపానును కలిసి ఎదిరించలేక, ఎవరికి వారు ఒకవైపు తమ జాతీయబలాన్ని అభివృద్ధిపరుచుకోడం తోను, మరొకవైపు జపానుతో ముందుగా సంఘర్షణ సాధ్యమైనంత వరకు నివారించుకోవడంతోను – ఈ తీవ్రపరిస్థిని ఎదుర్కొంటూ వచ్చారు.

చైనావిషయంలో, 1933నుంచికూడా కేంద్రప్రభుత్వం తన జాతీయ పునర్నిర్మాణ కార్యక్రమాన్ని కొనసాగించడానికి నిర్దిష్టమైన కృషి కొనసాగిస్తూ వచ్చింది. నానారాజ్య సమితి నుంచి, ఇంగ్లండు, సంయుక్తరాష్ట్రాలు మొదలయిన మిత్ర రాజ్యాలనుంచి టెక్నీషియన్లను, నిపుణులను ఆహ్వానించింది. జపాను విదేశకార్యాలయోద్యోగి చైనాకు విదేశాలనుంచి ఆర్థికసహాయం వెళ్ళరాదని అభ్యంతరం తెలుపుతూ ఒక ప్రకటన చేశాడు, అంతేకాదు. చైనాతో ఎట్టిసంబంధం పెట్టుకోక దూరంగా ఉండవలసిందనికూడా ఈ రాజ్యాలవారిని హెచ్చరించాడు. 1936 ఆరంభంలో జపాను విదేశాంగమంత్రి హొటా కమ్యూనిజానికి వ్యతిరేకంగా తమకు సహాయపడమనీ, జపాను

వ్యతిరిక్త కార్యకలాపాలను ఆపుచేయమనీ, మంచూ కూను గుర్తించవలసిందనీ చైనాను ఒత్తిడిచేశాడు. కాని చైనాఒప్పుకో లేదు. ఏటివల్ల తన ఆంతరంగిక వ్యవహారాలలో జపాను తల దూర్చే అవకాశం కలుగుతుందని చైనా భీతిచెందింది. ఆ విధంగా చైనా జపాను సంబంధాలకు పెద్ద విఘాతం వాటిల్లింది. జపాను ఇక ఆగక ఉత్తరచైనాలోను, లోపలి మంగోలియా లోను కొంచెం కొంచెం ముక్కలుముక్కలుగా ఆక్రమణ చేస్తూవచ్చింది. ఈ ఆక్రమణకూడా జపానుతో యుద్ధం తెచ్చి పెట్టేటంత ప్రమాదకరమైంది కాదుకనుక, నాన్‌కింగ్ ప్రభుత్వం ఒక చెంపన పరాభవాలు సహిస్తూ, మరొక చెంపన ఆంతరంగిక దృత్వాన్ని సంపాదించుకొనడానికి సమరసన్నాహాలు చేసుకో డానికి కాలయాపనచేస్తూ, మనసులో ఇష్టంలేకపోయినా ఎప్పటికప్పుడు తలఒగ్గుతూ పరిస్థితిని ఎదుర్కొంటూవచ్చింది.

చైనాలో కూడా ప్రభుత్వానికీ చైనా కమ్యూనిస్టులకు మధ్య సాగుతున్న పోరాటం ముమ్మరమయింది. చైనాకమ్యూ నిస్టుపార్టీ, కోమింటరన్‌నుంచి ఎప్పటి కప్పుడు ఉత్తేజాన్ని, ఉపదేశాలను పొందుతూనే ఉన్నది. చైనా అంతర్భాగంలో ఎర్రసైన్యం ఒకటి ఏర్పాటు కావించబడింది. దానితో పాటే కమ్యూనిస్టు మండలాలుకూడా స్థాపించారు. మధ్య చైనా లోని రాష్ట్రాల సరిహద్దుల పొడుగునా 'ఎర్రమండలాలని' పిలువబడే మండలాలు వెలిసినయి. కమ్యూనిస్టు తిరుగుబాటు దార్లతో నిండిఉన్న మధ్య చైనాను ఖాళీచేయించడానికి చాంగ్‌కు నాలుగు సంవత్సరాలు పట్టింది అంతేకాదు. లక్షు లాది సైనికులతో బ్రహ్మాండమైన సైనిక దండయాత్రలు సాగించ

వలసి వచ్చింది. లెక్కలేనన్ని సాదన సంపత్తిని ఉపయోగించ వలసి వచ్చింది. అనుకున్న సమయం ఆసన్నమైంది. అది 1934 నవంబరు 10 కమ్యూనిస్టు నాయకులు "దీర్ఘ యాత్ర" సాగించారు. అప్పుడు అప్పటినుంచీ దానికా పేరు వచ్చింది. పూర్వపు చైనా కమ్యూనిస్టు నాయకుడు చాంగ్ కూటోయ్ చెప్పిన ప్రకారం చూస్తే "మాస్కోనుంచివచ్చిన ఉత్తర్వుల ప్రకారమే" ఈ ప్రధాన నిర్ణయంజరిగిందని తెలుస్తోంది. కనుక కొమింటెరన్, చైనా కమ్యూనిస్టుపార్టీని ఎప్పటికీ తన గుప్పిట్లోంచి వదిలిపెట్టలేదనడానికి ఇది మరొక సాక్ష్యం సరే, కమ్యూనిస్టుల ఈ "దీర్ఘ యాత్ర" చలి ప్రదేశమైన పశ్చిమోత్తర ప్రాంతంలో పరిసమాప్తమైంది. ఇక్కడ చైనా కమ్యూనిస్టులు యెనన్‌లో తమ ముఖ్యపట్టణాన్ని స్థాపించారు. ఉన్నతాధికారాన్ని చేపట్టడంకోసం పోరాటం కొనసాగించారు.

నాన్‌కింగ్ ప్రభుత్వం తన జాతీయ పునర్నిర్మాణ కార్యక్రమంలో ముందుకు సాగిపోయింది. అంతటా ఒకే విధమైన కరెన్సీ అమలులోకి వచ్చింది. రాకపోకలు, రవాణా సాకార్యాలు అభివృద్ధిచేయబడ్డాయి, విస్తృతమైనాయి. విదేశ వర్తకం పెంపొందింది. అందరికీ విద్యా సౌకర్యం కలిగింది. ప్రజలలో నీతి ఉన్నత శిఖరాలను అందుకున్నది. జాతీయ పునర్నిర్మాణానికి గట్టిపునాది వేసుకునేఅవకాశం మరింత ఎక్కువ చేసుకోవాలనే తీవ్రకాంక్షతో నాన్‌కింగ్ ప్రభుత్వం శాంతిని వాంఛించింది. ఇష్టంలేకపోయినా జపాను, లోపలిమంగోలియాలోను, ఉత్తర చైనాలోను ఒక్కొక్కభాగం ఆక్రమించుకోడాన్ని సహించి, తలఒగ్గింది.

ఇక రష్యా తన ద్వితీయపంచవర్ష ప్రణాళిక ప్రారంభించి ఒక పెద్ద యుద్ధపరిశ్రమ నెలకొల్పాలని ఉద్దేశించింది. ఈప్రణాళిక పూర్తి చేసుకునేందుకు రష్యాకుకూడా శాంతిఎంతో అవసరమైంది. అంతేకాకుండా రష్యా తన ఆంతరంగిక పరిస్థితిలో పొంచిఉన్న ప్రమాదాలవల్ల, అగత్యాలవల్ల అంతర్జాతీయశాంతి కావాలని నిర్బంధంగా వెంటాడి వేధించసాగింది. 1934 డిసెంబరు 1 న ఒక అధికార సోవియట్ ప్రకటన వెలువడింది. చాలా దూరానికి పోగల టెర్రరిస్టుల (భయంకరవిప్లవవాదుల) పన్నుగడలు, విదేశ మధ్యవర్తిత్వ లక్షణాలు యూనియన్‌లోపల నడుస్తున్నాయని ఆ ప్రకటన తెలిపింది. దాంతో పెద్ద సంచలనం మొదలయింది. సరియైన మాటలలో చెప్పాలంటే అది ఒక అంతర్యుద్ధం. కమ్యూనిస్టుపార్టీలోనుంచి అనేకమంది సభ్యులు తొలగించబడ్డారు, దేశంనుంచి వెళ్ళగొట్టబడ్డారు, ఉరితీయబడ్డారు కూడా. ఇలాంటి ఆంతరంగిక కల్లోలస్థితిలో చిక్కుకొని, తిరుగుబాటుదార్ల చేత, పంచమాంగదళాలచేత చుట్టూ ముసురుకోబడి, భయభ్రాంతులలో మునిగిపోయి, రష్యా ఏదో ఒక విదేశ యుద్ధపు తాకిడికి తప్పకుండా అణిగిపోయిఉండేది. కేవలం తన ఉనికిని అట్టిపెట్టుకోడంకోసం రష్యాకు శాంతిని కాపాడుకొనక తప్పిందికాదు.

ఏమైనప్పటికీ శాంతికోసం రష్యాపెట్టుకున్న ఆశలు రాను రాను అడుగంటిపోసాగాయి. 1936 శరదృతువులో హిట్లర్ తన కోర్కెను ప్రత్యక్షంగా చాటాడు. సోవియట్ యూనియన్‌పై దండయాత్రచేసి దాన్ని ఆక్రమించుకుంటానని చెప్పాడు. ఏమైనా సోవియట్ యూనియన్‌కు గొప్పగొప్ప ప్రమాదాలు

ప్రత్యక్షంగా తూర్పుదిశనుంచి వచ్చిపడ్డాయి. ఇటువైపున జపాన్ కేవలం బెదిరించడం, మోసగించడమే కాకుండా, సరిహద్దుల పొడుగునా సాయుధదళాలతో దెబ్బలుతీస్తూ ప్రత్యక్షసమరానికిదిగింది. 1936 ఆఖరున జపాన్ జర్మనీలు జగద్విదితమైన కొమింటరన్ వ్యతిరేకపు ఒడంబడికతో స్నేహం కలుపుకున్నాయి. ఆ ఒడంబడిక సోవియట్‌యూనియన్‌కు వ్యతిరేకంగా జర్మనీ జపాన్‌ల సఖ్యంకోసం ఏర్పడ్డదేననీ, దానిఉద్దేశమల్లా రష్యాను చుట్టివేయడమేననీ జపాన్ వార్తాపత్రికలు బాహాటంగా ప్రచురించాయి. దానికి జతపడేటట్లుగా ఇక్కడ సోవియట్ యూనియన్‌లో ప్రజ్వరిల్లిన విపరీత సంచలనంలో కొత్తరహస్యాలు బయల్పడ్డాయి. శక్తిమంతులైన తిరుగుబాటుదార్లు, పంచమాంగదళాలవారు కలిసి స్టాలిన్ పరిపాలనను కూలద్రోసేందుకు అటు ట్రాట్స్కీతోనేకాక, ఇటు నాజీలతోను, జపాన్‌వారితోను కుట్రలు పన్నుతున్నారని తెలియవచ్చింది. సోవియట్ యూనియన్ వీలయినప్పుడల్లా జపాన్‌తో సంప్రతింపులు కొనసాగిస్తూవచ్చింది. బోలెడన్ని సరిహద్దు తగాదాలను సమరరంగంలో కాకుండా సమావేశాలద్వారా పరిష్కరించుకొనడానికి చూచింది. శాంతిసంధిని ఉల్లంఘించవలదని జపాన్ను కోరుతూవచ్చింది. కాని శాంతి, మరొకవంక ఈ సంప్రతింపుల విధానాలకు భిన్నంగా సోవియట్‌ప్రభుత్వం ప్రతి రాజకీయ సమస్యవిషయంలోనూ ఒక గట్టిపట్టుదలపడుతూ బుకాయించడం మోసగించడంకూడా జరుగుతోంది.

ఈ లోగా కొమిన్‌టరన్ ఒక తీర్మానంచేసింది. అన్ని దేశాలలోని కమ్యూనిస్టు పార్టీలకూ ఒక విజ్ఞప్తిచేసింది. పార్టీ

వారు ప్రస్తుతానికి వర్గపోరాటం రద్దుచేయాలనీ, వెంటనేఫాసిస్ట్ వ్యతిరేకపు "యునైటెడ్ ఫ్రంటు"ను ఒకదాన్ని ఏర్పాటు చేయాలనీ చెప్పింది. 1936 చివరకాలంలో సోవియట్ ప్రభుత్వం బయటినుంచి ఉధృతంగా వస్తున్న బెదరింపులకు తట్టుకోడానికి, సైనిక సన్నాహాల విషయంలోను, సాయుధ బలాలను అభివృద్ధి పరచడంలోను మరింత శ్రద్ధవహించింది. ఏమైనా జపాన్ దాడులను ఎదుర్కోడంలో సోవియట్ విధానం యొక్క వాస్తవరూపం వెలుపలి మంగోలియాలోను, లింకియాంగ్‌లోను సైనికులను ప్రవేశపెట్టడంద్వారా తనంతట తానే బయటపడింది. ఇందులో గల ప్రధానోద్దేశం జపాన్ వారి దండయాత్రను అరికట్టడమేలాగ కనుపించింది. పరస్పర సహాయం అపేక్షిస్తూ మంగోల్-సోవియట్ ఒడంబడిక ఒక దానిపై, మంగోల్ ప్రజా తంత్ర రిపబ్లికు ముఖ్య పట్టణమైన ఉలన్‌బాటర్‌లో సంతకాలు జరిగాయి. అందులో ఉన్న నిబంధనలు ముఖ్యంగా ఇవి: "సైనిక క్లేశాల సందర్భంలో పరస్పర సలహాలు సహకారాలు. మూడోదేశం వారెవరైనా దాడి సలిపినప్పుడు పరస్పర సహాయం, సైనిక సహాయంకూడా. అత్యవసర పరిస్థితి తొలగిన వెంటనే వారి రాజ్యంలో ఉన్న సైనిక బలాలను వీరు, వీరి రాజ్యంలోవున్న సైనికబలాలను వారు ఉపసంహరించుకోడం" ఇందుకు చైనాప్రభుత్వం తన తీవ్ర అభ్యంతరాన్ని తెలిపింది. 1924 లో జరిగిన పెకింగ్ ఒడంబడిక ఆధారంగా ఇది అక్రమమని సూచించింది. ఈ మంగోల్-సోవియట్ ఒడంబడిక, ఆ వెనుకటి ఒడంబడికను చైనాప్రభుత్వంను ఉల్లంఘించడమే అవుతుందనీ, దీనికి

తాను బద్ధురాలను కానని చైనా ప్రభుత్వం మరీ మరీ నొక్కి చెప్పింది. ఆవిధంగా వెలుపలి మంగోలియాలో సోవియట్ పురోగమనం, దూర ప్రాచ్యంలో మూడు ప్రధాన రాజ్యాల మధ్యగల సంబంధాలు బిర్ర బిగిసి పోయేటట్లు చేసింది. అంతే కాదు. జపాన్‌కు అడ్డులేకుండా పోయింది. జపాన్ రాజ్యం విస్తరిస్తూ వచ్చింది.

చైనా టర్కిస్తాన్ అని పిలువబడే సికియాంగు, రాజకీయ ప్రాధాన్యంరీత్యా చైనాకు అత్యంతముఖ్యమైంది. మంగోలియాలాగానే అదికూడా మధ్యఆసియానుంచి చైనాకు వచ్చే "బార్బారియన్ల"కు ఒక సింహద్వారం. చైనా జాతీయరక్షణకు కీలకంకూడా. 1924లో చైనా సోవియట్ పరిష్కారం జరిగిన తరువాత సోవియట్ ప్రభుత్వానికి సింకియాంగు అంటే ఆసక్తి హెచ్చింది. రాష్ట్ర పశ్చిమసరిహద్దును ఆనుకుని ఒక రైల్వేలైను నిర్మించింది. ఈ రైల్వేలైను నిర్మించడంవల్ల సింకియాంగు ఆర్థికంగాను, తదితరంగాను రష్యా ఆకర్షణకు లోనవుతూ, చైనాకు దూరమవుతూ వచ్చింది. ఆ రాష్ట్రంలో సోవియట్ ప్రభావం వ్యాపించి మిన్నుముట్టింది. రాష్ట్రంలో బ్రహ్మాండమైన ఆర్థిక పునర్నిర్మాణ కార్యక్రమం ప్రవేశపెట్టబడింది. సోవియట్ ప్రభుత్వం ఈ కార్యక్రమంలో నూనె బావులు త్రవ్వడం, నూనె పరిశుద్ధంచేయడం, నీటిపారుదల, రోడ్ల నిర్మాణం, పశుపోషణ, స్కూళ్ళు, ఆస్పత్రుల నిర్మాణము; ఇలాంటి వివిధ కార్యాలకు సాంకేతిక సహాయం విస్తృతంగా ఏర్పాటుచేసింది. రాష్ట్రానికి చెందిన సైన్యం, పోలీసు

దళం, విమానదళం—వీటన్నింటిలోనూ సోవియట్ సలహాదార్లే ప్రాముఖ్యం వహించిఉన్నారు. రాష్ట్ర సైనికపరిషత్ లో సోవియట్ అధ్యాపకులే ఉద్యోగాలు చేస్తున్నారు. వీటన్నిటని బట్టి చూస్తే కాలక్రమేణ సింకియాంగురాష్ట్రం మరొక సోవియట్‌గా మారిపోయేటట్లు కనిపించింది. అంతే అక్కడ అంతరంగిక అభివృద్ధులు, ఆర్థిక, సైనిక, సాంస్కృతిక రంగాలు—అన్నీ సోవియట్ల ధోరణిలోనే వికాసం చెందుతూ వచ్చాయి.

## సియాన్ సంఘటన :

వరుసగా కారణాలను, పర్యవసానాలను వివరిస్తూపూర్తి రుజువు ఇవ్వడం కష్టమైనప్పటికీ, సియాన్ సంఘటనవల్ల ఒకటి మాత్రం జరిగిందనడంలో సందేహంలేదు. ఆ సంఘటనవలన జపాను సమరరథం చైనావంకకు మరలింది. ఆ విధంగా రష్యా ఆందోళన ఉపశమించింది.

ఈ సంఘటన జరిగేటప్పటికి, అనగా 1936 ఆఖరునాటికి చైనా కమ్యూనిస్టులు జపానును ఎదిరించడంకోసం, అంతర్యుద్ధాన్ని ఆపడంకోసం ఒక యునైటెడ్ ఫ్రంటును ఏర్పాటు చేయాలని అప్పటికి సంవత్సరంపైగా ఆందోళనచేస్తూ వచ్చారు. యునైటెడ్ ఫ్రంటువిధానం అధికారపూర్వకమైన దేనని కొమిన్టరన్ 1935 ఆగస్టులో ప్రకటించింది.

నాన్‌కింగ్ ప్రభుత్వానికి అసలు నాయకుడుగా ఉన్న చాంగ్‌కై షేక్, బయటిపోరాటాన్ని ఎదుర్కోడానికి పూర్వం, ముందు చైనా కమ్యూనిస్టులను నిర్మూలించాలని నిశ్చయించాడు. ఆయన విజయం పొందడానికి అన్నిలక్షణాలూ ఉన్న

తరుణంలో, 1936 డిసెంబరు 12న, జర్మనీ జపానులు కోమిన్ టరన్‌కు ప్రతికూలంగా ఒడంబడిక పూర్తిచేసుకున్న తరువాత సరిగ్గా రెండువారాలకు, ఆయనను బంధించి వ్యక్తిగతమైన స్వాతంత్ర్యం లేకుండాచేశారు. ఇందుకు కారకుడు ఆయన కొడుకు 'యువకసేనాని' అని పిలువబడే జనరల్ చాంగ్ హో ష్లియాంగ్. చైనా కమ్యూనిస్టులపై పశ్చిమోత్తర దండయాత్ర సాగించేపని అతగాడికి అప్పగించారు. అతను కమ్యూనిస్టులను హతమార్చడానికి మారుగా వాళ్ళతో లాలూచీ అయ్యాడు. తనపై అధికారిని తనఖైదీగా చేసుకుని ఈ యువకసేనాని, జపానుకు ప్రతికూలంగా ఒక యునైటెడ్ ఫ్రంట్ నిర్మించాలని కోరాడు. కమ్యూనిస్టులపై పోరాటం ఆపవలసిందనీ, సాధారణ విముక్తికోసం బాధ్యత పంచుకోడానికి అన్ని పార్టీలవారిని, అన్ని జట్లవారిని చేర్చుకునేందుకు అంగీకరించవలసిందనీ చాంగ్‌ను బలవంతపెట్టాడు.

జపాన్ విదేశాంగ మంత్రి అరిటా "జపాన్ప్రభుత్వం సియాన్‌వివాదం విషయంలో జపాన్‌కి వ్యతిరేకంగా చేసుకొనే రాజీని అంగీకరించదుసరికదా ప్రతిఘటిస్తుంది." అని ప్రకటించాడు. పరిస్థితి మరింత క్లిష్టతరం ఎందుకయిందీ అంటే, సోవియట్ యూనియన్ గూఢచారులచేతనే ఈ కుట్రంతా నడుపబడిందని జపాన్ గట్టిగా నమ్మడంవల్ల. ఈ యువకసేనానికీ మాస్కో ప్రభుత్వానికీ మధ్య, గడిచిన ఆరుమాసాలబట్టీ సంప్రతింపులు సాగుతూ ఉండడం తామెరిగిందేనని జపాన్ క్వాన్ టంగ్ సైన్యం ఆరోపణచేసింది. ఇక ఈ ఆరోపణలకు తాళలేక నాన్‌కింగ్‌లో ఉన్న సోవియట్ విదేశ వ్యవహారాల ఏజంటు,

ఐ. స్పిల్వనెకె - డిసెంబరు 20 న చైనా విదేశాంగమంత్రిని సందర్శించి, 1931 సెప్టెంబరు 18 న ముక్డెన్ సంఘటన జరిగి నప్పటినుంచీకూడా, సోవియట్ ప్రభుత్వం ఆ 'యువక సేనాని'తో సంబంధాలు తెంపుకున్నదని నిశ్చయంగా చెప్పాడు. ఎడ్గార్ స్నో వ్రాసినదాన్ని బట్టి, ఛీఫ్ కమాండర్ చాంగ్‌ను వేగిరం విడుదల చేసేవిషయంలో మాస్కో జోక్యం తప్పకుండా ఉన్న దని తేలుతోంది.

కొన్ని ఏండ్లు గడిచినపిమ్మట జనరల్ హార్లేతో మాస్కోలో సంభాషిస్తూ మాలటోవ్ "సోవియట్ ప్రభుత్వంయొక్క రాజ కీయ, నైతిక సహకారంవల్లనే చాంగ్ తిరిగీ తనప్రభుత్వంలో స్థానం పొందగలిగాడు, విప్లవనాయకుడు (చాంగ్ హూయ్ లియాంగ్) అరెస్టుకావించబడ్డాడు" అని ఒప్పుకున్నాడు.

సియాన్ సంఘటనయొక్క అసాధారణ వైఖరీ, సోవి యట్ యూనియన్, అందులో ఉన్న చైనా కమ్యూనిస్టుల పోకడలలోని అంతరార్థం, జపాన్‌కు ప్రతికూలంగా యునైటెడ్ ఫ్రంటు స్థాపించాలనే తీవ్ర ఆకాంక్ష; ఇవన్నీ ఏకమై జపానుకు క్రోధం, అనుమానం రేకెత్తించాయి. ఈ సంఘటన జరగకుండా ఉన్నట్లయితే జపాను బహుశా సోవియట్ యూనియన్‌పై దాడి సలిపే అవకాశం ఉండిఉండేది. అలాంటిది ఇప్పుడు ఈ కారణాలన్నీ కలిసి సంపూర్ణమైనశక్తితో జపాన్, తీవ్రంగా చైనాపై దాడిచేయడానికి అవకాశం కల్పించాయి.



# 3

# రెండవ ప్రపంచ సంగ్రామంలో చైనా రష్యాలు

## జపాన్‌కు వ్యతిరేకంగా చైనా రష్యా మద్దతు

ఈ దుష్టమైన చిక్కులన్నిటితోపాటు, సియాన్ సంఘటన ఒక ముఖ్యమైన విషయాన్ని ధృవపరిచింది. చాంగ్ కై షేక్‌కు చైనా ప్రజల మద్దతు లభించింది. 1936 ఆఖరయ్యే సరికి చైనా నిజమైన ఐకమత్యాన్ని ఘనంగా సాధించ కలిగింది. చైనా బలం ఏకత దిన దినాభివృద్ధి అవుతున్నాయని తెలిసికూడా జపాన్ తన చైనా విధానాన్ని పునః కొనసాగించడానికి ప్లాను కున్నది. 1937 ఫిబ్రవరిలో జపాన్ నూతన ప్రభుత్వం చైనా ప్రభుత్వంతో సంప్రతింపులు సమాన ప్రతిపత్తి కొనసాగుతాయని ప్రకటించింది. జపాన్ యెడల చైనా విధానం ఇలా సాపేక్షిక స్నేహ భావంలోకి, సమాధాన పద్ధతితో మళ్ళుతుండగా, అక్కడ చైనా కమ్యూనిస్టులు జపాన్ దండయాత్రకు ప్రతికూలంగా ఏకత సాధించే కృషికి తీవ్రఆందోళన సాగించారు. చైనాకమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ నాన్‌కింగులో ఉన్న కొమిన్‌టాంగ్‌కు ఒక తంతివార్త పంపింది. అందులో ఇలా షరతులుపెట్టింది: 1.సైన్యాభివృద్ధికోసం నడిపే కార్యక్రమాలు ఆపివేయాలి. 2.ఎర్రసైన్యాన్ని జాతీయవిప్లవసైన్యంగా గుర్తించి నేరుగా కేంద్రప్రభుత్వం నాయకత్వంక్రింద అది ఉండేటట్లు

చెయ్యాలి. 3. భూస్వాముల భూములపై హక్కు వసూలుచేసే విధానాన్ని అంతమొందించి, జపానుకు ప్రతికూలంగా యునైటెడ్ ఫ్రంటును స్థాపించడంకోసం ఒకే కార్యక్రమాన్ని పట్టిన పట్టు విడువకుండా నిర్వహించాలి. ఇంకా ఇలా కోరిందికూడా: 1. వాక్స్వాతంత్ర్యం, సభాస్వాతంత్ర్యం మొదలయినవి, 2. అంతర్యుద్ధాలను నిలుపుచేయుట. 3. తక్షణం జపాన్ తాకిడికి తట్టుకోడానికి సమరసన్నాహాలు కావించుట. ఫిబ్రవరిఆంతంలో కొమింటాంగ్ కేంద్ర కార్యనిర్వాహకవర్గం "ఎర్రసైన్యానికి లొంగుబాటు"ను అంగీకరించడానికి నిర్ణయించింది. వాస్తవంగా చూస్తే, కమ్యూనిస్టులు తమషరతులు అమలు జరుపుతారా అన్న సందేహానికి కావలసినంత అవకాశం కనిపించింది.

కమ్యూనిస్టులు సాగిస్తున్న ఆందోళన జపానువిధానం పట్ల ఏదైనా ప్రధానమైన ఫలితాన్ని కలిగించిందా అంటే, దాన్ని చూపడంకష్టం. జపాను చైనాయెడల అనుసరిస్తున్న స్నేహవిధానం ఎంతోకాలం కొనసాగలేదు. 1937 ఏప్రిల్ నెలలో జపానులో సాధారణ ఎన్నికలుజరగడంతో, కొనోరా కుమారుడు ప్రధానమంత్రిపదవిని చేపట్టాడు. కొత్తప్రభుత్వం త్వరలోనే తన సైనికతత్వాన్ని, సమరంసాగించే స్వభావాన్ని తేటతెల్లంచేసింది. జపాను సమరంకోసం పొదుపుసన్నాహాలను సాగించడం మొదలుపెట్టింది. చైనాపట్ల, సోవియట్ యూనియన్‌పట్ల విడువకుండా కలహానికి కాలు దువ్వుతూవచ్చింది.

సోవియట్ సైనికశక్తి దేశంలో వచ్చిన తీవ్రసంచలనం బలహీనమైపోయిందనే నమ్మకంచేత, మంచూరియాను సోవి

యట్ బెదిరించడం ఇక అయిపోయిందనే నిశ్చింతవల్ల, జపాను చైనాపైన కలహానికి కాలుదువ్వే చర్యలను మరింత ఎక్కువ చేసింది. 1937 జులై 7-8 తారీకుల్లో అర్ధరాత్రివేళ జపాను బలాలు, చైనాదళాలను పీపింగ్ వెలుపలఉన్న లుకోషియో మార్కోపోలో వంతెనకడ ఎదిరించాయి. ఆవిధంగా వైరాలు ప్రారంభమై తరువాత ఎంతో ఉధృతంగా కొనసాగాయి. తన శాంతియత్నాలన్నీ భగ్నమై, తన సహనాన్ని యావత్తూ కోల్పోయి చైనా జపానుతో తుదివరకూ పోరాటం సాగించడానికి నిశ్చయించుకున్నది.

ఇక ఇప్పుడు చైనా జపానులమధ్య వైరం మొదలు కావడంతో, సోవియట్ ప్రభుత్వం జపాన్ దాడిని చైనా ఎల్లల లోపలనే ఉండేటట్లు అదుపులో పెట్టడానికి జాగ్రత్తీసుకున్నది. ఇతరవిషయాల్లో జపానుతో సంఘర్షణరాకుండా జాగ్రత్తలు తీసుకుంటూ సోవియట్ ప్రభుత్వం, 1937 ఆగస్టు 21 నాడు చైనాప్రభుత్వంతో యుద్ధవిరమణ సంధిపైన సంతకాలుచేసింది. ఆ ఒడంబడికలో ముఖ్యాపేర్పాటు ఇది: "ఒడంబడిక కుదుర్చుకున్న ఇరుపక్షాలలో ఏ ఒక్కరిపైనా మూడవపక్షంవారుకనుక దాడిసలిపేయెడల, రెండవపక్షంవారు ఆ పోరాటంలో ఎప్పుడైనాసరే ప్రతికక్షులకు ఏ రకమైన సహాయం చేయడానికి ప్రత్యక్షంగాగాని, పరోక్షంగాగాని పూనుకోరాదు. అంతే కాకుండా, దాడికి గురిఅయిన పక్షంవారికి అన్యాయం, అపకారం జరిగేటటువంటి ఎలాంటి ఒడంబడికలను ప్రతికక్షితో గాని ప్రతికక్షులతోగాని చేసుకోకుండా ఉండాలి. ఎట్టి చర్యలకూ పూనుకోరాదు కూడా."

చైనా-జపాను వైరంలో మొదటినుంచీకూడా సోవియట్ యూనియను చైనాపట్ల సానుభూతి కనపరుస్తూవచ్చింది. సత్వరం చైనా ప్రభుత్వానికి, చైనా ప్రజలకు, నైతికంగా మద్దతు ఇస్తూవచ్చింది. జపాను చైనా రాజ్యంపై దాడిచేసి దాన్ని ఆక్రమించుకో చూడడం "నవరాజ్యసంధి"ని జపాను ప్రత్యక్షంగా ఉల్లంఘించినట్లయింది. ఆ సంధిపై సంతకాలు పెట్టినవారు చైనా ప్రభుత్వంయొక్క న్యాయబుద్ధిని, రాజకీయ స్వాతంత్ర్యాన్ని మన్నించవలసి ఉంటుంది. అంచేత బెల్జియంప్రభుత్వం బాధ్యత తీసుకుని సంధిపై సంతకాలు చేసినవారిని, చైనా-జపాను సంఘర్షణ సమస్యను చర్చించేటందుకు బ్రుస్సెల్సులో సమావేశం కావడానికి ఆహ్వానించింది. జర్మనీ ఈ ఆహ్వానాన్ని త్రోసిపుచ్చింది. రష్యా అంగీకరించి వెళ్ళింది. చైనా అభిప్రాయాన్ని ముందుపెట్టి, చైనాపక్షంవహించి బలంగా పనిచేసింది. ఈలోగా సెప్టెంబరు12న చైనాప్రభుత్వం ఈ విధానాన్ని నానా రాజ్యసమితివారికి నివేదించుకున్నది. చైనాలో ప్రస్తుతం ఉన్న పరిస్థితికి ఏం సలహాఇస్తారో చెప్పమని కోరింది. ఏమైనా సమితిసభవారు ఈవిషయంలో ఏమీ చర్యతీసుకోలేదు. నానా రాజ్యసమితిలో సోవియట్ ప్రతినిధిగా వెళ్ళిన మిక్జిమ్‌లిట్వినోవ్ చైనాతరఫున తీవ్రంగా తరచు వాదించాడు. చైనాకు నైతికంగానేకాక, భౌతికంగాకూడా తోడ్పడాలని నొక్కిచెప్పాడు. అంతేకాదు. సమితిలోఉన్న ఇతరసభ్యులను వారు జపాను దాడిని ఒకదాడిగా గుర్తించడమేలేదని విమర్శించాడుకూడా.

1937 చివరభాగంలో కలహం ఒక్క దూరప్రాచ్యంలోనేకాక, ఐరోపాలోకూడా తలఎత్తింది. సోవియట్ యూని

యను రక్షణకు అటూ, ఇటూ రెండువిధాలా ప్రత్యక్షంగానో లేక పరోక్షంగానో దెబ్బతగిలింది. అంచేత లిట్వినోవ్, తక్కిన సోవియట్ ఉద్యోగులు కలహంకూడదని చెపుతూ, సమిష్టి రక్షణ అవసరమని బోధిస్తూ, ఇందుకు ఒక్క జపానుసేకాక, జర్మనీ,ఇటలీలనుకూడా నిందించారు. ఒక్క చైనా హక్కులే కాక, సోవియట్ యూనియను హక్కులు, అభిరుచులుకూడా ఇందులో ఇమిడిఉన్నాయని స్పష్టపరిచారు.

1938 మార్చిలో నాజీ జర్మనీ ఆస్ట్రియాను కలుపు కున్నది. ఏండ్లతరబడి నాజీ బెదరింపులకు గురి అవుతూవస్తున్న సోవియట్ యూనియన్‌కు జర్మనీకి ప్రాణమిత్రమైన జపాన్‌ను బలహీనపరిచి దాన్ని సోవియట్ యూనియన్‌కు ఆవల చిక్కుల్లోపడేసి ఊపిరి సలపకుండా చేయడం ఎంతో అవసరంగా కను పించింది. అసలు ప్రధానమైన విషయం ఏమంటే, ఇలా జపాన్ బలహీనమయి, వేరే చిక్కులలో తగులుకున్నట్లయితే, సోవి యట్ దూరప్రాచ్యంలో జపాన్ దండయాత్రచేయలేక పోవ డమేకాక, ఐరోపాలో నాజీ జర్మనీ పన్నుగడలను కూడా జపాన్ ప్రోత్సహించజాలదు. కనుక ఈ కపటోపాయం ఏమ నగా చైనా సైనికశక్తిని అభివృద్ధిపరిచి అది జపాన్‌తో పోరాటం కొనసాగించేటట్లు చేయడం. అంచాత 1938 వ సం॥ లో చైనాకు సోవియట్ భారీ ఎత్తున తన వస్తుసామగ్రులు సహాయం చేయడం మొదలుపెట్టింది.

సెప్టెంబరులో నాజీ జర్మనీ జెకోస్లొవాకియాకు చెందిన సడతెన్‌లాండ్ కోసం అల్లాడిపోయింది. అక్టోబరు 1 న నాజీ కోర్కెను అనుమతిస్తూ అప్రతిష్ఠకరమైన మ్యూనిజ్ ఒడంబడి

కపై బ్రిటను, ఫ్రాన్సులు సంతకాలు చేశాయి. ఈ ఒడంబడిక జరిగిన తరువాత కొన్ని నెలలు అంతర్జాతీయ సంబంధాలలో ఒక మహోత్పాతకరమైన కాలంగా పరిణమించాయి. సమరం వాకిలి ముంగిట ఉన్నట్లు కనిపించింది. ఏ దేశంతోనైనా సమరం లేకుండా చెయ్యాలనో లేక వాయిదా వెయ్యాలనో ఆతుర్దాతో రష్యా ఒక దృఢమైన రాజకీయ రంగాన్ని ఏర్పాటుచేసి, ముఖ్యంగా జపాన్‌కు తన బలహీనత ఏమాత్రం కనపడకుండా చేసుకున్నది. 1939 లో ఐరోపాలో పరిస్థితి, సోవియట్ దృష్టిలో ఎంతో దారుణంగా, ఉపేక్షించరానిదిగా ఉన్నది. హిట్లర్, ముసోలినీలకు మిత్రుడైన జనరల్ ఫ్రాంకో స్పెయిన్ అంతటిపైనా సర్వాధికారాన్ని చేపట్టాడు. నాజీ దళాలు జెకొస్లో వేకియాను ఆక్రమించుకున్నాయి. శేషించిన స్లావకియాను జాస్యా నికి లోనుకావించాయి. ఆ సమయంలో సోవియట్ ప్రభుత్వం పశ్చిమంనుంచి వస్తున్న దాడికంటె, తూర్పునుంచి వస్తున్న దాడితో ఎక్కువగా సతమతమవుతున్నది. అందుకు జపాన్‌తో స్వేచ్ఛగా, ధారాళంగా వ్యవహరించడానికిగాను జర్మనీతో సమాధాన పడడానికి ప్రయత్నిస్తోంది. ఈ విధంగా సోవియట్ ప్రభుత్వం ఒకరకమైన ద్వంద్వక్రీడ సాగిస్తూ వచ్చింది. అటు బ్రిటను, ఫ్రాన్సులతో బాహాటంగా సంప్రతింపులు సాగిస్తూ, అదేసమయంలో ఇటు నాజీ జర్మనీతో రహస్యంగా మంత నాలుచేస్తూ, ఇరుపక్షాలవారితో ఆట ఆడుతూవచ్చింది. మొలొ టోవ్ విదేశాంగ మంత్రి అయిన కొద్ది రోజులతరువాత, జపాను మరొకమారు రష్యాతో బలాబలాలు పరీక్షించుకొన డానికి ప్రయత్నించింది. మే 11 న వెలుపలిమంగోలియా సరి

కమ్యూనిజానికీ నాజిజానికీ జరిగిన ఈ వివాహం—ప్రేమించి కాక ఇతరత్రా అవసరమయి చేసుకున్న ఈపెళ్ళి ప్రాచ్యదేశా లలో మళ్ళీ కొత్తమార్పులకు కారణమయింది. సెప్టెంబరు 15 న జపానుకు రష్యాతో నిరాక్రమణసంధి ఒకటి చేసుకోవల సిన అగత్యం కనిపించింది. ఇలా రాజ్యతంత్రంలో దెబ్బకొట్టి రష్యా తనమటుకుతాను ఇటు తూర్పునుంచి అటు పశ్చిమం నుంచి వచ్చే ఒత్తిడినుంచి తప్పించుకొని బయటపడింది ఐరోపాలో నాజీ—సోవియట్ ఒడంబడికపైన సంతకాలయిన వారంరోజు లకు, నాజీదళాలు పోలెండుపై దాడిచేశాయి. ఇది గ్రేట్ బ్రిట నును, ఫ్రాన్సును సెప్టెంబరు 3న జర్మనీపై యుద్ధం ప్రకటించే టట్లు ప్రేరేపించింది. సోవియట్‌రష్యా తాను తటస్థంగా ఉంటా నని ప్రకటించింది. ఏమైనప్పటికీ సెప్టెంబరు 17న పోలెండు నాజీ అల్లరిమూకతో పశ్చిమాన ప్రాణాలకు తెగించి పోరాడు తున్నప్పుడు, రష్యను సేనలు తూర్పునుంచి పోలెండులో ప్రవేశించాయి.

కమ్యూనిజానికీ నాజిజానికీ పొత్తుకుదిరిన కొద్దికాలానికే చైనా యునైటెడ్ ఫ్రంటులో చీలిక మరింత అగాధమై, విస్తృతమైంది. ఈ కమ్యూనిస్టులను - మరోవిధంగా 'కమ్యూ నాజిజమ్' అని పిలువబడే వీరినిచూచి కలవరపడి చైనా కమ్యూ నిస్టులు ఈ యుద్ధాన్ని సామ్రాజ్యయుద్ధమని పిలువడం మొదలు పెట్టారు. తరువాత వారు 'జాతీయప్రభుత్వానికి మద్దతు ఇస్తాం, సమష్టిగా జపాన్ను ఎదుర్కొంటాం' అని మొదట అనుకున్న ఖరారును ఇప్పుడు ఖాతరు చెయ్యకుండా ఊరుకున్నారు. అయితే వారు జపాను తాకిడిని ఆపడం మానుకోలేదు. ముఖ్యంగా

హద్దులో ఉన్న నోమన్‌హాన్‌వద్ద రష్యా జపానులకు సాయుధ సంఘర్షణ మొదలయింది అది క్రమక్రమంగా పెద్ద ఎత్తున వైరాల్లోకి పాకింది.

ఈలోగా తనమటుకుతాను ప్రత్యక్షంగా జపానుతో యుద్ధానికి దిగిఉండే సోవియట్ యూనియను, తన మామూలు ప్రకారం చైనాకు సహాయం కొనసాగిస్తూ వచ్చింది. మాలటోవ్ జపానుకు ప్రతికూలంగా సోవియట్ రష్యా చైనాకు సహాయం చేస్తున్నట్లు మళ్ళీ ఒకమాటు ధృవపరిచాడు. అందుకు ఈ క్రింది ప్రకటన చేశాడు: "దాడికి గురిఅవుతున్న రాజ్యాల వారికి మద్దతు ఇస్తామని స్టాలినుచేసిన ప్రకటన మీకు బాగా తెలిసేఉన్నది...ఇది చైనాకు పూర్తిగా వర్తిస్తుంది...ఈ విధానాన్ని మేము విడువకుండా ఆచరణలో పెడుతున్నాం. జులై 16 న చైనా సోవియట్ యూనియన్ల మధ్య ఒక వాణిజ్య సంధిజరిగింది. దాని ప్రకారం చైనాకు ఆయుధాలు, యుద్ధపరికరాలు సప్లయిచేయడానికి సోవియట్ సమ్మతించింది" అప్పటి సోవియట్ యూనియన్ చైనాకు 20కోట్ల అమెరికను డాలర్లు అప్పు పెట్టినట్లు తేలింది.

నోమన్‌హాన్‌వద్ద తీవ్రంగా సాగుతున్న రష్యా జపాను సాయుధపోరాటం, రెండుముఖాల పోరాటాన్ని తొలగించుకునేందుకుగాను సోవియట్ యూనియనును జర్మనీతో సమాధానానికి వచ్చేటట్లు చేసిఉండవచ్చు. 1939 అగస్టు 23న నాజీ-సోవియట్ నిరాక్రమణసంధి ఒకటి మాస్కోలో జరిగింది. సోవియట్ విదేశాంగమంత్రి మాలటోవ్, నాజీ విదేశాంగ మంత్రి రిబ్బన్‌ట్రాప్‌లు ఒడంబడికపై సంతకాలు చేశారు.

కమ్యూనిజానికీ నాజిజానికీ జరిగిన ఈ వివాహం—ప్రేమించి కాక ఇతరత్రా అవసరమయి చేసుకున్న ఈ పెళ్ళి ప్రాచ్య దేశాలలో మళ్ళీ కొత్త మార్పులకు కారణమయింది. సెప్టెంబరు 15 న జపానుకు రష్యాతో నిరాక్రమణసంధి ఒకటి చేసుకోవలసిన అగత్యం కనిపించింది. ఇలా రాజ్యతంత్రంలో దెబ్బకొట్టి రష్యా తనపటుకుతాను ఇటు తూర్పునుంచి అటు పశ్చిమం నుంచి వచ్చే ఒత్తిడినుంచి తక్షణం బయటపడింది. ఐరోపాలో నాజీ–సోవియట్ ఒడంబడికపైన సంతకాలయిన వారం రోజులకు, నాజీదళాలు పోలెండుపై దాడిచేశాయి. ఇది గ్రేట్ బ్రిటనును, ఫ్రాన్సును సెప్టెంబరు 3న జర్మనీపై యుద్ధం ప్రకటించేటట్లు ప్రేరేపించింది. సోవియట్ రష్యా తాను తటస్థంగా ఉంటానని ప్రకటించింది. ఏమైనప్పటికీ సెప్టెంబరు 17న పోలెండు నాజీ అల్లరిమూకతో పశ్చిమాన ప్రాణాలకు తెగించి పోరాడుతున్నప్పుడు, రష్యను సేనలు తూర్పునుంచి పోలెండులో ప్రవేశించాయి.

కమ్యూనిజానికీ నాజిజానికీ పొత్తుకుదిరిన కొద్దికాలానికే చైనా యునైటెడ్ ఫ్రంటులో చీలిక మరింత అగాధమై, విస్తృతమైంది. ఈ కమ్యూనిస్టులను మరోవిధంగా 'కమ్యూనాజిజమ్' అని పిలువబడే వీరినిచూచి కలవరపడి చైనా కమ్యూనిస్టులు ఈ యుద్ధాన్ని సామ్రాజ్యయుద్ధమని పిలువడం మొదలుపెట్టారు. తరువాత వారు 'జాతీయప్రభుత్వానికి మద్దతు ఇస్తాం, సమష్టిగా జపాన్ను ఎదుర్కొంటాం' అని మొదట అనుకున్న ఖరారును ఇప్పుడు ఖాతరుచెయ్యకుండా ఊరుకున్నారు. అయితే వారు జపాను తాకిడిని ఆపడం మానుకోలేదు. ముఖ్యంగా

తమ ఆధిపత్యాధికారాన్ని విస్తృతం చేసుకోడంకోసమే ఆ పని చేస్తూ వచ్చారు. వారు 'పెన్-కాన్-నింగ్ (పెన్సీ-కాన్సూ-నింగ్ గూ) సరిహద్దురాష్ట్రం' అనే ఒకదాన్ని సృష్టించారు. అక్కడ స్వంతచట్టాలు, స్వంత కరెన్సీనోట్లు, స్వంత పన్నుల పద్ధతి-ఇవన్నీ ఏర్పాటుచేసి దాన్ని ఒక స్వతంత్రరాజ్యంలాగా పరిపాలిస్తున్నారు. వారు తమ సైనికబలాలనుకూడా వృద్ధిచేసుకున్నారు. అసలు తమకు ప్రభుత్వం అప్పగించిన పరగణా దాటి తమ బలాలను విస్తరింపచేశారు.

1939 నవంబరు 30 న లెనిన్‌గ్రాడ్ దగ్గర రష్యన్ సరిహద్దు రక్షణలను బలపరుచుకుంటున్నామనే మిషతో సోవియట్ దళాలు ఫిన్‌లాండ్‌లోకి పురోగమించాయి. డిసెంబరు 14 న నానారాజ్యసమితిసభ సోవియట్ యూనియన్ను దోషిగా నిర్ధరిస్తూ దాన్ని బహిష్కరించాలని ఓటుచేసింది, చైనా ప్రతినిధి ఓటు చెయ్యకుండా మానుకున్నాడు.

ఈ అభినయం అప్పుడు చైనా రష్యాల మధ్య ఉన్న స్నేహసంబంధాలపై దెబ్బకొట్టింది. ఫిన్‌లాండ్ ప్రజల ధైర్య సాహసాలులేని చైనీయులు బ్రహ్మాండమైన రష్యను ఘటాలను ఎల్లకాలం వ్యతిరేకించలేక పోయారు. 1940 మార్చి 12 న రష్యా ప్రతిపాదించిన షరతులకు అనుగుణ్యంగా సంధికి ఒప్పుకున్నారు.

తరువాత కొద్దికాలనికే నాజీ బలాలు డెన్మార్కు, నార్వే, బెల్జియం, నెదర్లాండ్సు, ఫ్రాన్సులపై దండయాత్ర చేశాయి. ఇలా అనేక దేశాలు నాజీ కెరటాలక్రింద మునిగి

పోవడం ప్రపంచ పదవీ రాజకీయాలలో దారుణమైన పర్యవసానాలను తెచ్చిపెట్టింది. రష్యా జర్మనీతో నిరాక్రమణ సంధి చేసుకున్నప్పటికీ, ఏదో విధంగా సందేహాలు కలిగించకుండా ఉండలేదు. రష్యా తన సరిహద్దులను కాపాడుకునేందుకు ఇంకా దండయాత్రలు సాగించింది. సోవియట్ దళాలు లాట్వియా, ఎస్టోనియాలపైకి వెళ్ళాయి.

దూరప్రాచ్యంలో సమతుల్య విధానం దారుణంగా తల్లక్రిందులయింది. బ్రిటను, ఫ్రాన్సు, నెదర్లాండ్సు తమ వలస రాజ్యాలను సంరక్షించుకోలేక పోయాయి. జపాన్ దక్షిణానికి పురోగమించాలనే ఉబలాటాన్ని ఆపుకోలేకపోయింది. అది సెప్టెంబరు 26 న జర్మనీతోను, ఇటలీతోను కొత్త ఒడంబడిక చేసుకున్నది ఐరోపా సంగ్రామంలోకాని లేక చైనా-జపాను పోరాటంలోకాని ఇప్పుడు పాల్గొనని మరేరాజ్యమైనా తమపై దాడిసలిపేయడల పరస్పరసహాయంచేసుకోవాలనీ ఆ ఒడంబడిక సారాంశం, ఇందులో రష్యాను దాని వ్యవహారాల్లో దాని అభిప్రాయమేమిటో చెప్పకుండా, మినహాయించింది. దీని అర్థం ఈ ఒడంబడిక సంయుక్త రాష్ట్రాలకు వ్యతిరేకంగా ఆలోచించి జరుపబడిందని స్పష్టమైంది. ఆసమయాన పసిఫిక్ నైరుతిదిశలో, జపాన్ దక్షిణవైపున వ్యాప్తిని అరికట్టగలిగిన రాజ్యం ఒక్క సంయుక్త రాష్ట్రాలు మాత్రమే.

1940 సంవత్సరమంతా చైనా అంతులేని కష్టాలను ఎదుర్కొన్నది. మార్చిలో నాన్కింగ్‌లో వాంగ్‌చింగ్‌వీ కీలుబొమ్మ ప్రభుత్వం ఏర్పాటయింది. దానిద్వారా జపాన్ చైనా రాజకీయ అధికారానికి దెబ్బకొట్టాలనుకున్నది. జులై నెలలో

బ్రిటిష్ ప్రభుత్వం బర్మారోడ్డును మూసివేయమని ఉత్తర్వు చేసింది. ఆ కాలంలో చైనాకు సప్లయిలు అందే ప్రధాన మార్గం ఈ బర్మారోడ్డే. దీన్ని మూసివేయడంతో చైనాకు ఉన్న కష్టాలు చాలక క్రొత్త చిక్కులు, కష్టాలు వచ్చిపడ్డాయి. తుదకు చైనా కమ్యూనిస్టులు అంతర్జాతీయ శాంతికీ, ఐక మత్యానికి మరింత ఎక్కువ భంగం కలిగించేవారుగా తయారై నారు. తమ సైన్యాన్ని, తమ రాజ్యాన్ని విపరీతంగా విస్తరింప చేయ ప్రయత్నించారు. ఇలాచేయడంవల్ల కమ్యూనిస్టు బలాలు జాతీయ ప్రభుత్వంచే ఇతర మిలిటరీ కమాండర్లకు అప్పగించ బడిన యుద్ధపు పరగణాలలోకి దాటివెళ్ళడం జరిగింది. దాంతో సాయుధ సంఘర్షణలు మొదలైనాయి. విదేశ సమరంతో పాటు అంతర్యుద్ధం ఉధృతంగా ప్రారబ్ధమయింది.

జర్మనీ, జపాను, ఇటలీలమధ్య జరిగిన త్రైపాక్షిక సంధితో రష్యాను మినహాయించి నప్పటికీ, జపాను ఆ సంధికి బద్ధురాలై ఉండలేదు. రష్యాపై పోరుసాగించడం మానుకో లేదు. ఆవిధంగా సోవియట్ రష్యా ప్రపంచశక్తుల ఒత్తిడివలన చైనాకు సహాయంచేస్తూ జపానుకు వ్యతిరేకంగా చైనాను, ఒక దృఢమైన మధ్యస్థితరాజ్యంగా నిలబెట్టింది.

## జపాన్‌తో రష్యాసఖ్యం, చైనాను వదలివేయుట.

నాజీ–సోవియట్ ఒడంబడిక చివరకు ఎలా తయారయిం దంటే–రెండు బలీయమైన పక్షాలమధ్య యుద్ధం మొదలుకావ డానికి కొంత వ్యవధిఉండేటట్లుగాను, డీకొనడానికీ ఎదుర్కో డానికీ భయపడినటువంటి, అధర్మానికి జంకినటువంటి పరిసరపు

చిన్న చిన్న రాజ్యాలను లోబరుచుకుని తమ పక్షాన్ని బలీయుం చేసుకుని యుద్ధసన్నద్ధులు కావడానికిగాను కాలంగడిపేదిగాను తయారయింది. ఇలాంటి పరిస్థితిలో సోవియట్ రష్యా, నాజీ జర్మనీలు ఒడంబడికపై సంతకాలుచేసిన తక్షణం, అంతర్జాతీయ న్యాయాన్ని నీతిసూత్రాలను ఉల్లంఘిస్తూ ఒకరిని మించాలని ఒకరు పోటీపడి, వారివారి సరిహద్దులను సురక్షితం కావించు కుంటూ, బలహీనమైన రాజ్యాలను ఒకదాని తరువాత ఒక దాన్ని మధ్యస్థితరాజ్యాలుగా విలీనంచేసుకుంటూ ఉన్నారని చెప్పడం ఆశ్చర్యకరమైన విషయమేమీ కాదు. సోవియట్ ప్రభుత్వం జపానుకు వ్యతిరేకంగా యుద్ధంచేయడంకోసం ఒక వైపు చైనాకు సహాయం కొనసాగిస్తూ, తాను మరొకవైపు జపానుతో సంబంధాలను సరిచేసుకుంటూ ఉండడం ఎంతైనా అవసరమని భావించింది. ఒకప్రక్కన ఈశాన్యఆసియాలో తన విస్తరణను కొనసాగించడానికి తీవ్రంగా ఆలోచిస్తున్న జపాను, సోవియట్ ప్రభుత్వాన్ని సంతృప్తిపరచాలని లేకపోయినా, మరొకప్రక్కన వారి సంబంధాలకు ఏవిధమైన భంగంరాకుండా పరస్పర ప్రయోజనాలకు తోడ్పడేవిధంగా ఉండాలని కోరు తూంది. రష్యా జపానుల పొత్తు చైనా యుద్ధప్రయత్నాల ఫలితాలకు, ఆంతరంగిక విధానాలకు ప్రబల ప్రతిబంధకమైంది.

1940 జూన్‌లో తన బలాలు పారిస్ నగరాన్ని పట్టు కున్న తరువాత హిట్లర్ సంతోషం పట్టలేక పోయాడు. ఆనం దంతో నృత్యంచేశాడు. ఇప్పుడతనికి బ్రిటిష్ దీవులను జయిం చాలనే కోర్కె తీవ్రంగా పుట్టింది. 'మేం వస్తున్నాం?' అని బ్రిటిష్ వారికి హెచ్చరిక చేశాడతను. ఇది వట్టిదాడిమాత్రమే

ఆ౯డు. తరువాత త్వరలోనే నాజీ బాంబర్లు బ్రిటిష్ నగరా
లను ధ్వంసంచేశాయి. బ్రిటిష్ నగరాలలో మృత్యువు తాండ
వంచేసింది. ఏమైనా సంవత్సరం ఆఖరున హిట్లర్, బ్రిటిష్
విమానబలం పెద్దదని గుర్తించక తప్పిందికాదు. దాంతో
అతను తన ఆలోచనలు మార్చుకోవలసివచ్చింది. బహుశా
అప్పుడతను తూర్పుదిశకు మళ్లాలని నిర్ణయించుకుని ఉండవచ్చు.
ఈ నిర్ణయంలో ఉద్దేశం అతనికి మొదట్లో ఈ విజయ
యాత్రలో ఉన్న భావాలు, మీన్ కాంఫ్‌లో తను వేసుకున్న
పథకాలు మనస్సులో మెదలుతూ ఉండడమే.

1941 జనవరి 10 న నాజీ జర్మనీ సోవియట్ రష్యాలు
మైత్రి నెరపుతూ ఒక ఒడంబడికపైన, ఒక కొత్త వాణిజ్యసంధి
పైన సంతకాలు చేశాయి. ఈ నటనలన్నీ కూడా వాస్తవంగా,
తమవైరాన్ని కప్పిపుచ్చుకునేందుకు వేసిన మాయతెరలు తప్ప
మరేంకావు. బాల్కన్సులో నాజీ విస్తరణ అత్యంత త్వరిత
గతి ఆరంభమైంది. నాజీ బలాలు బల్గేరియాను ఆక్రమించి అధి
కారంచేపట్టాయి. తరువాత నాజీ బలాలు యుగొస్లావియాపై
దాడికి తరలాయి. ఇలా తరలడంతో రెచ్చిపోయి రష్యా
యుగొస్లావియాలు స్నేహపూర్వకమైన ఒడంబడికకు దిగాయి.
అయినప్పటికీ ఆ ఒడంబడిక పూర్తిఅయిన తరువాత, ఆరోజే
నాజీబాంబర్లు యుగొస్లావియా ముఖ్య పట్టణమైన బెల్‌గ్రేడ్‌పై
తీవ్రంగా దాడులు సలిపాయి.

ఇక ఇప్పుడు సోవియట్ప్రభుత్వం ఆలోచించింది.
జపానుతో సమాధానపడక తప్పదని తేల్చుకుంది. ఎంచేతనంటే
అనేక వేలమైళ్ళదూరంలోఉన్న రెండు ప్రధానరంగాలలోనూ

ఒకేమాటు పోరాటం సాధ్యంకాదు కనుక. దానికి పర్యవ సానంగా ఏప్రిల్ 13 న రష్యా–జపాను తాటస్థ్యసంధిపై సంత కాలు జరిగాయి. ఒడంబడికలో ఒకటవ నిబంధన "ఇరుపక్షాల వారూ తమమధ్య శాంతి, స్నేహసంబంధాలు నెరపుకుంటాం దుకు, ఒకరినొకరు అతిక్రమించకుండా ఉండడానికి, ఒకరి రాజ్యా నికి సంబంధించిన నీతీ న్యాయాలను, ఒకరు మన్నించడానికి ఒప్పుకుంటున్నారు" అని. రెండవ నిబంధననుబట్టి "ఇరుపక్షాల వారూ తమలో ఎవరో ఒకరు ఇతర దేశాల సైనికచర్యలకు గురిఅయినప్పుడు రెండవవారు తాటస్థ్యాన్ని అవలంబించాలనీ ఖరారుపడుతున్నారు" మూడవ నిబంధన "ఈ ఒడంబడిక అయిదు సంవత్సరాలవరకూ చెల్లాలనీ, ఆ తరువాత ముందుగా ఆక్షేపణ తెలియపరిస్తేతప్ప లేకపోతే దానంతట అదే తిరిగి పొడిగించబడుతుం" దనీ. జపాను సామ్రాజ్యప్రభుత్వం సోవి యట్ యూనియను ప్రభుత్వం "జపాను సామ్రాజ్యం పక్షాన మంగోలియా ప్రజాతంత్ర రిపబ్లికు రాజ్యనీతిని, నిరతిక్రమణను సోవియట్ యూనియను పక్షాన మంచూకూ సామ్రాజ్యం యొక్క రాజ్యనీతిని, నిరతిక్రమణను పరస్పరం గౌరవిస్తూరావా లని" ఒక సంయుక్త ప్రకటనకూడా ఈ ఒడంబడికకు జతపరి చారు. ఈ షరతులతో ఉన్న ఈ ఒడంబడిక చైనాను అనేక హేతువులవల్ల కలవరపెట్టింది. 1 ఇది జపాను బలాలకు ఉత్సా హాము కలిగించి దురాక్రమణాభిలాషను పెంచుతోంది. 2 మంగోలియా, మంచూరియాలపైన చేసిన ప్రకటనవల్ల రష్యా, మంచూ కూ ను దాని ఏర్పాటును గుర్తించడానికి ఇష్టపడుతు న్నట్లూ, జపాను మంచూరియాలో ఏ పరిస్థితి తెచ్చిపెట్టిందో

అదే పరిస్థితి తాను వెలుపలి మంగోలియాలో తెచ్చిపెట్టడా నికి ప్రయత్నిస్తున్నట్లూ, స్పష్టంగా సూచితమవుతున్నది. ఈ రెండువిధాలాకూడా చైనాప్రభుత్వంయొక్క సంపూర్ణాధికారా నికి గొప్ప ప్రమాదం వాటిల్లుతున్నది. 3 ఈ ఒడంబడిక సైబీరియా-మంచూరియా సరిహద్దునఉన్న బిగువును సడలించింది. తద్వారా జపాను తన దళాలలో కొంతభాగం మంచూరియా నుంచి తూర్పు, మధ్యచైనాలకు మార్చి చురుకుగా పోరాటం సాగించడానికి వీలుకలిగింది. 4 రష్యానుంచి యుద్ధపరికరాలు సరఫరా ఆపివేస్తామని చైనా బెదరింపబడింది. జపానుతో చేసుకున్న తాటస్థ్యపు ఒడంబడికకు అర్థం సోవియట్ చైనాపట్ల తన విధానం మార్చుకోడంకాదని సోవియట్ప్రభుత్వం మాట ఇచ్చింది. ఈ మాట ఇవ్వడం చివరకు రాజ్యతంత్రాల్లో చెప్పే ఉప్పుచప్పని మాటగా మారింది. సోవియట్ యూనియనుపై నాజీల దాడిజరిగిన తరువాత చైనాప్రభుత్వానికి మాస్కోనుంచి ఒక సూచనప్రకటన వచ్చింది. చైనాకు ఎగుమతులు నిలుపు చేయబడతాయని అందులో తెలుపబడింది. 5 ఈ ఒడంబడిక చైనా కమ్యూనిస్టులు విడివడి ఉండేటట్లు చేస్తున్నది, అందుకు ప్రోత్సహిస్తున్నది. రష్యా జపానుతో సమాధానానికి వచ్చినప్పుడు, చుంకింగ్ ప్రభుత్వాన్ని మాస్కో పూర్తిగా వదిలివేసిందనీ సమాధాన పడడానికికూడా ప్రతికూలంగా ఉందనీ చైనా కమ్యూనిస్టులు అనుకున్నారు. వారనుకున్నది సరియైనదేకూడా.

హిట్లర్ రష్యాపై యుద్ధం ప్రకటించినప్పుడు, అతను వెనుక తను బోల్షివిజాన్ని నాశనం చేస్తానన్న వాగ్దానం

నిజంగా ఆక్షణంలోనే నెరవేర్చుకుంటానని భావించి ఉంటాడు
తన మతయుద్ధంలో గ్రేట్ బ్రిటన్, సంయుక్తరాష్ట్రాలు వచ్చి
కలుస్తాయని అనుకుని ఉంటాడు. కాని అతనికి అవమానం
కోపంవచ్చేటట్లు ఈ రెండు ఆంగ్లో-శాక్ రాజ్యాలూ సో
యట్ రష్యాను తమకు ప్రబల శత్రువుగా పరిగణించడం మా
వేశాయి. సోవియట్ రష్యాపై వాటికి ఉన్న అనుమానాల
కూడా అదృశ్యమయ్యాయి. జులై 13 న స్నేహ పూర్వక మై
ఒడంబడికపై సంతకాలు చేయడంద్వారా గ్రేట్ బ్రిటను, సో
యట్ రష్యాలు లాంఛన ప్రాయంగా మిత్రరాజ్యాలయ్యాయి
అగస్టు 14 న ప్రధాన మంత్రి చర్చిల్, ప్రెసిడెంటు రూజ్వె
ల్టులు దూరాన ఉత్తర అట్లాంటిక్ లో ఒక యుద్ధ నౌకపై
సమావేశమయ్యారు. తరువాత అట్లాంటిక్ ఫర్మానా అనే ఒక
దాన్ని జారీచేశారు. అందులోని విషయాలు పూర్వ గా
ప్రెసిడెంటు విల్సన్ యొక్క పదాలను సూత్రాలను పోలి
ఉన్నాయి. సెయింట్ జేమ్సు న్యాయస్థానానికి రాయబారిగా
ఉన్న సోవియట్ రాయబారి మెయిస్కీ, ఆ ఫర్మానాలో ఉద
హరించిన సూత్రాలను సోవియట్ ప్రభుత్వం సమోదు చేసిం
దని ప్రకటించాడు.

ఈలోగా జపాను చైనాలో తన కలహాన్ని తీవ్రం
చెయ్యడమేకాక, ఆగ్నేయ ఆసియాలో దురాక్రమణలు
అధికంకావిస్తూవచ్చింది కూడా. యుద్ధమేఘాలు పసిఫిక్ లో
దట్టంగా అలుముకున్నాయి. డిసెంబరు 6 న ప్రెసిడెంటు
రూజ్వెల్టు వ్యక్తిగతంగా జపానుచక్రవర్తికి ఒక తంతివార్త
పంపాడు. పసిఫిక్ లో "విషాదఅవకాశాలు" చూపుతూ తనకూ

చక్రవర్తికీ— ఇరువురికీకూడా 'ఇకముందు ప్రపంచంలో రానున్న మృత్యువునూ, సర్వనాశనాన్ని అరికట్టడం పవిత్రధర్మం' అని కూడా వేర్కొన్నాడు. ఆమరునటిరోజు అందుకు సమాధానం, జపాన్ పెరల్‌హార్బర్‌పై దాడిచెయ్యడం—రెండు వర్తమానాలూ ఏకకాలమందే వచ్చాయి. తరువాత త్వరలోనే సంయుక్త రాష్ట్రాలు జపానుపైన, పిమ్మట జర్మనీపైకూడా యుద్ధం ప్రకటించాయి. 1942 సంవత్సరాది పండుగనాడు సంయుక్త రాష్ట్రాలు అంకురార్పణ చేశాయి. వాషింగ్‌టన్‌లో 'సంయుక్త రాష్ట్రాల ఒడంబడిక'పై సంతకాలు జరిగాయి. సంయుక్త రాష్ట్రాలు, చైనా, రష్యా, గ్రేట్‌బ్రిటన్లతో సహా అందులో ఇరవైఆరు రాజ్యాల ప్రతినిధులున్నారు. ఈ పై నాలుగు ప్రభుత్వాలలో ప్రతిది త్రైపాక్షిక ఒడంబడికలోని సభ్యులకు, తనతో యుద్ధానికి దిగిన ఆ సభ్యులపక్షంవారికి వ్యతిరేకంగా తన సైనిక, ఆర్థికసాధనాలన్నీ పూర్తిగా వినియోగించడానికి వాగ్దానం చేస్తున్నట్లు ఈ ఒడంబడికలో ఉన్నది.

జపాను పెరల్‌హార్బరుపై దాడిచేసి, పిమ్మట ఇండో చైనా, బర్మాలలోకి ప్రవేశించింది. వెనుకనుంచి చైనాను తీవ్రముగా భయపెట్టింది. అప్పుడు చైనాప్రభుత్వం తన యుద్ధసన్నాహాలను విస్తృతం చెయ్యడానికి నిశ్చయించింది. ఉత్తరోత్తరా తనకు కాలవ్యవధి తప్పనిసరిగా కావలసివస్తుందేమోనని ఊహించి అలా చేసింది. అప్పుడు సింకియాంగు వైపుకు ఆసక్తి మళ్ళింది. దాని ఆర్థికాభివృద్ధికోసం సోవియట్ చూపిన ఆసక్తి, పెట్టిన పెట్టుబడి పర్యవసానంగా సింకియాంగు 1937 వచ్చేసరికి భౌతికంగా ఎంతో అభివృద్ధికాంచింది. జపానును

ఎదిరించడానికి చైనాకు సోవియట్ మద్దతు ఇస్తున్న విధానాన్ని అనుసరిస్తూ సింకియాంగు ప్రభుత్వవ్యవహారాల డైరెక్టర్, జనరల్ షెన్‌షిట్సీ చైనా జాతీయప్రభుత్వానికి తాను మద్దతు ఇస్తానని మాటఇచ్చాడు. తీరప్రాంతాలనుంచి బ్రహ్మాండమైన యుద్ధశరణాగతుల దండు "వాయువ్య పురోగమన" ఉద్యమంలో వాయువ్యరాష్ట్రానికి పోవడానికి ప్రోత్సహించబడింది. చుంకింగుకు బాధ్యతవహించిన ఒక ఉన్నతోద్యోగి (సూపర్వైజరీ హైకమిషనర్) సింకియాంగ్ ముఖ్యపట్టణమైన టిహ్వాలో ఏర్పాటు చేయబడ్డాడు. అక్కడ కోమిన్‌టాంగు శాఖకూడా ఒకటి స్థాపించబడింది. కొద్దినెలలలో సింకియాంగు చైనా పరిపాలనకు లోనయింది.

ఈలోగా రష్యా నాజీదళాల దారుణదండయాత్రకు గురిఅయి అంతులేని కష్టనష్టాలు అనుభవించింది. సింకియాంగులో చైనా ప్రత్యక్షంగా పరిపాలన సాగించడానికి పూనుకోడంచూచి సోవియట్‌ప్రభుత్వం తాను సింకియాంగునుంచి వెనక్కు మరలడం అవసరమని భావించింది. తన మోటారు దళాలను ఉపసంహరించుకుంది. సాంకేతిక నిపుణులను తిరిగి పిలిపించుకుంది. పారిశ్రామిక యంత్రసాధనాలను, నూనె పారిశుధ్యకేంద్రాలను, వాయువిమానాలను, గనుల ఏర్పాట్లను, ఇంకా తక్కిన కర్మాగారాలను ఎక్కడివక్కడ తొలగించివేశారు. ఈపనంతాకూడా ఏమాత్రము చడీచప్పుడు కాకుండా చేశారు.

పెద్దపెట్టున వచ్చిన చైనా ఒత్తిడిఫలితంగా సింకియాంగును సోవియట్లు ఖాళీచేసివెళ్ళడం, సోవియట్ నాయకులకు

ఎంతగానో ద్వేషాన్ని, రోషాన్ని పుట్టించింది. ఖాళీచేసి వెళ్ళిన తరువాత సోవియట్ ప్రభుత్వం చైనాపట్ల ఒకరకమైన విధానాలను అనుసరించడం మొదలుపెట్టింది. అవి స్నేహపూర్వకమైనవికాని, సహాయంచేసేవికాని కావు. సోవియట్లు తమ ఉపసంహరణను పూర్తిచేసిన తరువాత చైనాపాలకులు సరిహద్దుసంఘటనలను, మహమ్మదీయుల తిరుగుబాట్లను ఎదుర్కోవలసివచ్చింది. ఇవి చాలా శక్తిమంతంగాను, వేగంగాను తరువాత అనేకసంవత్సరాలు కొనసాగాయి. ఇందుమూలంగా చైనా-సోవియట్ సంబంధాలకు ఆటంకం కలిగింది.

1937లో లుకోషియా సంఘటన జరిగితే-తదాది ఇన్ని ఏండ్లుకూడా సోవియట్ పత్రికలు చైనా యుద్ధప్రయత్నాలపట్ల సానుభూతి చూపుతూ వచ్చాయి. అంతేకాదు. ఛీఫ్ కమాండర్ చాంగ్ కై షేక్ నాయకత్వాన్ని గట్టిగా బలపరుస్తూ వచ్చాయి. అయినప్పటికీ 1943 నడివేసవిలో ఒక నిశ్చితమైన కఠినమయిన మార్పువచ్చింది. ఒక సాధికార సోవియట్ ట్రేడ్ యూనియన్ వార్తాపత్రికలో ఒక వ్యాసంవచ్చింది. చుంక్ కింగులో పూర్వం టాస్ ఏజంటుగా ఉన్న వాడిమిర్ రొగోవ్ "యుద్ధము-కార్మికవర్గము" అనే శీర్షికతో ఆవ్యాసం వ్రాశాడు. కొందరు ముఖ్యమైన కొమిన్‌టాంగ్ నాయకులు శాంతికాముకులయి, పరాజితులయి, శత్రువుకు లొంగిపోయారనీ, వాళ్ళు జపానుతో ఒక గౌరవనీయమైన శాంతి సంధిచేసుకోడానికీ, యునైటెడ్ ఫ్రంటును భగ్నంచెయ్యడానికీ, ప్రభుత్వానికీ, కమ్యూనిస్టుబలాలకూ మధ్యగలసైనికసహకారానికి క్రిందగోతులుత్రవ్వి

పడగొట్టడానికీ, కమ్యూనిస్టు "ఎనిమిదవ రూట్" సైన్యాలను కొత్త నాల్గవరూట్ సైన్యాలను క్రూరంగా హింసించమని పురి కొల్పడానికీ తమ శాయశక్తులా ప్రయత్నిస్తున్నారనీ అతను ఆ వ్యాసంలో ఆరోపించాడు. చైనాకమ్యూనిస్టులను శ్లాఘిస్తూ సోవియట్ "అబ్జర్వర్" అనే పత్రిక, వారి సైన్యాలు చైనా ప్రజల వీరోచితసమరంలో ఘనమైన యశస్సును సాధించాయనీ, ఆ సైన్యాలను నడుపుతున్న చైనా కమ్యూనిస్టునాయకులను చైనా కార్మిక ప్రజాబాహుళ్యంలో తమ జాతీయ స్వేచ్ఛా స్వాతంత్ర్యములకు నాయకులుగా అత్యంత గౌరవ ప్రతిష్ఠలతో మన్నిస్తూ ఆనందిస్తూన్నదనీ పేర్కొన్నది. ఈఅభిప్రాయాలను ఆధారంగా చేసుకుని సోవియట్ వార్తాపత్రిక ఏతే ఖకుడు చుంగ్ కింగ్ సేనానులు ప్రేరణరహితంగా కమ్యూనిస్టు బలాలపై ఎలాంటి దాడిజరిపినా అది చైనాప్రజలకు వెన్నుపోటులాంటిదే అవుతుందనీ, జపాను సామ్రాజ్యవాదులచేతులలో ఆటగా ఉంటుందనీ హెచ్చరికచేశాడు. ఏదేశంలోనైనా తమ మిత్రదేశం ప్రభుత్వంపట్ల వార్తాపత్రికలలో బహిరంగంగా ఇలాంటి హానికరమైన విమర్శలుసాగించడం ఎంతో శోచనీయమైన విషయం. అందులో సోవియట్ యూనియన్‌లో వార్తాపత్రికలు క్రెమిలిన్‌అభిప్రాయాలకు ప్రాతినిధ్యంవహించేవి, పైగా ప్రభుత్వంయొక్క అజమాయిషీలో నడుపబడేవి అయివుండడమువల్ల మరీ గమనార్హంగా పరిగణించాలి.

1943 కడపటి భాగంలో ప్రధానమైన మిత్రరాజ్యాలు తమ ఐక్యమత్యమును పటిష్ఠంచేసుకోడానికి, అంతా కలిసి తమ

శత్రువుపై చర్య తీసుకొనడానికి తగు కార్యక్రమాలకు వ్రాసు కోడం అవసరమని భావించాయి. ఆ ప్రకారం అక్టోబరు 19న మాస్కోలో ఒక సమావేశం జరిగింది. సమావేశానికి విదేశాంగ కార్యదర్శులు-సంయుక్త రాష్ట్రాల తరఫున కార్డెల్ హాల్, గ్రేట్ బ్రిటన్ తరఫున ఆంథోనీ ఈడెన్, సోవియట్ రష్యా తరఫున వి. యం. మాలటోవ్‌లు హాజరైనారు. ఈ సమావేశాల్లో ఏ ఒక్కదానిలోకూడా చైనా భాగస్వామికాదు. ఏమైనప్పటికీ, చేసిన ప్రకటనలలో సాధారణ రక్షణ విషయం కూడా ఉంది. అమెరికా విదేశాంగ మంత్రి హాల్ చైనాను కూడా అందులో చేర్చాలని సూచించాడు. ఈ సూచనను బ్రిటిష్ విదేశాంగ కార్యదర్శి సమర్థించాడు. కాని మాలటోవ్ మాత్రం వ్యతిరేకించాడు. కాని హాల్ చేసిన తీవ్రమైన కృషి వల్ల, పట్టుదలవల్ల ఈ వ్యతిరేకతనుంచి గట్టెక్కి, చైనా ప్రభుత్వానికి అందులో పాల్గొనే అవకాశం కలిగింది. అప్పటినుంచీ ఈ ప్రకటన మాస్కో ప్రకటన అని పిలువబడుతూ వచ్చింది. అందులో "ప్రభుత్వ సమానత్వం" ఆధారంగా శాంతికోరే రాజ్యాలన్నింటికీ పెద్దవికాని చిన్నవికాని వాటికి సభ్యత్వం ఇచ్చి, సాధారణ అంతర్జాతీయ సంస్థ ఒకదాన్ని వీలయినంత త్వరలో సృష్టించాలని పేర్కొన్నది. ఇంకా అందులో, యుద్ధం ముగిసిన తరువాత రష్యా, చైనా, బ్రిటన్, సంయుక్త రాష్ట్రాలు తమసైనిక దళాలను ప్రకటనలో ఉదహరించిన పనులకు, సంయుక్త సమాలోచనలు జరిపిన తరువాత తప్ప, మరి ఇతర రాజ్యాలవారి రాజ్య సరిహద్దులలోపల ఉంచరాదని కూడా స్పష్టంచేయబడింది.

తరువాత త్వరలోనే వేరుగా రెండు సమావేశాలు జరిగాయి. ఒకటి రష్యా లేకుండాను, ఒకటి చైనా లేకుండాను. మొదటిది కెయిరోలో, రెండవది టెహరాన్‌లో జరిగాయి. కెయిరో సమావేశానికి ప్రెసిడెంటు రూజ్వెల్టు, ఛీఫ్‌కమాండర్ చాంగ్‌కైషేక్, ప్రధానమంత్రి చర్చిలు హాజరయినారు. డిసెంబరు 1 న ఒక ప్రకటన జారీచేశారు. "మూడు పెద్ద మిత్ర రాజ్యాలు జపాన్ దాడికి తగినశిక్ష విధించడానికి, దురాక్రమణను ఆపడానికీ ఈ సమరంలో పోరాడుతున్నాయి. అంతేకాని వాటికి రాజ్యవిస్తరణ చేయాలనే ఆలోచనలేదు." పోతే "జపాన్ 1914 లగాయతూ పట్టుకున్న పసిఫిక్ దీవులన్నింటినీ వదిలివెయ్యాలి. జపాన్ చైనానుంచి దొంగిలించుకున్న మంచూరియా, ఫార్మోజా, పెస్కడార్సు మొదలయిన రాజ్యాలన్నింటినీ తిరిగీ చైనారిపబ్లిక్‌కు చెందేటట్లు చెయ్యాలి." అని ఆ ప్రకటనలో వివరించబడింది. అంతేకాదు. ఆ ప్రకటన "కాలక్రమేణా" కొరియా విముక్తిపొంది, స్వతంత్రం కావాలని కూడా పేర్కొన్నది. కెయిరో సమావేశకాలంలో రూజ్వెల్టు "ఇంకా కొద్దిమాసాలలోపల నేలపైన, నీళ్ళలోను తగు దండయాత్రలు బంగాళాఖాత ప్రాంతంగుండా కొనసాగుతాయి" అని చాంగ్‌కైషేక్‌కు వాగ్దానంచేశాడు.

ఇహ టెహరాన్ సమావేశానికి ప్రెసిడెంటు రూజ్వెల్టు, ఛీఫ్‌కమాండర్ స్టాలిన్, ప్రధానమంత్రి చర్చిల్ హాజరయినారు. ఈ సమావేశం తరువాత ఈ ముగ్గురు నాయకులూ ఒక ప్రకటన జారీచేశారు. వారు ఒక్క ఐరోపా సంగ్రామం విషయం, దాని సమస్యలనుగురించి మాత్రమే చర్చించారని ఆ ప్రకటన

అభిప్రాయం కలిగించింది. కాని నిజానికి నాయకులు దూర ప్రాచ్య సమరాన్ని గురించి కూడా ఒకరికొకరు అభిప్రాయాలు తెలుపుకున్నారు. వాటిలో కొన్ని చైనాకు చాలా దగ్గరిగా దెబ్బకొట్టే అభిప్రాయా లున్నాయి. ఉదాహరణకు, స్టాలిన్ ఈ అవకాశాన్ని తీసుకుని చైనా ప్రభుత్వానికి అప్రతిష్ట తేవాలని చూచాడు. చైనా సైన్యాల స్వరూప స్వభావాలనుగూర్చి ఆయన చాలా తేలిక అభిప్రాయం వెలిబుచ్చాడు. సైనిక బలం ఇలా హీనస్థితిలో ఉన్నదీఅంటే ఆతప్పు చైనానాయకుల దేనని ఆయన ఆరోపించాడు. తరువాత సమావేశంలో స్టాలిన్, జర్మని పతనమైన క్షణంలో జపాన్‌తో సమరం సాగించడానికి రష్యా వచ్చి చేరుతుందని నమ్మకంగా చెప్పాడు. దూరప్రాచ్య సంగ్రామంలో రష్యన్‌లు పాల్గొనేయెడల బర్మాలో సైనిక సన్నాహం అనవసరమవుతుంది. టెహరాన్ సమావేశంతరువాత చూచిల్లు బర్మాపథకం గంగలో కలుపబడిందని చాంగ్ కై షేక్ కు తెలియచేశాడు. మొత్తంమీద ఈ మాస్కో, కెయిరో, టెహరాన్ సమావేశాలవల్ల చైనా ప్రభుత్వంపట్ల సోవియట్ ప్రభుత్వానికిగల శత్రుత్వధోరణి బయట పడింది.

మాస్కో, టెహరాన్ సమావేశాలద్వారా బ్రిటిష్, అమెరికన్ ప్రభుత్వాలతో సమాధానాలు కుదుర్చుకున్నప్పటికీ సోవియట్ ప్రభుత్వం 1944 వసంతం వచ్చేసరికి జపాన్‌తో సఖ్య సంబంధాలు ఏర్పాటు చేసుకున్నది. ఈఏర్పాటు మార్చి 3 న ఒక ఒడంబడిక పూర్తిచేసుకోవడంద్వారా జరిగింది. ఇలా సోవియట్, జపాన్‌తో పొత్తుకలపడం ఐరోపాలో రెండవ యుద్ధరంగాన్ని ప్రారంభించమని అమెరికా సంయుక్తరాష్ట్ర

లను, గ్రేట్ బ్రిటన్‌ను ఒత్తిడి చేయడానికి పన్నిన పన్నాగమే అయివుండవచ్చు. ఈ రష్యా - జపాన్ ఒడంబడిక పైనా జపాన్‌తో సాగిస్తున్న సమరంలో మహావిపత్తును తెచ్చిపెట్టింది. ఈకొత్త ఒడంబడికవల్ల జపాన్, ఉత్తరసఖాలిన్‌లోని నూనె, బొగ్గు సౌకర్యాలను తిరిగీ రష్యాకు అప్పగించపెట్టింది. రష్యా జపాన్‌తో గల మత్స్యపరిశ్రమ ఒడంబడికను మళ్ళీ అయిదేండ్లు పాటు పొడిగించుకుంది. జపాన్‌కు 50 లక్షల రూబుళ్ళు చెల్లించేటట్లు, ప్రస్తుతసంగ్రామం ముగిసిన తరువాత వరుసగా అయిదేండ్లపాటు, ఏడాదికి 50 వేల మెట్రిక్ టన్నుల చొప్పున నూనె, జపాన్‌కు ఏటేటా సరఫరాచేసేటట్లు రష్యా ఒప్పుకుంది. ఈకొత్త ఒడంబడిక సోవియట్ రాజ్యతంత్రంలో ఒక ప్రధానమైన విజయంగా బ్రిటిష్ అమెరికన్ పత్రికలు పరిగణించాయి.

రష్యా - జపాన్ ఒడంబడికపై వివేకవంతమైన అభిప్రాయాలు కూడా కొన్ని వ్యక్తం కాకపోలేదు. ఏప్రిల్ 1 న ప్రతినిధి మైక్ మాన్స్‌ఫీల్డు అమెరికన్ ప్రతినిధులసభలో, రష్యా - జపాన్ల మధ్యజరిగిన ఈ కొత్త ఒడంబడిక జపాన్ నూనె సప్లయికి భౌతికంగా ఏమీ దెబ్బకొట్టదనీ, కాని దీనివల్ల జపాను దేశంలోను, అది ఆక్రమించిన రాజ్యాలలోను డానిస్థితి పటిష్ఠం అవుతుందనీ పేర్కొన్నాడు. ఇక చుంగ్‌కింగ్‌లో ఈ ఒడంబడిక వార్త వినగానే, దీనివల్ల రష్యా పసిఫిక్ సమరంలో తాటస్థ్యాన్నే కొనసాగిస్తుందని, పోతే జపాన్‌కు విడివడిన తన దళాలను మంచూరియానుంచి మధ్యచైనాలోని సమరరంగాలకు మార్చే అవకాశం చిక్కిందని స్పష్టంగా సూచితమవుతున్నదనే అభిప్రాయం వెల్లడిఅయింది. జపాన్ పురోగమనాలు

మహాఉపద్రవకరంగా పరిణమించాయి. చైనాను నడిమికి రెండుగా చీల్చి, మంచూరియానుంచి ఇండోచైనాకు వెళ్ళే భూమార్గం యావత్తూ ఆక్రమించుకున్నాయి.

ఐరోపాలో మిత్రమండలి విజయం దగ్గరపడడంతో, ప్రపంచశాంతి సంస్థనిర్మాణం ఎంతో అవసరంగా కనుపించింది. మే 30న అమెరికా విదేశాంగమంత్రి కార్డల్‌హాల్ బ్రిటిష్, సోవియట్, చైనా ప్రభుత్వాలను ప్రపంచశాంతిసంస్థ నిర్మాణం కోసం సాగే "సంభాషణల"లో పాల్గొనేందుకు రమ్మని ఆహ్వానించాడు. సోవియట్ ప్రభుత్వం తన అనిష్టతను సూచన ప్రాయంగా వెల్లడించింది. సమావేశంలో చైనా పాల్గొంటుంది కనుక, బహుముఖాలయిన ఈ సంభాషణలలోకి తాను రానన్నది. అప్పుడు తాను జపానుతో యుద్ధానికి దిగలేదు కనుక రష్యా ఆ నెపం పెట్టింది. కాబట్టి రెండువిధాల సంభాషణలు సమానాంతరంగా, వరుసగా జరుపబడతాయని ప్రకటించారు.

డమ్ బర్టన్ ఓక్స్ ప్రతిపాదనలు అని పిలువబడే ఆ ప్రతిపాదనలు, వెనుకటి నానారాజ్య సమితినిపోలిన అంతర్జాతీయ సంస్థను ఏర్పాటు చెయ్యాలని సూచించాయి. చైనా-సోవియట్ సంబంధాలకు సంబంధించినంతవరకూ డమ్ బర్టన్ ఓక్స్ సంభాషణలు వాటికి అత్యంత ప్రాధాన్యం ఇచ్చాయి. చైనా-సోవియట్ సంబంధాలు క్షీణదశలో ఉన్నాయని మరొకమాటు వారు వేలుపెట్టి చూపించారు. చైనా ప్రభుత్వం పాల్గొనే ఏ చర్చలో కూడా తాను పాల్గొనడం రష్యాప్రభుత్వానికి ఇష్టం లేదు. రష్యా అప్పుడు జపాన్‌తో యుద్ధానికి దిగలేదన్నసాకు

కేవలం కుంటిసాకుతప్ప మరేంకాదు. మొదటిది సంభాషణలు కేవలం శాంతియుతంగానే కొనసాగాయి. రెండవది 'పెరల్ హార్బరు, గ్రేటుబ్రిటను, అమెరికా సంయుక్తరాష్ట్రాలుకూడా జపాన్‌తో యుద్ధానికి దిగిన లగాయితూ, జపాన్‌పట్ల సాంకేతికంగా వారిహోదా చైనావారిహోదా ఎలాఉందో అలా ఉంది. కాబట్టి అమెరికా సంయుక్తరాష్ట్రాలతోను, బ్రిటన్‌తోను సంభాషణలు జరపడం సోవియట్ప్రభుత్వానికి ఒక వైపున సాంకేతికంగా సరిపడనూలేదు, మరొకవైపు అది చైనాతో సంభాషణలకు అంగీకరించనూలేదు.

రష్యాతో కొత్తఒడంబడిక చేసుకున్న తరువాత జపాన్ మధ్యచైనాలో ప్రబలదండయాత్రలకు పూనుకున్నది. తత్ఫలితంగా చైనాప్రభుత్వం కొన్ని తీవ్రమైన సైనిక తిరోగమనాలకు లోనయింది. దీనికి వ్యతిరేకంగా స్టాలిన్‌గ్రాడ్ సమరంలగాయతూ నాజీదళాలను ఎదుర్కొని విడువకుండా పురోగమిస్తూ వస్తున్న ఎర్రసైన్యం అద్భుతమైన విజయాలు సాధిస్తున్నది. జూన్ 6న [డి. డే] ఐరోపాభూభాగంలో అడుగుపెట్టిన తరువాత ఇంగ్లీషు - అమెరికన్‌బలాలు కూడా త్వరితగతి పురోగమిస్తున్నాయి. జర్మనీతో సోవియట్ రష్యా పోరాటం సాగించి మంచిపని చేస్తున్నందుకు సంయుక్తరాష్ట్రాలు, గ్రేట్‌బ్రిటన్ సంతుష్టి చెందడంమాత్రమేకాక, రష్యా తుదివరకూ తమ మిత్రదేశంగానే ఉండి పోరాడుతుందనీ, జపాన్‌ను ఓడిస్తుందనీ ఆశిస్తున్నాయి. ఈ కారణాలవల్ల సోవియట్ రష్యా మాట అన్నా, దాని అభిప్రాయాలన్నా మిత్రమండలి సభలలో నిస్సందేహంగా అందరూ పెద్ద గౌరవం చూపుతూవచ్చారు.

సోవియట్ ప్రభుత్వం, చుంగ్‌కింగ్ ప్రభుత్వాన్ని బహిష్క రించడానికి, తృణీకరించడానికి ఉద్దేశపూర్వకంగా ప్రయత్నాలు చేసింది. చుంగ్‌కింగ్‌పట్ల రష్యా చూపుతున్న ఈ ప్రతికూల వైఖరి, చైనా కమ్యూనిస్టుల విధానంలోనేకాక, సంయుక్త రాష్ట్ర ప్రభుత్వవిధానంలో కూడా మార్పుకి కారణమయింది.

చుంగ్‌కింగ్ ప్రభుత్వము, కమ్యూనిస్టులు తమ సంబం ధాలలో ఏర్పడిన గాయాలను ఇంకా మాన్పుకోనూలేదు. రాజకీయ సమస్యలను రాజకీయంగానే పరిష్కరించుకుందా మనే తలంపుతో ప్రభుత్వం కమ్యూనిస్టులతో సంప్రతింపులకు ఏర్పాట్లు ప్రారంభించింది. ఏమైనా ఫలితం మాత్రం శూన్యంగా కనుపించింది. అప్పుడు సంయుక్తరాష్ట్రాలకు ఉపాధ్యక్షుడుగా ఉన్న హెన్రీవాలెస్, జాతీయవాదులను కమ్యూనిస్టులను కలప డానికి ఏంచెయ్యాలో చూద్దామని చుంగ్‌కింగ్‌కు వచ్చాడు. చైనా కమ్యూనిస్టుల వెనకాల సోవియట్ రష్యా ఉన్నదని చాంగ్‌కైషేక్ బాధపడి ఉంటాడు. సోవియట్ అధికారులతో ఒక సమావేశం ఏర్పాటు చెయ్యమని ఆయన కోరాడు. కాని తన ప్రభుత్వానికీ మాస్కోకు మధ్యగల సంబంధాలు ఎలా ఉన్నాయంటే మూడో మధ్యవర్తి ఉండి పరిష్కరిస్తేగాని తేలని స్థితిలో ఉన్నాయి. అంచాత వాలెస్‌తో జరిపిన సంభాషణ లలో చాంగ్ ఒకమాటు "చైనా-సోవియట్ రష్యాల మధ్య సమావేశం ఏర్పాటు చేయడానికి తాను ప్రెసిడెంటు రూజ్వెల్టు యొక్క స్నేహపూర్వక సహాయాన్ని మనసారా వాంఛిస్తు న్నట్లు ఆయనకు తెలియపర్చమని చెప్పాడు. ఈ కోరికకు

ప్రెసిడెంటు రూజ్వెల్టు మంచూరియాకు సంబంధించిన యాల్టా ఒడంబడిక ద్వారా సమాధానం ఇచ్చాడా? ఎవరైనా ఆశ్చర్య పోతారు. వాలెస్ జులైలో సంయుక్తరాష్ట్రాలకు తిరిగి వచ్చిన తరువాత తనువెళ్ళిన పనినిగూర్చి ప్రెసిడెంటు రూజ్వెల్టుకు ఒకనివేదిక సమర్పించాడు. ఆ నివేదికలో "చాంగ్ మహా ఉంటే కొద్దికాలం మాత్రమే. యుద్ధంతరువాత చైనాను నడపడానికి తగిన మేధస్సుగాని, రాజకీయబలంగాని ఆయన దగ్గర ఉన్నాయని నమ్మకంలేదు" అని పేర్కొన్నాడు వాలెస్. ఇటువంటి ధోరణిలో ఉన్న ఆ నివేదిక చుంగ్‌కింగ్ ప్రభుత్వం యొక్క ప్రతిష్ఠకు నిజంగా ఒక పెద్దదెబ్బ అయి ఊరుకుంది. వాస్తవానికి 1944 సంవత్సరం మధ్యకాలంనాటికే చుంగ్‌కింగ్ ప్రభుత్వం పట్ల అమెరికన్ జనహితైక అభిప్రాయం ఒక గమనార్హమైన మార్పు పొందుతూ వచ్చింది. చుంగ్‌కింగ్‌లోని అమెరికన్ పత్రికా విలేఖరులు, యెనాన్‌లోని ఒక అమెరికన్ మిలిటరీ మిషన్, కమ్యూనిస్టు బలాలను అభినందించారు. వారికింకా మంచి ఆయుధాలు అందచేయ బడాలని గట్టిగా చెప్పారు.

చైనా కమ్యూనిస్టులలో అమెరికన్‌ల ఆసక్తిని ప్రేరేపించడానికి మాస్కో తన పలుకుబడిని వినియోగించింది. యుద్ధసామగ్రి ఉత్పత్తిసంస్థకు అధ్యక్షుడైన డోనాల్డు నెల్సన్, చైనాకువెడుతూ మార్గమధ్యాన మాస్కోలో ఆగి జనరల్ పేట్రిక్ హర్లీని కలుపుకుని విదేశాంగమంత్రి అయిన మాలొటోవ్‌తో సంభాషణలు నెరపాడు. ఆ సమాలోచనల్లో

సోవియట్ రాజ్యతంత్రజ్ఞుడు, చైనా కమ్యూనిస్టులు ఏవిధం గానూ సోవియట్ ప్రభుత్వంతో ముడి వేసుకుని లేరని, వారు కేవలం చైనాలో ఆర్థికపరిస్థితులను అభివృద్ధిపరచడంలో ఆసక్తి గల సంస్కారులు మాత్రమే ననీ పేర్కొన్నాడు. జనరల్ హర్లీని, డోనాల్డు నెల్సన్‌ను, జనరల్ స్టిల్‌వెల్‌ను కూడా వెంటఇచ్చి - వారి ముగ్గురినీ చైనా వెళ్ళి అక్కడ సైనిక, రాజకీయ, ఆర్థికసమస్యలను పరిష్కరించడంలో చైనా ప్రభుత్వానికి సహాయపడమని ప్రెసిడెంటు రూజ్వెల్టు పంపాడు. చైనా కమ్యూనిస్టులకు కొన్ని సౌకర్యాలు కలిగించవలసినదిగా అమెరికన్ ప్రభుత్వం చైనాప్రభుత్వాన్ని ఒత్తిడి చేయడానికి ప్రయత్నించింది. జనరల్ స్టిల్‌వెల్ కమ్యూనిస్టులను సాయుధులుగా చేయాలనీ, ప్రభుత్వబలాలు, కమ్యూనిస్టుబలాలు - రెండూకూడా తన నాయకత్వంక్రిందికి రావాలనీ పట్టుబట్టాడు. సెప్టెంబరు చివరలో అతను స్వయంగా ఛీఫ్‌కమాండర్ చాంగ్‌కై షేక్‌కు ప్రెసిడెంటు రూజ్వెల్టు దగ్గరనుంచి వచ్చిన వర్తమానం ఒకదాన్ని అందచేశాడు. అందులో వెనకటి సైనిక పరాజయాలకు చాంగ్‌పై నిందమోపుతూ, జనరల్ స్టిల్‌వెల్‌కు స్వేచ్ఛగా తన పథకాలు కొనసాగించే అవకాశం ఉంటేతప్ప లేకపోతే చైనాకు సంయుక్తరాష్ట్రాల సహాయం ఇంతటితో ఆగిపోతుందని పేర్కొనబడింది. ఈ కోర్కెను అంగీకరించడానికి మారుగా చాంగ్, తాను టిబెట్‌కు తిరిగి పోవడానికి సిద్ధంగా ఉన్నాననీ, అక్కడనుంచి పెరల్‌హార్బర్‌కు పూర్వం లాగానే తాను ఒక్కడే జపాన్‌తో పోరాటం కొనసాగిస్తాననీ వ్యక్తంచేశాడు. తరువాత జనరల్ స్టిల్‌వెల్‌తో ఇక తనకు

ప్రయోజనం లేదని చాంగ్‌కు తెలియపరిచాడు. పిమ్మట జనరల్ స్టిల్‌వెల్ స్థానంలో జనరల్ ఆల్బర్టు సి. వెడెమేయర్ నియమితుడైనాడు. స్టిల్‌వెల్‌ను తిరిగి పిలిపించడం అమెరికన్ ప్రజల అభిప్రాయంలో అసహ్యాం పుట్టడానికి కారణమైంది.

చుంగ్‌కింగ్ ప్రభుత్వప్రతిష్ఠ పడిపోతూరావడంతో, కమ్యూనిస్టులకు సహజంగా ధైర్యసాహాలు హెచ్చాయి. సంప్రతింపులు కొన్ని నెలలపాటు - సెప్టెంబరు సగం గడిచే దాకా వెనకపడ్డాయి. ఏమీ సాధించకుండానే ఇక అప్పుడంత టితో అంతమైపోయాయి. నవంబరు మొదట్లో తిరిగీ కొన సాగాయి. జనరల్ హార్లీ, యెనాన్‌కువెళ్ళి మావ్‌సే టుంగ్‌చే సంతకం చేయబడిన ఒక ఒడంబడిక తీసుకుని తిరిగివచ్చాడు. హార్లీ తనమటుకు తాను ఇరుపక్షాలమధ్య పరిష్కారానికి రావడానికి అది "ఒక ఆచరణసాధ్యమైన పథకం" అని భావిం చాడు. ఈ ఒడంబడిక కొమింన్‌టాంగ్ నియంతృత్వానికి స్వస్తి చెప్పాలనీ, అన్ని పక్షాలవారికీ ప్రాతినిథ్యం వహిస్తున్న భిన్న కక్షీయప్రభుత్వాన్ని ఒకదాన్ని నిర్మించాలనీ పేర్కొన్నది. ప్రభుత్వం ఈ పథకాన్ని నిరాకరించింది. కమ్యూనిస్టుపార్టీని న్యాయశాసనానుసారమైనదాన్నిగా చేయడానికి, కమ్యూనిస్టు ప్రతినిధులను జాతీయసైనికసంఘంలో చేర్చుకోడానకి మాత్రం అంగీకరిస్తూ ఒక ఎదురు ప్రతిపాదనచేసింది. కాని అందులో కమ్యూనిస్టు బలాలను జాతీయసైన్యంలో కలిపివేసి పునర్ని ర్మించాలని కోరింది. చుంగ్‌కింగ్‌లో అగ్రశ్రేణికి చెందిన కమ్యూనిస్టు ప్రతినిధి చౌ ఎన్ లే ఈ ప్రతిపాదన అంగీకరించ తగింది కాదని భావించాడు. మావ్ పంచసూత్ర ప్రణాళికను

ప్రభుత్వం నిరాకరించినందుకు తీవ్రంగా రెచ్చిపోయాడుకూడా. చైనా అంతరంగిక పరిస్థితి తిరిగీ సందిగ్ధావస్థలోనే పడింది.

1945 వచ్చేసరికి యిరోపాలో మిత్రమండలికి పూర్ణ విజయం లభించింది. ఫిబ్రవరి మొదట్లో క్రిమియన్ ద్వీపకల్పం లోని యాల్టావద్ద అగ్రరాజ్యాధినేతలు ముగ్గురూ సభతీర్చారు. పాల్గొన్నవారు ప్రెసిండెంటు రూజ్వెల్టు, ప్రధాని స్టాలిన్, ప్రధానమంత్రిచర్చిలూను.వరుసగారహస్యవ్యవహారాలుఅనేకం నడిచాయి. ఈరహస్య వ్యవహారాలలో ఒకటి ఏమిటీ అంటే-చైనాకు తెలీకుండా, చైనాకు నష్టంకలిగిస్తూ మంచూరియాలో వారికి ఇవ్వబడిన ప్రధాన సౌకర్యాలకు ప్రత్యామ్నాయంగా సోవియట్ రష్యా పసిఫిక్ సంగ్రామంలో పాల్గొనడం ఈ రహస్య వ్యవహారంలోని సారాంశం ఇది:

"సోవియట్ యూనియన్, అమెరికా సంయుక్త రాష్ట్రాలు, గ్రేటుబ్రిటన్-ఈమూడు పెద్దరాజ్యాలకు చెందిన నాయకులూ ఈ దిగువ విషయాలను అంగీకరిస్తున్నారు: జర్మనీ లొంగిపోయి, యిరోపాలో యుద్ధం అంతమైన తరువాత రెండు మూడు నెలలలో సోవియట్యూనియన్, మిత్రమండలి పక్షాన జపాన్తో యుద్ధానికి దిగాలి. అందుకు షరతులు ఇవి: 1. వెలుపలిమంగోలియా మంగోలియన్ ప్రజాతంత్ర రిపబ్లిక్ లో ఏస్థితిఉన్నదో దాన్ని అలాగే అట్టిపెట్టి ఉంచాలి. 2. 1904 లో విద్రోహాకరమైన జపాన్దాడివల్ల నష్టమయిన వెనుకటి రష్యా హక్కులు తిరిగీ పొందేటట్లు చెయ్యాలి. ఉదాహరణకు: (అ) షెఖాలిన్ దక్షిణభాగం, దానికి ఆనుకునిఉన్న దీవులు తిరిగీ

సోవియట్ యూనియన్‌కు చెందాలి. (ఆ) డైరెన్ వర్తక రేవును అంతర్జాతీయం చెయ్యాలి. ఈ రేవులో సోవియట్ యూనియన్‌కుగల ప్రధాన స్వత్వాలు సురక్షితం కావించ బడాలి. సోవియట్‌యూనియన్‌కు నౌకాశ్రయంగా ఉన్న పోర్టుఆర్థర్‌పై గుత్తాధికారాన్ని తిరిగి సోవియట్‌కు ఇచ్చే యాలి.(ఇ) చైనా తూర్పురైల్వేయున్నూ,డైరెన్‌కు పోయేమార్గం గాఉన్న దక్షిణ మంచూరియా రైల్వేయున్నూ సోవియట్‌వారు చైనావారు కలిసి ఏర్పాటుచేసుకున్న ఒక సంయుక్త సంస్థ సిబ్బందిచే నడుపబడాలి. దీన్నిబట్టి సోవియట్ యూనియన్‌కు గల వెనుకటి హక్కులు సురక్షితంగా ఉండేటట్లున్నూ, మంచూరియాలో సర్వాధికారం చైనా అట్టిపెట్టుకునేటట్లున్నూ స్పష్టమవుతోంది. 3. కురైల్ దీవులను సోవియట్ యూనియన్‌కు అప్పగించాలి. పోతే వెలుపలమంగోలియా, రేవులు, రైలుమార్గాలు; మొదలయిన పైవాటినన్నిటికీ సంబంధించిన ఈ ఒడంబడిక చాంగ్‌కైషేక్ యొక్క సమ్మతి పొందాలని తెలుపబడింది. మార్షల్ స్టాలిన్ సలహా చొప్పున ఈ అంగీకారాన్ని పొందడానికి తగుచర్యలను ప్రెసిడెంటుతీసుకుంటాడు. ......సోవియట్ యూనియన్ తన పక్షాన ఒకవిషయం స్పష్టపరిచింది. సోవియట్ యూనియన్‌కూ చైనాకూ మధ్య ఒక స్నేహ, సహకార ఒడంబడికను చైనాజాతీయప్రభుత్వంతో నెరపడానికి తాము సిద్ధంగా ఉన్నామనీ, తద్వారా చైనా, జపాన్ బంధాలనుంచి బయట పడడానికి తాము తమ సాయుధ బలాలతో చైనాకు సహాయం చేస్తామనీ చెప్పింది.

సోవియట్‌ప్రభుత్వం ఏప్రిల్ 5 తేదీన యాల్టా రహస్య

సంధిప్రకారం వ్యవహరించడానికి తన నిశ్చయాన్ని వెల్లడి చేసింది 1941 ఏప్రిల్ 13న తాము జపాన్‌తో చేసుకున్న తాటస్థ్యపు ఒడంబడికను త్రోసిపుచ్చుతున్నామని తెలియ పరిచింది. సోవియట్ విదేశాంగమంత్రి జపాన్ ప్రభుత్వానికి ఒక సంక్షిప్త లేఖ పంపుతూ అందులో ఒక విషయం గట్టిగా నొక్కి చెప్పాడు: 'జర్మనీ రష్యాపై చేసిన దాడిలో జపాన్ జర్మనీకి సహాయంచేసింది. అంతేకాదు. రష్యామిత్రులయిన, గ్రేట్‌బ్రిటన్, సంయుక్తరాష్ట్రాలపైన కూడా జపాన్ దాడి సలిపింది.'

అసలు ఇంతకూ ఈ యాల్టా రహస్యఒడంబడిక ఎందు కోసం చేసుకున్నట్లు? ఏమో, అభిప్రాయాలు పలువిధాలుగా-ఒకదానికొకటి పొత్తుకుదరకుండా ఉన్నాయి. రాబర్టు షెర్ హుడ్, ప్రెసిడెంటు రూజ్వెల్టు ఈ ఒడంబడికను అంగీకరించ డానికి కారణం రష్యా జపాన్‌తో యుద్ధానికి దిగిందన్న విష యాన్ని గురించి సాగుతున్న సంప్రతింపులకు ఆయన విసుగెత్తి పోయి వాటిని ముగించాలని ఆదుర్దాపడడమేనని అంటున్నాడు. పూర్వం ప్రభుత్వకార్యదర్శిగా ఉన్న ఎడ్వర్డు స్టెటీనియస్, ఈ యాల్టా ఒడంబడిక "జాగ్రత్తగా చేసినపనేకాని చటుక్కున చేసేసిన నిర్ణయంకాదు. కాని సైనిక అవసరాలవలన ఆవిధంగా రూపొందిది." అని ప్రకటించాడు. ఇంతకుముందు చర్చిల్ ఇదే ఉద్దేశాన్ని వెలిబుచ్చాడు. సరే, ఈ ఒడంబడిక ఏ ఉద్దే శాలతో చేయబడినప్పటికీ - తరువాత ప్రెసిడెంటు రూజ్వెల్టు దీనిని విచారించాడు. ఆయన ఇహ కొద్దికాలానికి అసువులు వీడతాడనగా ఏప్రిల్ 12 తేదీన జనరల్ ప్యేట్రిక్ హార్లీని పిలిచి

ఇలా చెప్పాడు: "నీవొకమాటు లండన్‌కు వెళ్ళిరావాలని ఉంది నాకు. అక్కడ చర్చిల్‌ను కలుసుకుని ఆ ఒడంబడికను సరిచేయ్యాలి. నీవు మాస్కో వెళ్ళి అక్కడ స్టాలిన్‌ను కలుసు కోవాలని కోరుతున్నాను."

జర్మనీ ఓడిపోయిన తరువాతకూడా సోవియట్ రష్యా తమతో మిత్రత్వం కొనసాగిస్తుందని సంయుక్తరాష్ట్రాలు, గ్రేట్‌బ్రిటను భావించాయి. అంతే కాకుండా జపాన్‌పక్షం చేరడమో లేక జపానుకు విశ్వాసపాత్రమైన తటస్థరాజ్యంగా ఉండడమో జరుగుతుందనీ, తత్ఫలతంగా జపాన్ను ఓడించడం మరింత కష్టసాధ్యం అవుతుందనీ భీతిచెందాయి. 1944 లో తేలిగ్గా మారిపోయే ఈ రష్యన్ రాజ్యతంత్రపుస్థితి, 'యాల్టా సమావేశంలో తను సంపాదించిన హక్కుల తాత్పర్యానికి ఒక కీలకంగా పనిచేసింది.

యాల్టా సమావేశంలో సంయుక్తరాజ్యాల సభ ఒకటి 1945 ఏప్రిల్ 25 న సంయుక్త రాష్ట్రాలలో జరపాలని అంగీక రించబడింది. యాల్టాలో కూడిన అగ్రనాయకులు ముగ్గురూ తమతమ సర్వాధికారాలకు ముందుగానే జాగర్తగా కాపు కాచుకున్నారు : "సెక్యూరిటీకౌన్సిల్ చేసే అన్ని విషయాలకు సంబంధించిన నిర్ణయాలూ శాశ్వతసభ్యుల సమ్మతి ఓట్లతో కలుపుకుని, ఏడుగురు సభ్యులచేత రూఢిచేయబడిన ఓటు ప్రకారం చేయాలని పట్టుపట్టారు.". జూన్ 26 వరకూ సమా వేశం కొనసాగింది. యాభై రాజ్యాల ప్రతినిధులు సంతకాలు పెట్టిన సంయుక్తరాష్ట్రాల ఫర్మానా ఒకటి ఏర్పాటయింది. పైన చెప్పిన ఓటింగ్ పద్ధతిప్రకారం నిర్ణయాలు చేయబడినాయి.

ఈసభ జరుగుతున్న కాలంలో గమనార్హమైన గొప్ప చరిత్రాత్మక సంఘటనలు ఐరోపాలో పరుచుకుని ఉన్నాయి. మే 1 వ తేదీన నాజీ రేడియోలో హిట్లర్ "బెర్లిన్‌లో బోల్షివిక్కులతో పోరాడుతూ" అసువులుబాసాడని వార్తవచ్చింది. తరువాత అతని స్థానంలోకి గ్రాండ్ అడ్మిరల్ కారల్‌డోనిజ్ వచ్చాడు. మే 8 వ తేదీన అతను మిత్రబలాలకు లొంగిపోయాడు ఐరోపాలోని క్లిష్టపరిస్థితిపై ఒక సాధారణ పరిష్కారానికి రావడంకోసం ప్రెసిడెంటు ట్రూమన్, ప్రధాని స్టాలిన్, ప్రధానమంత్రి చర్చిల్ జులై 17 న పోట్సుడాంలో సమావేశమయ్యారు. జపానుప్రభుత్వం పసిఫిక్ సంగ్రామంలో తన మధ్యవర్తిత్వం అర్థిస్తున్నట్లు సోవియట్లు బయటపెట్టారు. ఈ వర్తమానమున్నా, దీంతోపాటు న్యూమెక్సికోలో జులై 16 న జరిగిన అణుబాంబు పరీక్షితాలూకు అనుకూలమైన నివేదికలున్నా, తక్షణం సంయుక్తరాష్ట్రాలు, గ్రేట్‌బ్రిటన్, చైనాలతో కలిసి జులై 26 న జపానుకు ఒక 'అల్టిమేటమ్' పంపేటట్లు చేశాయి. ఆ అల్టిమేటమ్‌లో మొత్తం నిరాయుధీకరణ, యుద్ధనేరస్థులను శిక్షించుట, జపాన్ సామ్రాజ్యాన్ని విడదీయుట, యుద్ధ పరిశ్రమల పరిష్కారం - ఇవి తక్షణం జరగాలని గట్టిగా కోరింది. దాంతోపాటే ఈ ప్రకటన నకలు ప్రతి ఒకటి సోవియట్ విదేశాంగమంత్రి మాలటోవ్ కు పంపబడింది. మాలటోవ్ దీన్ని రెండుమూడురోజులు ఆపుచేసి ఉంచమని అడిగాడుకాని, ఇది అప్పటికే విడుదల చేయబడడంవల్ల అతను చాలా ఆందోళన చెందాడు. ఇక ఇప్పుడతను జపానుతో సమరం సాగిస్తున్న ప్రధాన రాజ్యాలవారు, సోవియట్ ప్రభుత్వం

పసిఫిక్ సమరంలో పాల్గొనేందుకు లాంఛనంగా కోరుతూ ఒక వర్తమానాన్ని సోవియట్‌కు పంపవలసిందని అడిగాడు. ఆ సమయంలో కనుక మిత్రరాజ్యాలవారి 'అల్టిమేటమ్'ను జపాను అంగీకరించి ఉన్నట్లయితే, సోవియట్ యూనియను జపానుపై యుద్ధం ప్రకటించడానికి కారణం ఉండేదికాదు సోవియట్ సైన్యాలు మంచూరియాను, ఉత్తర కొరియాను, ఇంకాజపాను వారిదీవులు, రాజ్యాలు-ఏవీకూడాఆక్రమించిఉండేవికావు. కాని జపాన్ప్రభుత్వం ఆ అల్టిమేటమ్‌ను అంగీకరింపరానిదిగాభావించి, జులై 29 న దాన్ని లాంఛనప్రాయంగా నిరాకరించింది.

ఆగస్టు 6 న ప్రెసిడెంటు ట్రుమన్ ప్రపంచాన్నంతా హడలగొట్టే ప్రకటన ఒకటి కావించాడు: "పదహారుగంటల క్రితం జపాను సైన్యానికి ప్రధాన కూడలి అయిన హిరోషిమాపై అమెరికన్ విమానం ఒక బాంబు వేసింది......అది ఒక అణుబాంబు" అగస్టు 8 న సోవియట్ రష్యా జపాన్‌పై యుద్ధం ప్రకటిస్తూ "జపాన్ లొంగిపోవడానికి నిరాకరించినందువల్ల మిత్రరాజ్యాలవారు జపానుతో సాగుతున్న సమరంలో చేరవలసిందని సోవియట్ ప్రభుత్వానికి ప్రతిపాదన పంపారు" అని తెలియచేసింది. ఆ మరుసటిరోజు రెండవ అణుబాంబు వేయడం జరిగింది. ఈ పరిస్థితులలో బేషరతుగా లొంగిపోవడం తప్ప జపానుకు మరిగత్యంతరం కనుపించలేదు. కాని లాంఛన ప్రాయంగా "వి-జె. డే" సెప్టెంబరు 2 కి గాని సాధ్యంకాలేదు. ఆనాటికి జపాన్ ప్రధాని, సైనిక నాయకులు సంయుక్త రాష్ట్రాల యుద్ధనౌక మిస్సోరీపైన లాంఛన ప్రాయంగా లొంగిపోయినట్లు పత్రాలమీద సంతకాలు చేశారు.

# 4

## చైనాలో విప్లవం

విజయోత్సవదినం లగాయతూ మైత్రి, మనసువిర గుట 1945 వ సంతంలో చైనా మూడు ప్రధానసమస్యలన ఎదుర్కోవలసి వచ్చింది :

చైనాను రెండుగా చీలుస్తూ జపాన్, మంచూరియా నుంచి ఇండోచైనాకు భూమార్గం ఏర్పరచడంతో చైనా సమరం సంరంభంలో తీవ్రంగా వ్యాకులంచెందింది. ఈలోగా చైనా కమ్యూనిస్టులు మాయోపాయాలు, అధికార విస్తరణ నీతి, కొనసాగిస్తూ – తద్వారా ప్రభుత్వాన్ని ఇంకా హడలుగొట్టే టట్లు కనుపిస్తూ, ఆంతరంగిక పరిస్థితిని మరింత విషమంచేస్తూ వచ్చారు. బయటఉన్న సింకియాంగ్ రాష్ట్రంలో కూడా చిక్కులు అలాగేఉన్నాయి. జనవరి ఆఖరున, రాష్ట్రంలో చైనా దళాలకూ కజాక్ దళాలకూ మధ్య చిన్నచిన్న చెదురు పోరాటాలు జరిగి క్రమేణా ఒక భయంకరమైన అంతర్యుద్ధంగా పరిణమించింది.

1945 వేసవిలో చైనా ఎదుర్కొంటున్న ఈ మూడు ప్రధానసమస్యలూ ఏదో విధంగా సోవియట్ విధానాలతో ముడిపెట్టుకునే ఉన్నాయి. త్వరలోనే చైనాలో, సోవియట్ రష్యాతో అనువైన సంబంధాలు సాగించడానికి అనుకూల వాతావరణం అల్లుకున్నది. జూన్ నెల ఆఖరున చైనా ప్రధాని, విదేశాంగమంత్రి అయిన డాక్టర్ టి. వి. సూంగ్ మాస్కో

వెళ్ళడానికి ప్రయాణమయ్యేసరికి, ఆయనకు ప్రెసిడెంట్ ట్రూమన్‌వద్దనుంచి ఒక ఉత్తరంవచ్చింది. అందులో యాల్టా రహస్యసంధిలోని మంచూరియాకు సంబంధించిన నియమాలు ఉన్నాయి. యాల్టా ఒడంబడిక ప్రకారం సంయుక్తరాష్ట్రాల ప్రెసిడెంటు చాంగ్ కై షేక్ ద్వారా మంచూరియాలో రష్యా వారికి వివిధహక్కులను కలిగించడానికి తగిన చర్యలు తీసుకో వలసిఉంది. తక్కిన అన్నివిషయాలకంటె ముందు జపాన్ను ఓడించాలన్న కాంక్షతో చాంగ్ అమెరికా ఒత్తిడికి తలఒగ్గి వీలయినంత ప్రతికూలపరిస్థితిని కల్పించడానికి ప్రయత్నించినట్లు స్పష్టమవుతోంది. మాస్కోలో డాక్టర్ సూంగ్ స్టాలిన్‌తోను, మాలటోవ్‌తోను, రష్యాలో సంయుక్తరాష్ట్రాల రాయబారి. డబ్లు. ఎ. హారిమన్‌తోను ఒకదానివెంట ఒకటి సంభాషణలు సాగించాడు. యాల్టా రహస్యసంధి చర్చలదశలో ఉన్నదనీ సంయుక్తరాష్ట్రాలు మధ్యవర్తిగా పాత్రవహిస్తున్నవనీ సూచించాడు. జులై 17న పోట్సుడామ్‌లో సభజరగడం మూలాన ఈ సంప్రతింపులకు ఆటంకం కలిగింది. డాక్టర్ సూంగ్ తిరిగీ చుంగ్‌కింగ్‌కు వచ్చేశాడు. అక్కడ ఆయన తన విదేశాంగ మంత్రిత్వపదవికి రాజీనామా ఇచ్చాడు. ఆ పదవిలో వాంగ్‌షిహాయ్ నియమితుడైనాడు. సోవియట్ ప్రభుత్వం యాల్టా ఒడంబడికను అధిగమించి మరికొన్ని హక్కులను కోరుతున్నదని అతను నివేదించాడు.

ఆగస్టు నెల మొదట్లో డాక్టర్ సూంగ్, నూతన విదేశాంగమంత్రి డాక్టర్ వాంగ్, ఇంకా అనేకమంది సలహాదార్లతోను, రాజకీయ నిపుణులతోను కలిసి సంప్రతింపులు తిరిగీ

కొనసాగించడానికి మాస్కోకు వెళ్ళారు. జపాన్ ఇప్పుడప్పుడే లొంగిపోయినట్లు కనుపించింది. జపాను శాంతికోసం వేగిరపడు తున్నట్లు ఒక్క సోవియట్ ప్రభుత్వానికి మాత్రమే తెలుసు. ఆగస్టు 10 న జపాను ప్రభుత్వం "అనేక వారాల క్రితమే" తన శత్రువులతో సంధి ఏర్పాట్లు చేసుకోడానికి జపాను సోవియట్ ప్రభుత్వాన్ని ప్రార్థించినట్లు వెల్లడి అయింది. జపాను బేషరతుగా లొంగిపోయిన రోజుననే, అనగా 1945 ఆగస్టు 14 న చైనా-రష్యాలు సఖ్యం నెరపుతూ ఒక సంధిపత్రంపైన, ఇంకా అనేక ఒడంబడికలతోపాటు సంతకాలు చేశాయి.

ప్రధాన సంధి ప్రకారం, ఒప్పందానికి వచ్చిన ఇరు పక్షాలవారూ, జపానుపై విజయం సాధించేవరకూ సమరంలో ఒకరికొకరు, సహాయం చేసుకోవాలనీ, జపాను ఓడిపోయిన తరువాతకూడా జపాను దాడిని అసాధ్యం చేయడంకోసం పరస్పర సహాయాన్ని, సహకారాన్ని కొనసాగించుకోవాలనీ ఖరారు పడ్డారు. అంతేకాక, ఇరుపక్షాలవారూ పరస్పర ప్రభుతను, రాష్ట్రనీతినియమాలను మన్నించుకునేటట్లు, ఒకరి ఆంతరంగిక వ్యవహారాల్లో ఒకరు జోక్యం కల్గించుకోకుండా ఉండేటట్లు, ఇరువురిలో ఎవరికైనా సరే ప్రతికూలంగా ఉండేవారితో ఎంత మాత్రం పొత్తు కలపకుండా ఉండేటట్లు ఏర్పాటుకావించుకున్నారు.

మాలటోవ్ ఒక ప్రకటనపై సంతకంచేసి ప్రకటించాడు. మంచూరియాలోని మూండు తూర్పు రాష్ట్రాలపైన చైనాకుగల సంపూర్ణ సర్వాధికారాన్ని రష్యా గుర్తించిందనీ, ఆరాష్ట్రాల పరిపాలనా సత్వాన్ని రాష్ట్రనీతి నియమాలను మన్నించిందనీ

తెలిపాడు. సింకియాంగ్ రాష్ట్రంతో సహా చైనా ఆంతరంగిక వ్యవహారాల్లో రష్యా జోక్యం కలిగించుకోదనీ, చైనాకు సైనికం గాను భౌతికంగాను ఏ సహాయం అయినా సోవియట్, జాతీయ ప్రభుత్వానికి చైనా కేంద్ర ప్రభుత్వంవలె చేస్తుందనీ హామీ ఇవ్వబడింది. సంధికి అనుబంధగా ఛీఫ్ కమాండర్ స్టాలిను ఒక ప్రకటన చేశాడు. జపాను లొంగిపోయిన మూడువారాల తరువాత సోవియట్ సైన్యాలను మంచూరియానుంచి ఉపసంహరించడం ప్రారంభమవుతుందనీ, ఎక్కువలో ఎక్కువ మూడు నెలలలోగా పూర్తిగా ఉపసంహరించబడతాయనీ ఆయన హామీ ఇచ్చాడు. చైనా విదేశాంగ మంత్రి వాంగ్ వెలుపలి మంగోలియాలో ప్రజలు తమస్వాతంత్ర్యకాంక్షను సర్వజనాభిప్రాయంద్వారా రూఢిచేసుకున్నట్లయితే దాని స్వాతంత్ర్యాన్ని చైనా గుర్తిస్తుందని ప్రకటించాడు. దానికి జవాబుగా మాలటోవ్ "వెలుపలి మంగోలియా ప్రజాప్రభుత్వ రాజకీయ స్వాతంత్ర్యాన్ని, రాష్ట్రీయతిని" రష్యా మన్నిస్తుందని తెలియచేశాడు.

అంచాత చైనా తూర్పురైల్వే, దక్షిణ మంచూరియా రైల్వే – రెండూ కలిసి చైనా–చుంగ్‌చున్ రైల్వే అని పిలువబడేటట్లున్ను, అది 'కేవలం వాణిజ్యయాన సంస్థగా'నిర్వహించబడి వచ్చే 'లాభాలు చైనా రష్యాలు పంచుకునేటట్లున్ను' ఏర్పాటు జరిగింది. రైల్వే జనరల్ మేనేజరుగా రష్యన్ ఉంటాడు. పోతే డైరక్టర్ల బోర్డుకు ప్రెసిడెంటుగా చైనీయుడు ఉంటాడు. జపానుపై రెండుదేశాలూ సంయుక్తంగా సైనిక చర్యలు కొనసాగించవలసి వస్తే ఆసమయంలో తప్ప, లేక

పోతే రష్యన్ సైన్యాలను పంపడానికి రైల్వేను ఉపయోగించ రాదు. తన సైనిక సామగ్రులను సీలుచేసిన కార్లలో, సుంకాధి కార్ల తనిఖీ లేకుండా రైల్వేద్వారా పంపుకునేహక్కు రష్యాకు ఇవ్వబడింది. కాని ఆ సామగ్రుల రక్షణ జాగ్రత్తలు చైనా రైల్వే పోలీసులు స్వీకరిస్తారు. పోర్టు ఆర్థర్‌ను చైనా రష్యాల నౌకాబలాల 'సంయుక్త ఉపయోగార్థం' నౌకాశ్రయంగా వినియోగించాలి. రేవుచుట్టూ విడిగా కొంతమేరన తన సైన్యాన్నిగాని, నౌకాదళాన్నికాని లేక విమానదళాన్నికాని అట్టిపెట్టుకునే హక్కు రష్యాకు ఒసగబడింది. 'ఆ ప్రదేశానికి చెందిన పౌర పరిపాలనమాత్రం చైనా చేతుల్లోనే ఉండాలి...'

డైరెన్ రేవును స్వేచ్ఛగా వదిలిఉంచాలి. అన్ని రాజ్యాల వారూ ఆ రేవులోతమవర్తకంసాగించుకోవచ్చు,నౌకలునిలుపుకో వచ్చు. రేవులో సగభాగానికి చెందిన సిబ్బంది, ఉపకరణాదుల ఏర్పాట్లు ప్రతిఫలంపమీాపుచ్చుకోకుండా ఊరికేనేరష్యాకు గుత్త కివ్వాలి. "డైరెనులో పరిపాలనానిర్వహణభాధ్యత చైనాదే.కాని రేవుకు సంబంధించిన ప్రధానోద్యోగి రష్యను పౌరులలోనుంచి, సహాయోద్యోగి చైనీసు పౌరులలో నుంచి నియమింపబడాలి." జపానుతో యుద్ధంచేసేకాలంలో సోవియట్ బలాలకు చెందిన సోవియట్ ఛీఫ్ కమాండర్‌కు, మంచూరియాలోని యుద్ధ పర గణాలకు సంబంధించిన యుద్ధ వ్యవహారాలన్నీ నిర్వహించే అధికారం, బాధ్యత ఇవ్వబడతాయి. 'అలా అట్టిపెట్టబడిన రాజ్యంలో ఏభాగంలోనైనాసరే ప్రత్యక్షంగా పోరాటం ఆగి పోయినట్లయితే, ఆ పరగణాకు సంబంధించిన పౌరవ్యవహారాల

పైన చైనా రిపబ్లిక్ జాతీయ ప్రభుత్వానికి సంపూర్ణాధికారం ఉంటుంది.

జపాను ప్రభుత్వం నిర్దుష్టమైన భాషలలో తను తప్ప కుండా లొంగిపోతానని తెలియచేసిన తరువాత సోవియట్ ప్రభుత్వం జపానుపై యుద్ధం ప్రకటించింది. దానివల్ల అసలు పోరాడవలసిన అవసరంలేదు. అయినప్పటికీ విజయం తమ చేతుల్లోనే ఉన్నదన్న పూర్తివిశ్వాసంతో సోవియట్ సైనిక బలాలు, విమానబలాలు పూర్తిగా రణరంగంలోకి దూకాయి. ఆమరణాంతం పోరాడతామని ప్రతిజ్ఞచేసి ఉన్మాదులయి ఉగ్రంగాఉన్న జపానుసైన్యాలతో మల్లయుద్ధానికి తలపడటు కలపడ్డాయి. సోవియట్ బలాలు మంచూరియాలోకి ప్రవేశిం చాయి' సమరవ్యూహాగ్రాలను వశపరచుకున్నాయి. సోవియట్ విమానాలు మంచూరియా ముఖ్యపట్టణమైన చాంగ్ చున్‌పైన, హార్బిన్, కిరిన్‌లపైన, ఇంకా ఇతర జపానుసైనిక కేంద్రాలపైన బాంబులు వేశాయి. అగస్టు 14న జపాను లొంగిపోయిన తరు వాత కూడా ముక్డెన్, హార్బిన్, చాంగ్ చున్, పోర్టుఆర్థర్, డైరెన్, ఇంకా ఇతర కేంద్రాలు మొదట సోవియట్ పార మ్యాట్ దళాలచేత, పిమ్మట సోవియట్ సైనికబలాలచేత ఆక్రమింపబడినాయి. ఈలోగా రష్యన్‌సైనిక, నౌకాబలాలు సఖాలిన్ దీవి, కొరియా, కురైల్ దీవులను వశపరచుకున్నాయి. పోట్స్‌డామ్‌లో అప్పటికప్పుడు ఆదుర్దాగాచేసిన ఒక సైనిక నిర్ణయం ప్రకారం, త్వరలోనే కొరియా రెండు పరగణా లుగా విభజింపబడింది. ఉత్తరపరగణా రష్యన్ పరిపాలనక్రిందికీ దక్షిణపరగణా అమెరికన్ పరిపాలనక్రిందికీ వచ్చింది.

చైనా - సోవియట్ స్నేహసంధిప్రకారం త్వరలోనే మంగోలియాలో స్వాతంత్ర్యసమస్యపై ప్రజాభిప్రాయనిర్ణయ (ప్లెబిసైట్) ప్రయత్నాలు జరిగాయి. ప్లెబిసైట్ జరిగేటప్పుడు వేదికలదగ్గర మేనేజర్లుగా అనేకమంది రష్యన్ ఏజంట్లు ఉన్నట్లు తెలిసింది. ప్రతిఓటరూ బ్యాలెట్ పేపర్ మీద (ఓటుకాకితం మీద) తన సంతకంచెయ్యాలి. చివరకు ఓట్లు లెక్కించేటప్పుడు చూస్తే 5 లక్షలమంది ఓటర్లలోనూ ఒక్కఓటర్ కూడా వ్యతిరేకంగా ఓటు చేయలేదు. ఇలా స్వాతంత్ర్యాన్ని సంపాదించుకుని, వెలుపలి మంగోలియా రిపబ్లిక్ మాస్కోలో పరస్పర స్నేహసహకారాలను ఆశిస్తూ ఒక కొత్తసంధిపై సంతకం చేసింది. 1945 అగస్టులో జరిగిన చైనా – సోవియట్ సంధిలో, రష్యాకు మంచూరియాలోని పారిశ్రామిక సంస్థలపై ఎలాంటి హక్కు ఇవ్వబడలేదు. అయినప్పటికీ రష్యాసైన్యం మంచూరియాను ఆక్రమించుకున్నప్పుడు సామ్రాజ్యవాద వ్యతిరేకతకు ఎప్పుడూ ముందునడుస్తామని చెప్పే ఈ సోవియట్ అధికార వర్గం ఆచరణలోకి వచ్చేసరికి అసలయిన సామ్రాజ్యతత్వపు దోపిడీ విధానాన్ని – ఈ క్రింది నగ్నసిద్ధాంతాన్ని అమలులో పెట్టింది : "సామాన్యమైనన్యాయం, అనాదినుంచి వస్తున్న మంచిమార్గం ఒకటే – ఎవడు బలవంతుడో వాడిదే రాజ్యం. ఎవడు నిలబెట్టుకో గలుగుతాడో వాడికే అది దక్కుతుంది." 1945 నవంబరు ఆఖరున న్యూయార్కుటైమ్సు పత్రికలో ఈ విషయంపై స్టెఫాన్ ఆండ్రూస్ ఒక నివేదిక వ్రాసి ప్రకటించారు. దానిప్రకారం మంచూరియాను కొల్లగొట్టడం, చీఫ్

కమాండర్ స్టాలిన్ స్వయంగా ఇచ్చిన ఉత్తర్వుల ప్రకారం జరిగిందనీ, ఆయన అగస్టు 23న (1945) రష్యన్ సైన్యానికి "మంచూరియాలో మీరు కదలించగలిగిన ప్రతి వస్తువూ తీసుకోండి." అని ఆజ్ఞ జారీచేశాడని తెలిసింది. ఇంకా ఆ నివేదికలో మాస్కోనుంచి వచ్చిన 226 మంది నిపుణుల పర్య వేక్షణక్రింద పారిశ్రామిక యంత్రసాధన సముదాయాలు, కర్మాగారాలు ధ్వంసంచేయడం కొనసాగిందనీ, సంయుక్త రాష్ట్ర సైన్యంలో తెలివైన వ్యక్తులు కొందరు ఆ సోవియట్ ఉత్తర్వుల నకళ్ళను, రష్యనులు యంత్రసామాగ్రులను, కర్మా గారాలను, వ్యక్తుల సొంతఇళ్ళను కొల్లగొడుతుండగా తీసిన ఛాయాచిత్రాలను సంపాదించారనీ పేర్కొనబడింది.

1946 ఫిబ్రవరి 5న చాంగ్‌కైషేక్ చుంగ్‌కింగులోని విదేశ విలేఖరులతో, 1945లో జరిగిన చైనా-సోవియట్‌సంధిలో సమ్మతించిన వాటికంటె అధికంగా రష్యాకు ఆర్థిక ఒప్పందాలు ఇచ్చేవిషయంపై సోవియట్‌అధికారులతో అక్రమమైన చర్చలు కొనసాగుతున్నాయని చెప్పాడు. ఫిబ్రవరి 9న సంయుక్త విదే శాంగమంత్రి జేమ్సు బిర్న్సే ఈవిషయంలో సంయుక్తరాష్ట్రాల అభిప్రాయం ఏమిటో తెలుపుతూ చైనాకు, రష్యాకు ఒకేరక మైన లేఖలు పంపాడు. "ఈ ప్రభుత్వం మంచూరియాలోని పరిశ్రమలు మొదలయిన జపానువారి బయటఆస్తులకు సంబం ధించిన తుదిఏర్పాటు విషయంలో, అది అందరికి కావలసిన విషయమనీ, జపానును ఓడించడంలో అధికభారం వహించిన మిత్రరాజ్యాలకు సంబంధించిన విషయమనీ, అమెరికా అభి

ప్రాముపడుతుంది. ..కనుక ఇలాంటి సందిగ్ధతరుణాన మంచూరియాలోని జపానువారి బయటిఆస్థుల విషయంలో—ఆ పారిశ్రామిక ఆస్తులను "సమరంలో కొల్లగొట్టిన ఆస్తులు" గా భావించి వాటిని మంచూరియానుంచి తొలగించడంద్వారాగాని లేక ఆ ఆస్తులను అదుపులో ఉంచుకోడానికి లేక వాటిపై కర్తృత్వం వహించడానికి చైనా-రష్యా ప్రభుత్వాలు ఒడంబడిక చేసుకోడం ద్వారాగాని-ఏలాంటి తుదిఏర్పాటుకావించినా అది చాలా అయుక్తమైనవనే అవుతుంది" అని ఆ ఉత్తరాలలో వ్యక్తపరిచాడు.

అమెరికావారి ఉత్తరానికి చైనా జవాబు పంపింది. ఆ జవాబులో, 1946 జనవరి 21 న ఒక యాదాస్తుపత్రంలో (మెమోరాండం) సోవియట్ప్రభుత్వం, జపాను సైన్యంచే ఉపయోగింపబడిన మంచూరియాలోని జపాను సంస్థలన్నీ కూడా సమరంలో సోవియట్ బలాలు కొల్లగొట్టిన ఆస్తులుగా పరిగణించబడతాయని స్వతంత్ర ప్రతిపాదన చేసిందని వెల్లడించాడు. యుద్ధంలో కొల్లగొట్టిన ఆస్తులు సాధారణంగా అంతర్జాతీయ చట్టంచే గుర్తించబడాలి కనుక ఇవి అలాంటివి కావని, ఈ సోవియట్ ప్రతిపాదనను చైనాప్రభుత్వం త్రోసిపుచ్చింది. మంచూరియాలోని పారిశ్రామిక సంపదను అచ్చటనుండి తొలగించే విషయంలో తన అభ్యంతరాన్ని తెలుపుతూ బ్రిటిష్ ప్రభుత్వం క్రెమిన్‌కు వర్తమానం పంపింది. ఆ లేఖలో "జపనీయుల ఆస్తులు విడుదలచేసేవిషయం, జపానువారివల్ల నష్టపరిహారం పొందే హక్కుగల మిత్రరాజ్యాలమధ్య చర్చించబడాలనీ, పరిష్కరింపబడాలనీ; సదరు ఆస్తులు ప్రభుత్వానికి చెందిన

రాష్ట్రంలో ఉన్నాయని ఆ ప్రభుత్వం వారి స్వాధీనంలోనే అవి ఉండాలనీ" తెలుపబడింది.

తరువాత ఈ దోపిడి ఇంకా అధిక నిష్పత్తిలో ఉన్నట్లు తేలింది. జపాను నష్టపరిహార విచారణసంఘంలో ఉన్న అమెరికా ప్రతినిధి ఎడ్విన్. డబ్ల్యూ. పాలే, మంచూరియాలోని పారిశ్రామికస్థితిగతులను పరిశీలించడానికి కొంతమందితో అక్కడికి వెళ్ళాడు. వెళ్ళి ఒక విపులమైన నివేదిక తయారుచేశాడు. రష్యను ఆక్రమణకాలంలో మంచూరియాకు "భయంకరమైన నష్టం" వాటిల్లింది. "ఏమీ మార్చకుండా నష్టం వాటింపు వేస్తే రెండులక్షలకోట్లు అమెరికా డాలర్లని తేలుతోంది" అని ఆ నివేదికలో తెలియజేశాడు. ఆక్రమణకాలంలో సోవియట్ అధికారులు 30 లక్షల అమెరికాడాలర్ల విలువగల వెండిబంగారాలను, మంచూరియను బ్యాంకులనుంచి 50కోట్ల పైచిలుకు 'మంచూరియన్ యుయాన్ల'ను జప్తుచేసి వశపరుచుకున్నారని నివేదిక వెల్లడించింది.

నాజీ జర్మనీతో జరిపిన యుద్ధంలో సోవియట్ రష్యా విపరీతమైన కష్ట నష్టాలకు గురి అయింది. దీన్నిబట్టి ఆలోచిస్తే జర్మనీనుంచి భారీఎత్తున పారిశ్రామిక సంపదను సోవియట్‌వారు తరలించుకుపోవడం ఒకవిధంగా ధర్మమేనని ఎవరైనా క్షమించవచ్చు. ఏమైనా దూరప్రాచ్యంలో సోవియట్ రష్యా జపాన్‌తో పోరుసలిపింది కొద్దిరోజులుమాత్రమే. మరి చైనా అలాకాదు. అది జపాన్‌తో ఏకధాటిగా ఎనిమిదేండ్లు సమరం సాగించి అంతులేని కష్టనష్టాలకు ఆహుతి అయింది. ఈ వాస్తవాలవల్ల పారిశ్రామిక సంపదను న్యాయంగా మంచూరియాలోనే అట్టి

పెట్టి ఉంచాలని తోస్తుంది. ధర్మంప్రకారం సోవియట్‌వారు వాటిని తరలించుకుపోవడం యుక్తంగా కనుపించదు. అంతర్జాతీయ న్యాయాన్ని బట్టి చూస్తే సోవియట్ ఫిర్యాదు ఇంకా తక్కువ అసమంజసంగా అగుపిస్తుంది. కొల్లగొట్టిన ఆస్తులు జపాన్ యొక్క ప్రభుత్వపుసొత్తులనీ, అంచాత హేగ్ ఒడంబడికలోని భూయుద్ధ ఆచారాలకు, న్యాయాలకు చెందిన 53 వ నిబంధన ప్రకారం వాటిని స్వాధీనం చేసుకునేహక్కు తమకు ఉన్నదని రష్యావాదంలా కనుపిస్తోంది. అయినా ఈవాదం ఎంతమాత్రం నిలవదు. ఎంచాతనంటే రష్యా ఆక్రమించుకొన్న మంచూరియా, శత్రురాష్ట్రం కాదు. అది చైనారాష్ట్రం. 1943 నాటి కెయిరో ప్రకటనలోని షరతులనుబట్టి, 1945 నాటి పోట్సుడామ్ ప్రకటనలోని షరతులనుబట్టి, మంచూరియా తిరిగి చైనాకు చెందాలనీ, మంచూరియాలోని జపాన్ ప్రభుత్వపు ఆస్తులన్నీ దానితోపాటు చైనాకే ఇచ్చివేయబడాలనీ సోవియట్ ప్రభుత్వం స్పష్టంగా ఒప్పుకున్నది.

వి-జె రోజు సెప్టెంబరు 2 అయినందున మంచూరియా నుంచి సోవియట్ బలాల ఉపసంహారణ డిసెంబరు 3 వ తేదీకి పూర్తి కావాలి. మంచూరియాలోని ఖనిజసంపదలను చైనావారు - సోవియట్‌వారు కలిసి అభివృద్ధిపరిచే విషయంలోను, అదుపులో ఉంచుకొనే విషయంలోను సోవియట్ అధికారులు గొంతెమ్మ కోర్కెలు అనేకం కోరారు. ఈ కోర్కెలను నిరాకరించేసరికి రష్యను సైన్యాలను మంచూరియానుంచి తరలించడానికి ఉత్తర్వు లివ్వలేదు. ఫిబ్రవరి వచ్చేసరికికూడా రష్యను సైన్యాలు మంచూరియా గడ్డమీద పూర్వం ఎలాఉన్నాయో

అలాగే ఉన్నాయి. దేశంలో పెద్దపెట్టున ఆగ్రహం చెలరేగింది. వందలు, వేలకొలది విద్యార్థులు, కార్మికులు, వర్తకులు, స్త్రీలు గుంపులు గుంపులుగాచేరి మంచూరియాను సోవియట్లు ఆక్రమించుకున్నందుకు అభ్యంతరం తెలుపుతూ నిరసన ప్రదర్శనలు కావించారు. ఈ ఆపద తలఎత్తడం తెలుసుకుని విదేశాంగ మంత్రి వాంగ్ మార్చి 6 న సోవియట్ ప్రభుత్వానికి లాంఛన ప్రాయంగా ఒక ఉత్తరం పంపాడు. తక్షణం మంచూరియా నుంచి సోవియట్ సైన్యాలను తరలించవలసిందిగా కోరాడు. త్వరలోనే, సోవియట్లు తమ మంచూరియా ఆక్రమణను చైనా ప్రభుత్వంనుంచి అధికమైన ఆర్థిక సౌకర్యాలను నిర్బంధంగా పుచ్చుకునేందుకు ఉపయోగించుకుంటున్నారని తెలియ వచ్చింది. మార్చి 22 న సోవియట్ ప్రభుత్వంనుంచి సమాధానం వచ్చింది. మంచూరియానుంచి సోవియట్ సైన్యాలను తరలించడం ఏప్రిల్ నెలాఖరుకల్లా పూర్తి అవుతుందనీ – అది "ఎక్కువలో ఎక్కువ" గడువనీ తెలిపింది. అయినప్పటికీ ఈ ఆఖరు గడువుకుకూడా వారు తాము అన్నమాట నిలబెట్టుకో లేదు. ఉన్నతాధికారంలో ఉన్న విదేశాంగమంత్రి మాలటోవ్ అంతటివాడు సంయుక్తరాష్ట్ర ప్రభుత్వ కార్యదర్శి జనరల్ మార్షల్‌కు "మంచూరియానుంచి సోవియట్ సైన్యాలను ఖాళీచేయడం 1946 మే 31 నాటికి పూర్తి అవుతుంది" అని ఉత్తరం వ్రాసిపంపాడు.

అంతర్యుద్ధంలో చైనా కమ్యూనిస్టులకు రష్యాచేస్తున్న సహాయం ఎంతో వివాదాస్పదమైన విషయం. ఆ సహాయం యొక్క స్వభావం, దాని పరిమితి అసలు వివాదగ్రస్తంగా

కనుపిస్తుంది. 1949 జూన్ 30న మావ్ సేటుంగ్ ఒక కమ్యూనిస్టుసైనిక ఘనవిజయాన్ని పేర్కొంటూ, 'సోవియట్ యూనియన్‌నుంచి, తదితర ప్రజాస్వామ్యాలనుంచి సహాయం లేకపోయినట్లయితే, చైనాలో కమ్యూనిస్టు విజయం సాధ్యం అయిఉండేది కాదు.' అన్నాడు. సోవియట్ యూనియనులో న్యూ టైమ్సు అనే పత్రికలో 'చైనా ప్రజాతంత్ర రిపబ్లిక్' అన్న శీర్షిక క్రింద ఒక వ్యాసం ప్రచురితమైంది. చైనా కమ్యూనిస్టుల విజయానికి కారణం ఎక్కువభాగం 'సోవియట్ యూనియన్ నాయకత్వాన నడచిన ప్రపంచ ప్రజాస్వామ్యకూటమి బలాలమద్దతే' అని ఆ వ్యాసంలో తెలుపబడింది. రష్యా జపానుతో యుద్ధానికి దిగడం చైనా కమ్యూనిస్టులలో నూతనోత్సాహాన్ని రేకెత్తించింది. అవకాశాన్ని చక్కగా సద్వినియోగం చేసుకునేటట్లు చేసింది. ఆగస్టు 10న, కమ్యూనిస్టుబలాల ఛీఫ్‌కమాండర్ జనరల్ చు-టే, నేరుగా తన బలాలకు జపనీయుల లొంగుబాటును అంగీకరించవలసిందనీ అన్ని బస్తీలు, నగరాలు, వార్తాకేంద్రాలు ఆక్రమించుకోవలసిందనీ ఉత్తర్వు చేశాడు. ఆ మరునటిరోజు నాలుగు సాయుధదళాలను మంచూరియా నడవవలసిందిగా మరొక ఉత్తర్వు జారీ చేశాడు. చాంగ్ కై షేక్, కమ్యూనిస్టుసైన్యాలను ఇక ఎలాంటి స్వతంత్ర చర్య తీసుకోకుండా ఆగవలిసిందిగా ఆజ్ఞాపించాడు. జనరల్ చూ-టే ఒక అలక్ష్యధోరణిని అవలంబించాడు.

ఏమైనప్పటికీ చైనా కమ్యూనిస్టుబలాలు మంచూరియాలో ప్రవేశించడానికి సోవియట్ అధికారులు ఎలాటి అభ్యంతరాన్ని కనుపరచలేదు. 1945 అక్టోబరు 2న మిత్ర

మండలి సైనికోద్యోగులు చైనాలో పత్రికలవారికి, చైనా కమ్యూనిస్టులు బలవంతంగా మంచూరియాలో ప్రవేశించారనీ సోవియట్ బలాలతో సహకరిస్తున్నారనీ చెప్పారు. ఒక కమ్యూనిస్టు అడ్వొకేట్, కమ్యూనిస్టు సైన్యాలు జపానీయుల ఆయుధాలను సంపాదించుకున్నవని ఒప్పుకున్నాడు. నవంబరు నెలాఖరుకు మంచూరియాలో తమకు ప్రజారక్షక సైన్యంతో కలుపుకుని 2 లక్షలమంది జనం ప్రభుత్వ బలాలతో పోరాడ టానికి సంసిద్ధులై ఉన్నారని కమ్యూనిస్టులు బాహాటంగా అంగీకరించారు. మంచూరియాలోని కమ్యూనిస్టు ప్రధాన కార్యాలయ సెక్రటరీ జనరల్, జనరల్ ప్యాంగ్ చెంగ్, కమ్యూనిస్టుల సలహాప్రకారం కొత్తగా ఏర్పాటయిన తొమ్మిది మంచూరియన్ రాష్ట్రాలలోనూ, ఎనిమిదిరాష్ట్రాలలో రాష్ట్ర ప్రభుత్వాలు స్థాపించబడినాయనీ, మంచూరియాలో మూడింట రెండువంతులు స్థానిక ప్రభుత్వాలు కమ్యూనిస్టుల కైవశం అయినాయనీ ఒక నివేదిక అందచేయకలిగాడు. హార్బిన్ ముఖ్యపట్టణంగా ఒక స్వతంత్ర మంచూరియన్ రాజ్యాన్ని కమ్యూనిస్టులు స్థాపిస్తున్నారు

కెయిరో ప్రకటన, చైనా – సోవియట్ ఒడంబడికల ప్రకారం ప్రభుత్వం, మంచూరియాను వశం చేసుకుని దాన్ని చైనా సర్వాధికారం క్రిందికి తీసుకరావడానికి ప్లానుకు నేసరికి ఆపద వచ్చిపడింది. భయంకరమైన సమరం సాగిన పిదపనే ప్రభుత్వబలాలు శత్రుసైన్యాలను చీల్చుకొని మంచూరియాలో ప్రవేశించగలిగాయి. ఈలోగా ప్రభుత్వం సోవియట్ అధి కార్లతో మంచూరియాలో సోవియట్ సైన్యాల ఉపసంహారణ

విషయంలో సంప్రతింపులు నెరపింది. 1946 మార్చి మధ్యలో గాని సోవియట్ బలాలు ముక్డెన్ను ఖాళీచేయడం, అక్కడ చైనా జాతీయబలాలను ఉంచడం జరగలేదు. ఈ ఏర్పాటుకు సంబంధించిన సంప్రతింపులు, చైనాప్రభుత్వ పథకాలను జాగు చేయడానికి సోవియట్లు అవరోధనక విధానం అవలంభించారని వారు అంతగా అనుమానించకుండా ఉండేటట్లు పొడిగించ బడ్డాయి. హార్బిన్, చుంగ్ చున్, ఇంకా ఇతర నగరాలు సోవి యట్లు ఖాళీచేసిన తక్షణమే కమ్యూనిస్టు బలాలచే ఆక్రమిం చుకోబడినాయి. సోవియట్ సైన్యాలను ఖాళీ చేయడానికి ఏర్ప రచుకున్న కాలప్రణాళిక (టైంటేబిల్)తో లంకె పెట్టిన ఒకా నొక సైనికపథకం ప్రకారమే ఈ కార్యం నిర్వహించామని కమ్యూనిస్టులు ఒప్పుకున్నారు.

అప్పుడొకవిషయం స్పష్టంగా దృగ్గోచరమవుతోంది. చైనాకమ్యూనిస్టులు మంచూరియాలో బలాత్కారంగా ప్రవే శించడానికి, అక్కడ వివిధ వ్యూహాత్మగాలను ప్రదేశాలను ఆక్ర మించడానికీ సోవియట్రష్యా సహాయపడింది. వారు జపాను ఆయుధాలు మందుగుండు సామగ్రులు సిద్ధంచేసుకోడంలోను, వారు తమ ప్రతీకక్షుల యొక్క, చైనాప్రభుత్వ బలాలయొక్క గమనాన్ని నిరోధించడంలోను, పథకాలను కుంటుపడేటట్లు చేయడంలోను, వారు తమకు అనుకూలమైన స్థానికపరిపాలనను సాగించుకోడంలోను, సోవియట్ బలాలు ఖాళీచేసిననగరాలలో వారు నేర్పుగా సరైన వేళన ఆక్రమించుకునేటట్లు చేయడంలోను సోవియట్రష్యా తోడ్పడింది.

ఇంతకుపూర్వం డైరెన్‌ను స్వతంత్ర నౌకాశ్రయంగా చేసి చైనా పరిపాలనక్రింద ఉంచడానికి: పోర్టు ఆర్థర్‌ను చైనా రష్యాల "సంయుక్త ఉపయోగార్థం" నౌకాశ్రయంగా చేసి అక్కడ పౌరపరిపాలన చైనాక్రింద ఉంచడానికి రష్యాతో ఒప్పందం అయిందికదా. అయినప్పటికీ సోవియట్ ప్రభుత్వం ఆ రేవులు చైనాసైన్యాల రక్షణక్రింద లేక చైనా పరిపాలన క్రింద ఉండడానికి మూర్ఖంగా నిరాకరించింది. మంచూరియా లోని ఇతరభాగాలు ఖాళీచేసిన తరువాతకూడా ఆ రేవుల్లో సోవియట్ బలాలు ఉంటూనే వచ్చాయి. డైరెన్ రేవు మారిన డినిగురించి చైనా-సోవియట్ సంప్రతింపులు కొనసాగి, త్వర లోనే పరస్పర విరుద్ధాభిప్రాయాలు పొడసూపసాగాయి. చైనా జాతీయసైన్యాలు ఆర్థర్ రేవులో ఉండడానికి ఆటంకపరచడంలో సోవియట్ నెపం ఏమిటీఅంటే, 1945లో జరిగిన చైనా-సోవి యట్ ఒడంబడికప్రకారం మూలరక్షణ సోవియట్ ప్రభుత్వా నికి అప్పగించబడడమే. మాస్కో రేడియోలో టాస్‌నుంచి ఒకప్రకటన వెలువడింది: "జపానుతో చేసుకున్న శాంతి ఒడం బడికకుపూర్వం, డైరెన్ విషయమై జరిగిన చైనా-సోవియట్ ఒడంబడికలోని 4వ నిబంధన ప్రకారం, నౌకాశ్రయమైన పోర్టు ఆర్థర్ ప్రాంతంలో స్థాపించబడిన పరిపాలనక్రిందికే డైరెన్ రేవు కూడా వస్తుందని ఇందుమూలంగా టాస్ సాధికారంగా చెబు తున్నది" చైనా విదేశాంగమంత్రిత్వం, ఆ ఒడంబడికలోని 4వ నిబంధన "జపానుతో యుద్ధంసాగిస్తున్న కాలంలో" మాత్రమే వర్తిస్తుందికాని జపానుతో చేసుకున్న శాంతి ఒడంబడికకు ముందుకాదని తెలిపింది.

, యుద్ధం అనే పదాన్ని సరిగ్గా అర్థం చేసుకోడంలో వచ్చిన వైవిధ్యమే డైరెన్, ఆర్థర్ రేవుల విషయంలో చైనా - సోవియట్ వివాదానికి కారణమైంది. స్థూలమైన అర్థంలో యుద్ధం అంటే భారీఎత్తున జరిగే సాయుధ సమరం. న్యాయమైన అర్థంలో యుద్ధం అనే పదాన్ని [illegible] యుద్ధంయొక్క స్థితిని తెలుపుతూ వాడతారు. యుద్ధం చేసే వారి మధ్య శాంతిసంధిద్వారా అది అంతమవుతుంది. యుద్ధానికి సంబంధించిన ఈ ద్వంద్వభావన న్యాయస్థానాలచేత గుర్తించ బడింది. సాధారణ ఒడంబడిక దేనిమీద ఆధారపడి ఉందో ఆ సూత్రసహాయంతోనే ఈవిషయం అవలోకించడం జరుగుతుంది: అది పరస్పర ప్రభుతను, రాజనీతిని మన్నించుకోడం సోవియట్ యూనియను, మంచూరియా చైనా ప్రభుతక్రింద ఉండడాన్ని ప్రత్యేకంగా గుర్తించింది. ఈ కారణాలవల్ల, వాస్తవ ఆధారం దృష్టిలో పెట్టుకునిచూస్తే - డైరెన్, ఆర్థర్ రేవులు కేవలం మంచూరియా అంతర్భాగాలు. 'యుద్ధం' అనే మాటకు అర్థంచెప్పడంలో వచ్చిన వివాదంలో చైనా భావించి నట్లుగానే దాని అర్థం చెప్పితీరాలి.

సింకియాంగ్ లో చిక్కులు తుదముట్టేటట్లు లేవు. మంచూరియాలో వివాదాలకూ వైవిధ్యాలకూ తోడు, వారు విజయోత్సవదినం తరువాత సంవత్సరాలలో చైనా-సోవియట్ సాధారణ సంబంధాలుకూడా శిథిలమై పోయేటట్లు చేశారు. సోవియట్ తన పవిత్రమైన హామీ ఇచ్చిన తరువాత ఒక నెల అయినదో లేదో, అప్పుడే సింకియాంగ్ వాయువ్యభాగంలో

భారీఎత్తున సంఘర్షణలు ప్రజ్వరిల్లాయి. వాటిల్లో సోవియట్ జోక్యం ఉన్నట్లు కనుపించింది. ఆ ప్రదేశంలోఉన్న చైనా బలాలపై కజక్స్ ఈ సంఘర్షణలు కొనసాగించారు. ఏమైనా కజక్స్‌లో ఇలీనుంచి వచ్చినసేన 6 వేలున్నది. వీరంతా రష్యను భాష మాట్లాడతారు. రష్యను యూనిఫారాలు ధరిస్తారు. వీరిని నడిపేదికూడా రష్యను జనరలే. పిమ్మట సింకియాంగ్‌లో పరిస్థితి చక్కబడి, నిశ్చలమైంది. కాని జూన్ మొదట్లో వెలుపలి మంగోలియానుంచి సాయుధదళాలు రాష్ట్రంపై దాడిచేశాయి. ఆదళాలకు సోవియట్లవని చెప్పబడే విమానాలు తోడ్పడ్డాయి. వెలుపలిమంగోలియా ప్రభుత్వం మాస్కో రేడియోద్వారా ఒక సాధికారప్రకటన చేసింది. తమ సైన్యాలేవీ సింకియాంగ్‌పై దాడి చేయలేదని పేర్కొంటూ, చైనా సైన్యాలే మంగోలియను రాష్ట్రంపై దాడి కావించాయని ఎదురు ఫిర్యాదుచేసింది. దానిని నిరాకరిస్తూ తిరిగీ చైనా, మంగోలియను ప్రభుత్వానికీ, సోవియట్ ప్రభుత్వానికి తన అధిక్షేపణలను తెలిపింది. తుదకు ఈ వివాదం సంయుక్తరాష్ట్రాలు జోక్యం కలిగించుకోడానికి త్రోవతీసింది. కజక్ నాయకులు తూర్పు టర్కీస్తాన్ రిపబ్లిక్ నిర్మాణ ప్రయత్నాలను మానుకోక, సింగియాంగ్ అంతటా తిరుగుబాట్లు, సంఘటనలు తల ఎత్తేటట్లు చేయడంతో సంఘర్షణలు ఏమాత్రం తగ్గుముఖం పట్టలేదు. యుద్ధం తరువాత పరిస్థితులవల్ల 1945 లో జరిగిన చైనా - సోవియట్ ఒడంబడికను బలహీనపరిచే కుట్రలుకొన్ని బయలుదేరినట్లు స్పష్టంగా చూడవచ్చు.

# చైనా అంతర్యుద్ధం, సోవియట్-అమెరికాల ప్రచ్ఛన్నయుద్ధం

విజయోత్సవదినం తరువాత చైనాలో శాంతి నెల కొంటుందనే కొండంతఆశ కొత్తగా రష్యాతో చేసుకున్న సంధిపై ఆధారపడిఉంది. సోవియట్ చర్యలవల్ల ఈ సంధి ఏనాడో పరిహాసాలపాలయింది. చైనాలో శాంతి ఆశించడానికి విజయోత్సవదినం తరువాత ఛీఫ్‌కమాండర్ చాంగ్ కై షేక్, చైనా కమ్యూనిస్టుపార్టీ అధ్యక్షుడు మావ్ సేటుంగ్‌ల మధ్య చుంగ్‌కింగ్‌లో జరిగిన సమావేశం మరొక ముఖ్యమైన ఆధారమైంది.

సంయుక్తరాష్ట్రాల రాయబారి జనరల్ పాట్రిక్ హార్లీని వెంటబెట్టుకుని వెళ్ళి మావ్, చాంగ్‌తోను తక్కిన ప్రభుత్వ నాయకులతోను సమాలోచనలు జరిపాడు. సమావేశం కొంత కొనసాగేసరికి ప్రధానరాజకీయపక్షాలమధ్య ఏర్పడిన ఈ వైరుధ్యాలు సరిచేయబడి చైనాలో శాంతి, ఐకమత్యాలు సాధించడానికి ఒడంబడికకు రావచ్చుననే ఆశలు బాగా కనుపించాయి. అయినప్పటికీ, మూడువారాలు గడిచేసరికి సమావేశం ఒకప్రకటనచేయగలిగింది. అందులో ఆదర్శసూత్రాలైతే అత్యున్నతంగా ఉన్నాయికాని ఆచరణలో వాటివిలువ అతి స్వల్పంగా కనిపించింది. జనరల్ హార్లీ తన మధ్యవర్తిత్వం జయప్రదంకావడానికి పూర్ణప్రయత్నాలు చేశాడు. కాని చుంగ్‌కింగ్‌లో సంయుక్తరాష్ట్ర దౌత్యవర్గంలోని అతనిక్రింది అమెరికన్ ఉద్యోగులు ఆ ప్రయత్నాలు ఫలించకుండా చెడ గొట్టారు. రాజకీయంగా ఒద్దిక ఏర్పరడడం వారికి వాంఛ

నీయంగా లేదు. అదే సమయంలో ప్రభుత్వానికీ కమ్యూనిస్టు బలాలకూ మధ్య ఘర్షణ అనివార్యమై, సంధిమాటలు ఫలించకుండా చేసింది.

1945 అంతంలో సంయుక్త రాష్ట్రాలు, సోవియట్ యూనియన్, గ్రేటుబ్రిటన్‌ల విదేశాంగమంత్రులు ఇతర విషయాలతోపాటు చైనాలో పరిస్థితిపైన చర్చలు సాగించడానికి మాస్కోలో సమావేశమయ్యారు. సమావేశంకడపట చైనాను గురించి ఒక ప్రకటన జారీచేశారు. ముగ్గురు విదేశాంగమంత్రులు "జాతీయ ప్రభుత్వంయొక్క అన్ని శాఖలలోను ప్రజాస్వామిక పద్ధతులు విరివిగా ప్రవేశపెట్టడానికీ, అంతఃకలహాన్ని ఆపు చేయడానికీ, జాతీయ ప్రభుత్వంక్రింద ఒక ఐక్య, ప్రజాస్వామిక చైనాను ఏర్పరచడం అవసరమని" ఒప్పందానికి వచ్చినట్లు ఆ ప్రకటనలో తెలుపబడింది. "చైనానుంచి అమెరికా, సోవియట్ సైన్యాలను ఉపసంహరించాలని కోరడం విషయంలో ముగ్గురు మంత్రులు పూర్తిగా అంగీకారానికివచ్చారని" కూడా ఆ ప్రకటన పేర్కొన్నది. ఈప్రకటనలో ఒక్క విదేశీ సైన్యాలను ఉపసంహరించాలన్న ఏర్పాటును మినహాయిస్తే - తక్కినదంతా కూడాపరిష్కరించవలసిన సమస్యలకు మెలికలుపెట్టే కొన్ని అగాధమైన వివాదాలతో కూడిఉంది. అంచాత ఈ ప్రకటన, ఆశించినట్లు చైనాఅంతరంగిక పరిస్థితిలో సత్ఫలితాన్ని సాధించలేకపోయింది.

ఇంచుమించు ఈ పైప్రకటన జరిగిన సమయంలో సంయుక్తరాష్ట్ర సేనలసిబ్బందికి పూర్వపు ప్రధానోద్యోగి అయిన జనరల్ జార్జి సి. మార్షల్, చైనాకు సహాయం చేయ

డానికీ దేశాన్ని అంతర్యుద్ధంలో ముంచిన రెండు ప్రధాన రాజకీయపక్షాల మధ్య ఏర్పడిన వైరుధ్యాలను వివరించడానికీ అక్కడికి వెళ్ళేందుకు ప్రెసిడెంటు ట్రూమన్‌చే నియమితుడైనాడు. అతను ప్రభుత్వానికీ కమ్యూనిస్టు బలాలకూమధ్య ఒక విరామ సంధిని ఏర్పాటుచేయడంలో కృతకృత్యుడైనాడు. ప్రభుత్వ ప్రతినిధులు, చైనాకమ్యూనిస్టులు ఏకమై పరస్పరసమాలోచనలు చేసుకోడానికి ఒక రాజకీయ సమావేశాన్ని ఏర్పాటు చేసుకున్నారు. మార్చి మధ్యలో జనరల్ మార్షల్ తిరిగీ వాషింగ్‌టన్ వచ్చేశాడు. అక్కడ పత్రికా విలేఖకుల సమావేశంలో కొమిన్‌టాంగ్, కమ్యూనిస్టునాయకులు తమతమ సైన్యాలను జాతీయసైన్యంగా నిర్మించడంలో నిమగ్నులయి ఉన్నారని నివేదించాడు. అమెరికన్ సిబ్బందితో ఒక కార్య నిర్వాహక ప్రధానకార్యాలయం, ఇప్పటికే అందినటువంటి ఒడంబడికలను ఆచరణలో పెట్టేందుకు పీపింగ్‌లో ఏర్పాటు చేయబడిందనీ, ఒక్కొక్కజట్టుకు ముగ్గురుచొప్పున—ఒక అమెరికను, ఒక కొమిన్‌టాంగువ్యక్తి, ఒక కమ్యూనిస్టుగల జట్లు వివిధప్రాంతాలలో ఒడంబడికలను అమలుజరిపేందుకు నిర్మింపబడ్డాయనీ తెలిపాడు.

మార్షల్ నివేదిక అందించిన కొద్దికాలానికి, మంచూరియానుంచి తమ సైన్యాలను ఉపసంహరించడానికి నిర్ణయించుకున్నట్లుగా సోవియట్ అధికారులు ప్రకటించారు. అందుమీదట ఖాళీకాబోతున్న కీలక కేంద్రాలకోసం జాతీయ బలాలు, కమ్యూనిస్టుబలాలు తెగించి నీవా నేనా అంటూ పందానికి దిగాయి. ఒడంబడికలను త్రోసిరాజనడానికి మరో

ముఖ్య మూలకారణం, రాజకీయ సంస్కరణకు, సైనిక పున ర్నిర్మాణానికి ఏర్పరచబడిన కాలనిర్ణయంపై పరస్పర విరుద్ధ మైన దృక్పథాలు. కమ్యూనిస్టులు మొదట రాజకీయ సంస్క రణ, తరువాత సైనిక పునర్నిర్మాణం జరగాలని పట్టుబట్టారు. ప్రభుత్వమేమో రాజకీయ సంస్కరణకంటె సైనిక పునర్ని ర్మాణం ముందుజరగాలన్నది, కాబట్టి పని స్తంభించిపోయింది. ఇరుపక్షాలమధ్య అగాధమైన అనుమానం, అవిశ్వాసం ఏర్పడి నట్లు స్పష్టంగా వెల్లడిఅయింది.

1945 డిసెంబరు 15 న ఒక ప్రకటనలో ప్రెసిడెంటు ట్రూమన్ ఇలా పేర్కొన్నాడు: "సంయుక్తరాష్ట్రాలు, తక్కిన సంయుక్తరాజ్యాలు ప్రస్తుతంఉన్న చైనారిపబ్లిక్ యొక్క జాతీయప్రభుత్వంమాత్రమే చట్టబద్ధమైన చైనాప్రభుత్వమని గుర్తించాయి...యుద్ధకాలంలో. చైనా రిపబ్లిక్ జాతీయప్రభు త్వంతో నెరపిన ఎడతెగని సన్నిహిత సహకారాన్ని కొనసా గిస్తూనూ, పోట్సుడామ్ ప్రకటనతో పొందిక కుదుర్చు కుంటూనూ చైనాలో మిగిలిఉన్న జపాను ఆధిపత్యాన్ని తొలగించడానికి సంయుక్తరాష్ట్రాలు తోడ్పడ్డాయి. అలాగే విముక్తిపొందిన ప్రాంతాలలో జపానుసైన్యాల నిరాయుధీకర ణకు, ఖాళీచేసి వెళ్ళేందుకు జాతీయప్రభుత్వానికి సంయుక్త రాష్ట్రాలు సహాయపడతాయికూడా."

చైనాలోని అమెరికనుబలాలు అంతర్యుద్ధంలో ప్రభు త్వానికి సహాయంచేస్తున్నాయని చైనాకమ్యూనిస్టులు విసుగు, విరామంలేకుండా, పదేపదే ఆరోపిస్తూవచ్చారు. ఇక సోవి యట్లుకూడా ఈ విషయంలో వెనువెంటనే సంయుక్తరాష్ట్రాలు

నేరంచేశాయంటూ వేలుపెట్టి చూపించసాగారు. ఆ విధంగా చైనా, సంయుక్తరాష్ట్రాలు-సోవియట్ యూనియనుల మధ్య సాగే ప్రచ్ఛన్నయుద్ధానికి రంగస్థలం అయింది. సోవియట్ ఉద్యోగులు, సోవియట్ పత్రికలు, రేడియోకూడా కోమిన్ టాంగుకు అమెరికాచేస్తున్న సైనికసహాయాన్ని విమర్శించాయి. చైనాను మళ్ళీ వెనక్కు నెట్టే "ఒక అర్ధ వలసరాజ్య దేశ" స్థితికి తెస్తున్నారని సంయుక్తరాష్ట్రాలపై ఆరోపణ చేశాయి. జాతీయ ప్రభుత్వానికి అమెరికా సైనికసహాయం చేయడం "చైనా అంతరంగిక వ్యవహారాల్లో ప్రత్యక్షంగా జోక్యంకలిగించుకోడమే" నని దెబ్బలాడాయి. సెప్టెంబరు 14, 15 తేదీలలో చౌన్ఎన్‌లే, జనరల్ మార్షల్‌కు సుదీర్ఘమైన లేఖలు వ్రాసిపంపాడు. వాటిల్లో తక్షణం చైనానుంచి అమెరికనుసైన్యాలు ఉపసంహరించబడాలనీ, కోమిన్‌టాంగు ప్రభుత్వానికి అన్నిరకాల అమెరికా సహాయం ఆపుచేయబడాలనీ గట్టిగా నొక్కి చెప్పాడు.

ఈలోపున చైనాలో సోవియట్‌రష్యా అనుసరిస్తున్న విధానంపై అమెరికన్లు దెబ్బలాడుతూనే వచ్చారు. దూరప్రాచ్యంలో తనిఖీకి వెళ్ళివచ్చిన తరువాత సెనేట్ సభ్యుడు ఓవెన్ బ్రూయిస్టర్ తన దేశస్థులకు ఇలా చెప్పాడు: "అమెరికను నావికులు 'సోవియట్ నియంతృత్వంధాటివలన భవిష్యత్తులో చైనా అమెరికాతో కలిసిఉండదని, దృఢపరిచే నిమిత్తమై చైనాలో ఉన్నారు." చైనానుంచి తిరిగివచ్చిన తరువాత అమెరికనుప్రతినిధి ఫ్రెడ్ యల్. క్రాఫోర్ట్ ఇలా చెప్పాడు: "మనం అక్కడికి చొచ్చుకువెళ్ళి, కట్టుదిట్టంగా పనిచెయ్యనన్నా చెయ్యాలి, లేదా పూర్తిగా వెనక్కు తిరిగివచ్చేసి

పర్యవసానాలను అనుభవించాలి. మనం రెండో విధానాన్ని కనుక అనుసరించినట్లయితే, రష్యా లోపలికి ప్రవేశించి సంయుక్త రాష్ట్రాలకు వ్యతిరేకంగా చైనాను రష్యను ఆధిపత్యం క్రిందికి తెచ్చుకుంటుంది" సైనికవ్యవహారాల ఉపసంఘంవారు దూర ప్రాచ్యంనుంచి తిరిగివచ్చి ఇలా ప్రకటించారు : "రష్యా చైనాను తన అదుపులో పెట్టుకోవాలని కోరుతోంది. అక్కడ మధ్య వర్తిత్వపాత్రను వదులుకోవలసిందిగా సంయుక్తరాష్ట్రాలను ఒత్తిడిచేయడానికి యత్నిస్తోంది. రష్యా, చైనాకమ్యూనిస్టు సైన్యాన్ని రహస్యంగా మద్దతు ఇస్తోంది. జనరల్ జార్జి సి. మార్షల్‌తో చేసుకున్న యుద్ధవిరమణ సమాధానాలను భగ్నం చేయవలసిందిగా కమ్యూనిస్టు నాయకులను ముళ్ళతో పొడిచి నట్లుగా పొడుస్తోంది." మంచూరియాలోను ఇంకా తక్కిన చైనాలోను సోవియట్‌రష్యా సాగించే కుతంత్రాలకు సంబంధిం చిన విషయాలకు ఇంకా అనేక ఉదాహరణలున్నాయి. అవన్నీ కూడా అమెరికను దినపత్రికల్లోనూ వార, పక్షపత్రికలు చాలా వాటిల్లో చూడవచ్చు.

ఈ తరుణంలో చాంగ్‌కై షేక్ పరిస్థితిని చక్కపరచడా నికి ప్రయత్నం చేశాడు. కొమిన్‌టాంగు ఏకపక్షపరిపాలనను అంతమొందించాలనీ, దాన్నే శాంతికి కొత్త పునాదిగా చూపుతూ, జనవరి 10న జరిగిన విరామసంధి, రాజకీయసమా లోచన సమావేశంలో జరిగిన ఇతర ఒడంబడికలు శిథిలమై పోకుండా నిలబడేందుకు ఒక షట్సూత్రకార్యక్రమాన్ని ప్రతిపా దిస్తూ ప్రకటన చేశాడు. దానిపై సంప్రతింపులు జరిగాయి. కమ్యూనిస్టు ప్రతినిధి చౌ ఎన్ లే సమావేశంనుంచి నిష్క్రమి

మించాడు. ఈ సమయాన, స్నేహ, వాణిజ్య సంబంధాలు నెరపుతూనూ, జాతీయ శాసనసభసమావేశం జరపాలనేనూ చైనా-అమెరికాలు నవంబరు 4న ఒడంబడికపై సంతకాలు చేయడంతో కమ్యూనిస్టులకు ప్రభుత్వంయెడలగల వ్యతిరేకవైఖరి మరింత ఎక్కువయింది. కొత్తగా సంతకాలయిన ఈ ఒడంబడికను కమ్యూనిస్టులు చాలా తీవ్రంగా విమర్శించారు. ఇది చైనా ప్రజలను బానిసలుగా చేయడానికి అమెరికను సామ్రాజ్య తత్వపు సాధనం అని చెప్పారు. ఇక జరుగనున్న జాతీయసమావేశపు మహాసభ విషయంలో అది ఒక అక్రమమైన చర్య అనీ, ఆ నాటకాన్ని యావత్తూ నడిపేది కొమింటాంగేననీ, దాని ప్రధానోద్దేశమల్లా నామకః ఏదో ఒక రాజ్యాంగ విధానాన్ని ఆమోదించి తద్వారా చాంగ్ కై షేక్ నియంతృత్వాన్ని కొనసాగించడమేననీ కమ్యూనిస్టులు చెప్పారు.

డిసెంబరు 18న చైనాపట్ల సంయుక్తరాష్ట్ర విధానాన్ని గురించి ప్రెసిడెంటు ట్రూమన్ ఒక ప్రకటన కావించారు. అందులో ఇలా చెప్పాడు : "...మేం చైనా జాతీయప్రభుత్వాన్ని గుర్తిస్తాం. కనుక మేం చైనాపట్ల రూఢియైన, వాస్తవమైన విధానాన్నే కొనసాగిస్తాం. చైనా జాతీయ ప్రభుతను పూర్తిగా మన్నిస్తాం. చైనాప్రజలలో సంప్రదాయంగా వస్తున్న మా మిత్రత్వం అలాగే కొనసాగిస్తాం..." సంయుక్తరాష్ట్రాల విధానాన్ని చౌ ఎన్ లే చాలా చమత్కారంగా ఆక్షేపించాడు. 1945 డిసెంబరులో అగ్రరాజ్య నాయకత్రయం మాస్కోలో చేసిన ప్రకటనలతాలూకు సూత్రాలకు ఈ విధానం వ్యతిరేకంగా ఉన్నదని ఖండించాడు. 1947 ప్రారంభ

మధ్యేసరికి జనరల్ మార్షల్ తిరిగి వాషింగ్టన్ వచ్చేశాడు. తను వెళ్ళినపని విఫలమయిందని తెలుపుతూ జనవరి 7న ఒక ప్రకటన చేశాడు. శాంతిని భంగపరుస్తున్నందుకు చైనాలోని రెండు ప్రధాన రాజకీయపక్షాలను తీవ్రంగా విమర్శించాడు.

జనవరి ఆఖరున,నాడు జనరల్ మార్షల్ నాయకత్వాన నడుపబడుతున్న విదేశాంగశాఖ, సంయుక్తరాష్ట్ర ప్రభుత్వం యొక్క నిర్ణయాన్ని ప్రకటించింది : చైనాలో తమ మధ్యవర్తిత్వపు ప్రయత్నాలను ఇంతటితో ముగించడానికీ, పీపింగు లోని కేంద్రకార్యనిర్వాహక కార్యాలయంనుంచి, త్రైరాజ్య ఉపసంఘంనుంచి తాము తప్పుకోడానికి నిర్ణయించినట్లు తెలిపింది. ఈ చర్యలు చైనాపట్ల చేతులు కడుక్కున్న విధానాన్ని గట్టిగా సూచిస్తున్నాయి. చైనా కమ్యూనిస్టులకు చక్కని వీలు, ప్రోత్సాహం కలిగించినట్లు కనిపిస్తున్నాయి.

మార్చి 10 న ఐరోపా సమస్యలమీద మాస్కోలో జరిగిన విదేశాంగమంత్రుల సభ ప్రారంభ సమావేశంలో, మొలటోవ్ అకస్మాత్తుగా చైనా పరిస్థితినిగురించి చర్చించాలని ప్రతిపాదించాడు. చర్చాకాలంలో చైనాప్రతినిధి ఎవరూ ఉండ కూడదనికూడా అన్నాడు. చైనా విదేశాంగమంత్రి వాంగ్షీ అందుకు తీవ్రంగా అభ్యంతరం తెలుపుతూ ఒక ప్రకటన చేశాడు. యుయాన్ శాసనాధ్యక్షుడు సన్‌ఫోకూడా ఈ ప్రతి పాదనకు తన ఆక్షేపణ తెలుపుతూ ... "చైనా పాల్గొనకుండా పెద్దలు నలుగురూ తమ సమావేశంలో ఎలాంటినిర్ణయం

చేయరాదు. చైనా ఒక అంతర్జాతీయం వలస దేశం కాదు." అని పేర్కొన్నాడు. తక్కిన విదేశాంగమంత్రులు కూడా ఇలాగే తమ అభ్యంతరం తెలిపినందున మాలటోవ్ ప్రతిపాదనను వదిలివేయడం జరిగింది.

చైనాను అడ్డంపెట్టుకుని మాలటోవ్ వేసిన రాజ్య తంత్రపు ఎత్తుగడకు- తరువాత త్వరలోనే ప్రెసిడెంటు ట్రుమన్ తన రాజనీతి చతురతతో ఫిరంగిగుండు పేల్చినట్లు ఒక ప్రకటన చేశాడు. అప్పటినుంచీ దాన్ని ట్రుమన్ సిద్ధాంతం అని వ్యవహరిస్తూ వచ్చారు. మార్చి 12 న ఆయన తన ప్రకటనలో కాంగ్రెస్‌కు ఇలా తెలియచేశాడు : "ప్రపంచంలో ఎక్కడ అవసరమైతే అక్కడ మధ్యన జోక్యం కలిగించుకుని కమ్యూనిస్టు ప్రేరితమైన నిరంకుశ పరిపాలనకు స్వతంత్ర ప్రజానీకం లొంగిపోకుండా ఆటంకపరచడానికి సంయుక్తరాష్ట్ర ప్రభుత్వం తన జాతీయ ప్రాభవమును, ప్రాముఖ్యమును వెచ్చిస్తుందని అమెరికా ప్రెసిడెంటు ఇందుమూలంగా ప్రతిపాదిస్తున్నాడు. ఒకవారం తరువాత, దాంతో ఏకీభవించినట్లుగానో, లేక ట్రుమన్ సిద్ధాంతం తనకు సహాయపడగలదనే సంతోషం వల్లనో చైనా ప్రభుత్వం ఒక అద్భుతమైన ధైర్యసాహసాలు ప్రదర్శించింది. పది సంవత్సరాల పైకాలంనుంచీ చైనా కమ్యూనిస్టులకు ముఖ్యపట్టణంగా ఉన్న యెనాన్‌ను పట్టుకున్నది. యెనాన్ పోవడంతో కమ్యూనిస్టులు తమ ప్రతిష్టను చాల మటుకు కోల్పోయారు. వారు ఒక ఆయువుపట్టును, ఒకముఖ్య ప్రచారకేంద్రాన్ని పోగొట్టుకున్నవారయ్యారు.

జాతీయవాదుల పరాజయ సమయంలో

సోవియట్ రాజ్య తంత్రం

1947 వసంతంలో జాతీయసైన్యాలు కమ్యూనిస్టుల ముఖ్యపట్టణమైన యెనాన్‌ను కైవసం చేసుకోడంతో పెద్ద సంచలనం బయలుదేరింది. కాని వ్యూహరచనాదులు, సైనిక సంపద కమ్యూనిస్టులకే చాలా బలంగా, అనుకూలంగా ఉన్నట్లు కనిపించింది. కారణాలు ఏవైనా, మంచూరియాలో కమ్యూనిస్టులు క్రమేణా పైచెయ్యి సంపాదించుకున్నారు. యెనాన్ శాసనాధ్యక్షుడు సన్‌ఫో, మంచూరియా సోవియట్ ఆధిపత్యం కిందికి పోవచ్చునని గంభీరమైన హెచ్చరికచేశాడు. సంయుక్త రాష్ట్రాల సహాయాన్ని గట్టిగా అభ్యర్థించాడు. సంయుక్త రాష్ట్రాలు వారి అభ్యర్థనను లక్ష్యపెట్టలేదు. చాంగ్‌కై షేక్ కమ్యూనిస్టులతో వ్యవహరించడానికి చాలా బలీయమైన కఠినచర్యలకు పూనుకో నిశ్చయించుకున్నారు. జాతిజాతి సంతతినీ సంబోధిస్తూ ఒకసుదీర్ఘోపన్యాసం కావించాడు. కమ్యూనిస్టులను నిందిస్తూ, వారిపై అంతటాయుద్ధం ప్రకటించాడు.

ఇంచుమించు ఈ సమయంలోనే, చైనా కమ్యూనిస్టులకు సహాయం చేస్తున్నందుకు సోవియట్‌యూనియన్‌పై ప్రాధికార నిందారోపణలు వెల్లడి అవటం మొదలుపెట్టాయి. ఛీఫ్ కమాండర్ చాంగ్‌షేక్‌కై సిబ్బందికి ప్రధానోద్యోగి అయిన జనరల్ చ్యాన్‌చ్యాంగ్ నాన్‌కింగ్‌లో ఒకప్రకటన చేశాడు. మంచూరియాలోని ష్పెపింకాయ్‌వద్ద కమ్యూనిస్టుసైన్యాలకు

కనీసం ముప్పయిఒక్కమంది రష్యన్ సలహాదార్లున్నారనీ, కమ్యూనిస్టు సైన్యాలను మంచూరియానుంచి షాన్‌టుంగ్‌కు పంపడంలో సోవియట్లు తోడ్పడుతున్నారనీ తెలిపాడు. 1948 ఉగాది సందేశంలో ఛీఫ్‌కమాండర్ చాంగ్‌కై షేక్ స్వయంగా చైనా ప్రజలకు, సోవియట్ రష్యా చైనా కమ్యూనిస్టులకు సహాయం చేస్తున్నదని సూచనగా—అయినా - స్పష్టపడేటట్లు తెలియచేశాడు ఇంకా ఆయన ఇలా అన్నాడు: "ఈప్రస్తుత కమ్యూనిస్టు ప్రమాదం లోపల్నుంచి ఎంతవస్తున్నదో వెలుపల్నుంచికూడా అంతే వస్తున్నది." జాతీయోద్యోగులే సోవియట్‌యూనియన్‌పై ఇలాటి నేరారోపణలు చేసినప్పుడు, సోవియట్‌అధికార్లు తమ మటుకు తాము వాటిని కాదన్నారు. 1947 డిసెంబరు 30 తేదీ గల పీపింగ్‌లోని ఒక అసోసియేటెడ్ ప్రెస్ వార్తప్రకారం, పీపింగ్‌లోని సోవియట్‌మంత్రి, సెర్జి టిఖ్విన్స్కి ఆరోజున ఇలా చెప్పినట్లు తెలిసింది: "నాప్రభుత్వం చైనాలో ఒకే ఒక ప్రభుత్వాన్ని గుర్తించింది — అది జాతీయప్రభుత్వం—నా ప్రభుత్వం కమ్యూనిస్టులకు ఏవిధమైన సహాయం చేయడంలేదు."

1947 చివరభాగంలో మంచూరియాలోని కమ్యూనిస్టులు ఎడతెగకుండా పురోగమిస్తూ వచ్చారు. ఈలోగా, పరిస్థితి అంతకంతకూ విషమించిపోవడం చూచి ప్రెసిడెంటు ట్రూమన్ జనరల్ ఆర్బర్టు వెడ్ మేయెర్‌ను తన ప్రత్యేక రాయబారిగా నియమించి అతన్ని చైనాలో "వాస్తవ పరిస్థితులు తెలుసుకుని రమ్మని" పంపాడు. చైనా కమ్యూనిస్టులు జనరల్ వెడ్ మేయెర్‌ను తీవ్రంగా ఎదుర్కొన్నారు. అతను సామ్రాజ్య

తత్వంతో 'ముమ్ముందు ఇంకా పోరాటం పొడిగించే' దురుద్దేశం పెట్టుకుని వచ్చాడని నిందించారు. వెడ్ మేయెర్ రాకవల్ల జాతీయవాదులు తమ జాతీయ సమరంపట్ల అమెరికన్లు తిరిగీ ఆసక్తి చూపుతున్నారని సంతసిల్లారు. జనరల్ వెడ్ మేయర్ ఒక్క ప్రభుత్వోద్యోగులతోనే కాక, వివిధ సమాజకూటముల నాయకులనుకూడా కలుసుకుని సంభాషణలు జరిపాడు. సంయుక్త రాష్ట్రాలకు తిరిగి వెళ్ళేముందు ఒక ప్రకటన జారీ చేశాడు. అందులో కమ్యూనిస్టులు ప్రజలపై తమ సిద్ధాంతా లను బలవంతాన రుద్దుతున్నారని నిందిస్తూ, సైనికబలం దాని మటుకు అది కమ్యూనిజాన్ని వదల్లేకపోతున్నదనీ, చైనాకు కావలసిన ఉత్తేజకరమైన నాయకత్వం కొరవడిందని" నొక్కి చెప్పాడు. ఈ ప్రకటన నాన్‌కింగ్ ప్రభుత్వానికి చాలా ఆశా భంగం కలిగించింది. తరువాత త్వరలోనే విదేశాంగమంత్రి వాంగ్, సంయుక్త రాష్ట్రాల రాయబారికి ఒకఉత్తరం వ్రాశాడు. ప్రభుత్వం, కమ్యూనిజాన్ని కేవలం బలవంతాన త్రోసివేయ డానికి యత్నించడంలేదనీ, యుద్ధకాలంలో ఆర్థికంగా దెబ్బ తిన్నందువల్ల చైనా తన సహజసంపదను పూర్తిగా సద్విని యోగం చేసుకోడానికి ఆటంకం ఏర్పడిందనీ ఆలేఖలో ప్రత్యే కంగా ఉల్లేఖించాడు. ఏమైనా జనరల్ వెడ్ మెయర్, ప్రెసి డెంటు ట్రుమన్‌కు అందచేసిన తన నివేదికలో కడపటి నిశ్చి తాభిప్రాయం వెల్లడిస్తూ, జాతీయ ప్రభుత్వానికి పుష్కలంగా సహాయం జరిగితీరాలనీ, అది సఫలంకాగలదనీ పేర్కొన్నాడు.

ప్రధాన సైనికయాత్ర మధ్య, ప్రభుత్వం తన రాజకీయ కార్యకలాపాల్లో ముందంజవేసి రాజ్యాంగబద్ధమైన ప్రజాస్వా

మ్యాన్ని స్థాపించింది. చాంగ్ కై షేక్ అధ్యక్షుడుగాను, లీట్సుంగ్-జెన్ ఉపాధ్యక్షుడుగాను ఎన్నికయ్యారు. తన ప్రారంభోపన్యాసంలో అధ్యక్షుడు చాంగ్ చైనా ప్రజలకొక విజ్ఞప్తి చేశాడు. వాళ్ళను మేల్కొలిపి కమ్యూనిస్టులకు వ్యతిరేకంగా కూడగట్టడానికి యత్నించాడు: "ప్రస్తుతపు సైనిక దండయాత్ర ప్రజాస్వామ్యానికీ నిరంకుశత్వానికీ మధ్య, ఐక్య శక్తులకూ అనైక్యశక్తులకూ మధ్య, దేశభక్తులకూ దేశద్రోహులకూ మధ్య, స్వేచ్ఛ వాంఛించే ప్రజలకూ దౌర్జన్యపరులకూ మధ్య, చైనా ఒక స్వతంత్ర రాజ్యంగా కొనసాగాలని కోరేవారికీ దాన్ని లోబరుచుకోవాలని చూచేవారికీ మధ్య సాగుతున్న ఒక మహాసమరం" అని ఆయన పేర్కొన్నాడు.

ఈలోగా పరిస్థితి స్పష్టంగా జాతీయవాదులకు ఎదురు తిరిగింది. వారి ఆశా జ్యోతి అటూ ఇటూ కొట్టుకులాడడం మొదలుపెట్టింది. జులై 9న 137 మంది యుయాన్ శాసన సభ్యులు ఒక తీర్మానం ప్యాస్ చేశారు. "ప్రపంచమంతా చైనా అంతర్యుద్ధంలో నిమగ్నమై ఉన్నదని నమ్ముతున్నది. కాని అది తప్పుడు అభిప్రాయం. వాస్తవానికి చైనీయులు మాస్కో చేత నడుపబడుతున్న కమ్యూనిస్టు కలహానికి వ్యతిరేకంగా పోరాడుతున్నారు." అని ఆ తీర్మానం తెలిపింది. 1948 చివరభాగంలో జాతీయవాదులు మంచూరియాను పోగొట్టుకోడంతో పాటు, ఇంకా చాలా ఆపదలకు అపజయాలకు గురిఅయినారు. కమ్యూనిస్టులు తమ సైన్యాలను 'మహాకుడ్యాన్ని' (గేట్ వాల్స్) దాటించి ఉత్తర, మధ్య చైనాలలోకి ప్రవేశపెట్టారు.

ఇలాంటి అసహాయపరిస్థితిలో జాతీయవాదులు తిరిగి

సహాయంకోసం సంయుక్తరాష్ట్రాలవైపు చూచారు. ఇంతకు మునుపు, 1948 ఏప్రిల్ 3న సంయుక్తరాష్ట్ర కాంగ్రెస్ చైనాకు సహాయంగా 46 కోట్ల 30 లక్షల డాలర్ల ధనం కేటాయిస్తూ ఒక బిల్లు ప్యాస్ చేసింది. అయినా ఆ మొత్తంలో 12 కోట్ల 50 లక్షలు మాత్రమే ఆయుధాలకు, సైనిక పరికరాలకు ఉపయోగించాలి. తారతమ్యాన్ని బట్టి ఇంత చిన్న మొత్తంకూడా వెంటనే అవసరానికి ఉపయోగించడం జరగలేదు. డిసెంబరు మొదట్లోగాని సంయుక్తరాష్ట్రాలనుంచి మొదట ఆయుధనౌక రాలేదు. మంచూరియాను కోల్పోయిన వెంటనే అధ్యక్షుడు చాంగ్, ప్రెసిడెంటు ట్రుమన్‌కు 1948 నవంబరు 9న ఒక లేఖ వ్రాశారు. వేగిరంగాను, ఇంకా ఎక్కువగాను సైనికసహాయాన్ని అందచేయమనీ, జాతీయవాదానికి మద్దతు ఇవ్వడమే అమెరికా విధానమని తెలుపుతూ ఒక దృఢమైన ప్రకటన చేయవలసిందనీ, సైనికవ్యూహాలు పన్నడంలో సహాయంచేసేటందుకు ఒక ఉన్నతశ్రేణికి చెందిన సైనికోద్యోగిని పంపవలసిందనీ కోరాడు. తరువాత కొద్దికాలానికే రాయబారి వెల్లింగ్‌టన్‌కూ, చతుర్ముఖాలుగా చర్య జరపవలసిందని ప్రేరేపిస్తూ ప్రెసిడెంటు ట్రుమాన్‌కు ఒక కార్యక్రమం అందజేశాడు: 1. చాంగ్‌కై షేక్‌కు మద్దతు ఇస్తున్నట్లు తక్షణమే ప్రకటించడం. 2. జాతీయబలాలకు ఇంకా త్వరత్వరగా సప్లయిలు అందించడం. 3. ఆ బలాలను నడపడంలో సహాయం చేయడానికి ఒక మిలిటరీనాయకుణ్ణి నియమించడం. 4. మూడుసంవత్సరాల పైకాలం సహాయంగా మూడులక్షల కోట్ల డాలర్లు మంజూరు చేయడం. కాని ఈ కార్యక్రమానికి

అనుకూలమైన జవాబురాలేదు. అంచాత డిసెంబరు 15న చైనాప్రభుత్వం యుయాన్ కేంద్రంవారు తమకు ఇంకా ఎక్కువ సహాయం కావాలని అర్థిస్తూ సంయుక్తరాష్ట్ర కాంగ్రెస్‌కు నేరుగా ఒక విజ్ఞప్తి చేసింది. ఈ విజ్ఞప్తికి కూడా అనుకూలమైన సమాధానం రాలేదు. ఆ తరుణంలో జాతీయ వాదులకు సహాయం చేయడాన్ని వ్యతిరేకిస్తూ ప్రజాభిప్రాయాన్ని స్పష్టంగావలికే ఒకానొక ప్రబలమైన ప్రచారం సంయుక్తరాష్ట్రాల్లో సాగుతున్నది. ఈ వ్యతిరేకతకు చైనా కమ్యూనిస్టులపట్ల గల సానుభూతి, జాతీయవాదులతో అసంతృప్తి చెందడం, లేక చైనాకు సంయుక్తరాష్ట్రాలు సహాయం చేయడంవల్ల, గ్రేట్‌బ్రిటన్‌కు, ఐరోపాకు సంయుక్తరాష్ట్రాల సహాయం తగ్గిపోతుందని భయపడడం — ఇలాంటి వివిధ రాజకీయ కారణాలున్నాయి. సంయుక్తరాష్ట్ర ప్రభుత్వం యోచించిన మీదట తాము ఇంత మిక్కుటమైన పరిమాణంలో సహాయం చేయాలనీ, మధ్యాజోక్యం కల్గించుకోడం తమకు అపాయమనీ, ఇంతాచేస్తే తుదకు ఫలితం ఏమవుతుందో చెప్పలేమనీ భయపడి కూడా ఉండవచ్చు. కారణం ఏదైనా సంయుక్తరాష్ట్ర ప్రభుత్వం 1948 చివరభాగాన జాతీయవాదులుచేసిన అత్యవసర విజ్ఞప్తులను అంతగా పట్టించుకోలేదు.

తన న్యూయార్కు (1949) సందేశంలో అధ్యక్షుడు చాంగ్, జాతీయసైన్యాలయొక్క స్థితి సురక్షితం చేసేదయినట్లయితే, రాజ్యాంగానికి వ్యతిరేకం కానట్లయితే అంతర్యుద్ధాన్ని అంతమొందించవలసిందిగా శాంతికాముకులకు నొక్కి చెప్పాడు. జనవరి 14న మావ్ సేటుంగ్ చాంగ్‌కై షేక్ యొక్క

సంధిషరతులు మోసంతో కూడినవని చెప్తూ వాటిని తిరస్క రించాడు. తాను ఎనిమిది ఎదురు ప్రతిపాదనలు చేశాడు. దాంతో చాంగ్ తన అధ్యక్షపదవికి రాజీనామా ఇచ్చాడు. తరువాత ఉపాధ్యక్షుడు లీట్సుంగ్-జెన్ కమ్యూనిస్టులతో సంప్ర తింపులు కొనసాగించాడు; వారు ప్రభుత్వ ప్రతినిధివర్గానికి కొన్ని శాంతిషరతులు అందించారు. అవి అంతర్యుద్ధం ప్రారం భించడం నేరమేనని ప్రభుత్వం ఒప్పుకోడం, నాన్‌కింగ్ రాజ్యాం గాన్ని రద్దుచేయడం, ప్రభుత్వంయొక్క న్యాయసరళిని రద్దుచే యడం, ప్రభుత్వ సాయుధబలాలన్నింటినీ పునర్నిర్మించడం. ఈ షరతులు మింగుడుపడనంత కటికి విషపుమాత్రలుగా భావించి నాన్‌కింగ్ ప్రభుత్వం వీటిని నిరాకరించింది. కమ్యూనిస్టుబలాలు చాలా వడిగాను, కచ్చితంగాను సంవత్సరాంతం అయ్యేసరికి చైనా నడిగడ్డను జయించాయి జాతీయ ప్రభుత్వంయొక్క స్థానం ఒకచోటికి మారిమారి, తుదకు 1949 డిసెంబరు 9 న టెయివాన్ [ఫార్మోజా] లోని టాయ్‌పీలో స్థిరపడింది.

ఈ ముఖ్యకాలంలో క్రెమిలిన్, చైనా కమ్యూనిస్టు పార్టీల మధ్య సరిగ్గా ఏం జరిగిందో చెప్పాలంటే, సహజంగానే ఆ రహస్యం ఇనుపతెరల వెనకాల దాగిఉందని చెప్పాలి. ఏమైనప్పటికీ చైనా కమ్యూనిస్టునాయకులు సోవియట్ యూని యన్‌తో తరుచు తమ ఏకత్వాన్నే ప్రదర్శిస్తూ వచ్చారు. యుగోస్లావ్ కమ్యూనిస్టుపార్టీని కోమిన్‌ఫారం ఎదుర్కొడంలో వారు బలంగా మద్దతుఇచ్చారు. 1949 మార్చిలో కమ్యూ నిస్టు నవచైనా వార్తాసంస్థ ఇలా ప్రకటించింది: "యుద్ధాతురులైన అమెరికన్ సామ్రాజ్యవాదులను తమకు ప్రాణాంతకమైన శత్రు

వుటుగాను, సోవియట్ యూనియన్‌ను తమకు నిరంతరం ప్రాణస్నేహితుడుగాను చైనా భావిస్తోంది.” తరువాత 1949 జూన్‌లో మావ్ సేటుంగ్ తన ‘ఏకైకాశయ’ విధానాన్ని ప్రకటిస్తూ ఒక అంతర్జాతీయ సమష్టిఉద్యమాన్ని ఏర్పాటు చేయడానికిగాను చైనా సోవియట్‌యూనియన్‌తోచేరి తీరాలని చెప్పాడు.

అంతర్యుద్ధం నడుస్తున్నంతకాలం – మొదటినుంచి చివర దాకా సోవియట్ ప్రభుత్వం జాతీయవాద ప్రభుత్వంతో తన రాజ్యతంత్ర సంబంధాలను నెరపుతూనే వచ్చింది. 1949 వసంతంలో కమ్యూనిస్టుబలాలు టీన్‌ట్సిన్, పీపింగ్, నాన్‌కింగ్, షాంగై మొదలయిన నగరాలను తదితర పట్టణాలను ఒకటి దానివెంట ఒకటి వశపరుచుకున్నప్పుడు ఆ పట్టణాలలో ఉన్న సోవియట్ రాజ్యతంత్రజ్ఞులు, ప్రతినిధుల శాఖకు చెందిన ఉద్యోగులు తమ ఉద్యోగవిధులను వదులుకొనడమో, లేదా జాతీయ వాదులతోపాటు తిరోగమించడమో చేస్తూ ఉండే వారు. అలాంటి ప్రవర్తన సోవియట్ రాజ్యతంత్రజ్ఞులయిన వారికే సరిపోయింది. అందుకు వెనకాల కొన్ని ప్రత్యేక కారణాలు ఉండిఉండవచ్చు. (1) సోవియట్ యూనియన్‌కు చైనా కమ్యూనిస్టులతో సంబంధంలేదన్న భావనను కలిగించడానికీ (2) సోవియట్ ప్రభుత్వం రాజ్య చతురతతో కచ్చితంగా వ్యవహరించగలదనీ ఎప్పుడూ ఏ ఒడంబడికనుకూడా ఉల్లంఘించదనీ నమ్మేటట్లు చేయడానికీ (3) చైనాలోఉన్న తదితర దేశాల రాయబారుల, ఏజంట్ల కార్యాలయాలు మున్ముందు మూసివేయడానికి ఇదొక దృష్టాంతరంగా చూపడానికీ

(4) వీలయినంతకాలం జాతీయ ప్రభుత్వంతో సంబంధాలు నెరపుతూవచ్చి, దాని దగ్గరనుంచి వీలయినన్ని సౌకర్యాలను, హక్కులను పుచ్చుకోడానికీ — ఇవే ఆ కారణాలు కావచ్చు.

1949 ప్రారంభంలో సోవియట్లు సింకియాంగ్‌లో వైమానిక సౌకర్యాలే కాక పైగా, వాణిజ్యాన్ని పొడిగించు కోడానికి, నూనెకంపెనీలు గనులకంపెనీలు స్థాపించుకోడానికి సంప్రతింపులు మొదలుపెట్టారు. వాటికి వెంటనే చైనా ప్రభుత్వం జవాబు ఇచ్చింది. శాంతి ప్రతినిధులలో ఒకడుగా జనరల్ చాంగ్ చీ-చుంగ్ నియమితుడైనాడు. అప్పుడు జనరల్ చాంగ్ వాయువ్యాన ఒక ప్రముఖవ్యక్తి. అతను సింకియాంగ్ విష యంలో సోవియట్ ప్రభుత్వంతో ఒక నూతన వ్యవహారం నడిపి తద్వారా చైనా కమ్యూనిస్టులకు వ్యతిరేకంగా సోవియట్ యూనియన్ అభిప్రాయం గిరున తిరిగిపోయేటట్లు చెయ్యవచ్చు ననుకున్నాడు. మనకు తెలిసిన భోగట్టాప్రకారం మధ్య ఆసియా నుంచి జపాను సముద్రందాకా సాగిన సోవియట్‌సన్నని పేలిక వంటి అనుకూలమైన మండలాన్ని ఒకటి ఏర్పాటు చేయ డమే ఆ ప్రతిపాదించిన పథకమని తెలిసింది.

సంప్రతింపులు ఏవిధంగానూ ముందుకు సాగలేదు. జాతీయవాద ప్రభుత్వానికి అనువుగా కాలం గడిచిపోతున్నట్లు కనుపించింది.

1949 అక్టోబరు 1 వ తేదీన చైనా నూతన రిపబ్లిక్‌గా ప్రకటించబడింది. ఆ మరుసటిరోజు సోవియట్ ప్రభుత్వం తన రాజ్యతంత్రపు ముసుగు తీసివేసి నూతన ప్రభుత్వాన్ని గుర్తిం చింది. కొన్నివారాల తరువాత, నవంబరు 15 న వ్యాయత్న

ప్రభుత్వంలో ప్రధాని, విదేశాంగమంత్రి అయిన చౌ ఎన్ లే ఐక్యరాజ్యసమితి జనరల్ అసెంబ్లీ అధ్యక్షుడికి ఒక లేఖ వ్రాసి పంపాడు. సంయుక్తరాష్ట్రాలకు వెళ్ళే చైనా జాతీయవాద ప్రతినిధివర్గం చైనాకు ప్రాతినిధ్యం వహించలేదనీ, చైనా ప్రజల పక్షాన దానికి మాట్లాడేహక్కు లేదనీ ఆ లేఖలో పేర్కొన్నాడు.

# 5

## ఐక్యరాజ్య సమితికి సోవియట్ యూనియన్‌పై ఫిర్యాదు

**1948** మొదటిభాగంలో, అంతర్యుద్ధం ముమ్మరంగా కొనసాగుతున్నప్పుడు, కమ్యూనిస్టు పురోగమనం వెనకాల సోవియట్ ప్రభావం ఉన్నదన్న అనుమానాన్ని, సోవియట్ ప్రభుత్వం – చైనాలమధ్య జరిగిన ఒడంబడికలోని విధుల విషయంలో సంయుక్తరాష్ట్రాల అగ్రనాయకులు అవలంబించిన వైఖరివల్ల జాతీయనాయకులు తమ పలుకుబడిని మరింత దృఢ పరుచుకోగలిగారు. జూన్ 2న, సోవియట్ రష్యా ఒడంబడిక లను ఎలా అల్లంఘించిందో తెలుపుతూ ప్రభుత్వశాఖ అంద చేసిన ఒక పత్రాన్ని అమెరికా సంయుక్తరాష్ట్ర సెనేట్‌సభ విడుదలచేసింది. ఆ పత్రంప్రకారం, 1945 అగస్టు 14 న జరిగిన చైనా – సోవియట్ సంధిలోని 6 వ నిబంధనను సోవియట్ ప్రభుత్వం ఉల్లఘించింది; మంచూరియాలోని కొన్ని పరి శ్రమలను నిర్మూలించింది. మరికొన్నింటిని నష్టపరిచింది. జపాన్ వారి సేలూకు ఆయుధాలను చైనా కమ్యూనిస్టులకు ఇచ్చి,

తాను చైనా కేంద్రప్రభుత్వానికి ప్రత్యేకంగా సహాయం చేస్తానన్న ఖరారును భగ్నపరిచింది. డైరెన్ రేవులో చైనా ప్రభుత్వం తన పరిపాలన నెలకొల్పడానికి చేసే ప్రయత్నాలను ఆటంకపరిచి ఆవిధంగా డైరెన్ ఒడంబడికకు కట్టుబడి ఉండ కుండా పోయింది. నిరాయుధీకరణను గురించి సంయుక్త రాష్ట్రా లలో చర్చలుసాగుతున్నప్పుడు చైనా ప్రతినిధి టి. యఫ్. ట్సెయాంగ్ ఆ విషయానికి సంబంధించిన అసోసియేటెడ్ ప్రెస్ వార్త ఒకటి ఉదహరించాడు. దాన్నిబట్టి జపాన్ విదేశీ కార్యా లయంవారు 50 వేలమంది జపనీయులను సోవియట్ యూని యన్ యుద్ధ ఖైదీలుగా పట్టుకున్నదని అంచనా వేసినట్టు, వాళ్ళకు చైనా కమ్యూనిస్టులు ఉద్యోగాలిచ్చినట్లు తెలుస్తోంది. సంవత్సరం ఆఖరున ప్రెసిడెంట్ ట్రూమన్ ఇలా చెప్పాడు: "సోవియట్ ప్రభుత్వంతో ఒడంబడికలు పవిత్రంగా లేవు. పోట్స్‌డామ్‌వద్ద నేను రష్యన్‌లతో కొన్ని నిర్ణీతమైన ఖరార్లు చేశాను. అందులో ఒక్కటికూడా వాళ్ళు నిలుపుకోలేదు. అలాగే యాల్టావద్ద కొన్ని ఖరార్లు చేశాను, అందులో ఒక్కటి కూడా వాళ్ళు నిలుపుకోలేదు."

1949 మే 20 న, నాన్‌కింగ్ చైనా కమ్యూనిస్టుల చేతుల్లో పడిపోయినప్పుడు, చైనా యుయాన్ శాసనసభ అంత ర్యుద్ధంతో ఐక్యరాజ్యసమితి మధ్య వర్తిత్వాన్ని కోరవలసిందని మంత్రివర్గాన్ని అడుగుతూ, 1945 ఒడంబడికను ఉల్లంఘించి నందుకు సోవియట్ ప్రభుత్వంపై నేరారోపణ చేసింది. శాసన సభ ప్రధానోప సంఘాధ్యక్షుడు సెప్టెంబరు 28 న, చైనా ప్రతి నిధి వర్గంనుంచి సమితి జనరల్ ఎసెంబ్లీ అధ్యక్షుడికి వచ్చిన

ఒక ఉత్తారాన్ని ఆయన బయటపెట్టాడు. చైనా ప్రభుత్వానికీ సోవియట్ యూనియన్‌కూ మధ్య వివాదం అనే ఒక కొత్త అంశాన్ని సమితి జనరల్ అసెంబ్లీ నాలుగవ సమావేశపు కార్యానుక్రమణిక (ఎజెండా) లో చేర్చవలసిందిగా ఆ ఉత్తరంలో కోరబడింది. దానిమీదట విషిన్స్కి ఈ ప్రతిపాదన వెనకాల ఒక ఉద్దేశం ఉన్నదన్నాడు. ఇది వాస్తవంగా సోవియట్ యూనియన్‌ను దూషిస్తూ ఎదురొడ్డడమేననీ, సంయుక్త రాష్ట్రాల దుర్బోధవల్లనే ఇదిజరిగిందనీ స్థిరీకరించి చెబుతూ, దానిప్రకారం ఈ నూతనాంశాన్ని ఎజెండాలో చేర్చడానికి అభ్యంతరం తెలిపాడు. చివరకు ఈ అంశాన్ని జనరల్ అసెంబ్లీ నాలుగవ సమావేశపు ఎజెండాలో చేర్చేందుకు సిఫార్సు చేయడానికి, అభిప్రాయార్థం తొలికమిటీవారికి పంపడానికి నిర్ణయం జరిగింది.

ఈ సిఫార్సు జనరల్ అసెంబ్లీ 230వ సమావేశపు మరుసటిరోజు ప్రవేశపెట్టబడింది. సిఫార్సు చేయబడిన అంశం ఈవిధంగా వ్రాయబడింది: "సోవియట్ సోషలిస్టు రిపబ్లికుల సమితికీ చైనా రిపబ్లికులమధ్య 1945 అగస్టు 14న జరిగిన పరస్పరస్నేహ సహకారసంధిని సోవియట్‌యూనియన్ ఉల్లంఘించడంవల్ల, సంయుక్తరాష్ట్రాల - ఫర్మానాను సోవియట్ యూనియన్ ఉల్లంఘించడంవల్ల చైనా రాజకీయస్వాతంత్ర్యానికి, రాష్ట్రసీతికి; దూరప్రాచ్యంలోని శాంతికి కలిగిన భయాలు." చైనా ప్రతినిధి ట్సియాంగ్ చర్చప్రారంభిస్తూ, ఈ చర్చలోఉన్న విషయాన్ని చైనా తనంతటతాను స్వేచ్ఛగా కోరి, నిర్ణయించుకుని ప్రదిపాదించిందేకాని సంయుక్తరాష్ట్రాల

ప్రమేయంవల్ల కాదని తెలియచేశాడు. 1945లో జరిగిన చైనా-సోవియట్ ఒడంబడిక దానికి అనుబంధించిన ఒడంబడికలూ యాల్టా ఒడంబడికను సఫలీకృతం చేయడంకోసమే జరిగాయని ప్రత్యేకంగా ఆయన పేర్కొన్నాడు. ఏమైనప్పటికీ సోవియట్ యూనియన్ తను చేసుకున్న ఒడంబడికలకు బద్ధురాలై ఉండలేదనీ, వాటిని మన్నించలేదనీ చెబుతూ ఆయన, చైనాకు ఆర్థికసహాయం చేయడానికి మారుగా సోవియట్ యూనియన్ సైన్యం మంచూరియాలోని పారిశ్రామిక సంస్థలను చాలా వాటిని తొలగించివేసిందనీ, చైనా కేంద్రప్రభుత్వానికి నైతికంగా మద్దతుఇచ్చి, సైనికసహాయం చేయడానికి మారుగా సోవియట్ యూనియన్ చైనాలో కమ్యూనిస్టు తిరుగుబాటుకు ప్రత్యక్షంగాను పరోక్షంగాను, నైతిక భౌతిక సహాకారం చేసిందనీ; మంచూరియాలో చైనా ప్రభుతను మన్నించడానికి మారుగా సోవియట్ప్రభుత్వం డైరెన్ రేవును చైనా కేంద్ర ప్రభుత్వం ఉపయోగించుకోకుండాను అక్కడ పరిపాలన ఏర్పరచకుండాను ఆటంకపరిచిందనీ నేరారోపణ చేశాడు. ఈ ఉల్లంఘనలే ఐక్యరాజ్యసమితి సూత్రాల ఉల్లంఘనలు కూడా అవుతాయని దెబ్బలాడాడు..

దీనికి తక్షణమే సోవియట్ ప్రతినిధివర్గంనుంచి, యుగోస్లావియానుంచికూడా ఆక్షేపణ బయలుదేరింది. అప్పుడు సంయుక్తరాష్ట్రాలకుచెందిన వారెన్ ఆస్టిన్, విషిన్స్కీ ధోరణిని ఎదుర్కొంటూ ఒక అంశాన్ని ఎజండా ముందు పెట్టడానికి పూర్వం, మొదట అది నిరూపించబడాలని చెప్పాడు. తాను

సిఫార్సుకు అనుకూలంగా ఓటు చేస్తానని ఆయన ప్రకటించాడు. తుదకు సిఫార్సుని ఆమోదించి, విచారించే బాధ్యత ప్రథమోపసంఘానికి అప్పగించడానికి నిర్ణయించారు.

ప్రథమోపసంఘం 1949 నవంబరు 25న జరిగిన తన 338వ సమావేశంలో చైనా ఫిర్యాదునుగురించి విచారించడం మొదలుపెట్టింది. మొదట మాట్లాడే అవకాశాన్ని విషిన్స్కీ తీసుకున్నాడు. సోవియట్ యూనియనుకు సంబంధించినంత వరకూ చైనాలోగాని, దూరప్రాచ్యంలోగాని శాంతిని విచ్ఛిన్నం చేయడం జరగలేదనీ, అసలు తాను చైనా ప్రజలకు ప్రాతినిధ్యం వహిస్తున్నానని దరఖాస్తు చేయడానికి కొమింటాంగు ప్రభుత్వానికి హక్కే లేదనీ విషిన్స్కీ దెబ్బలాడాడు. చైనా విజ్ఞాపనను విచారించే విషయంలో తన ప్రతినిధివర్గం పాల్గొనదనీ, అంతే కాక ఆవిషయంలో చేసే నిర్ణయాన్ని కూడా తాము లెక్కలోకి తీసుకోమనీ అతను పేర్కొన్నాడు. యుక్రేనియా, పోలెండ్ జెకొస్లొవేకియా—ఈ ప్రతినిధు లందరూ కూడా విషిన్స్కీని సమర్థించారు. యుగోస్లావియా ప్రతినిధివర్గం కూడా విషిన్స్కీ చెప్పిందే చెపుతూ, చైనాకు ప్రాతినిధ్యం వహించే హక్కు లేని ఒకానొక ప్రతినిధివర్గంచే ప్రతిపాదింపబడిన ఈ అంశాన్ని అసలీ ఉపసంఘంవారు విచారించడమేమిటి అన్న ప్రశ్నను లేవనెత్తాడు. దీనికి సమాధానంగా సభాధ్యక్షుడు, చైనాకు ప్రాతినిధ్యం వహించే హక్కు విషయంలో ఏ సవాలుని అయినాసరే జనరల్ అసెంబ్లీకి పంపాలనీ, ప్రస్తుతం ఈ ఉపసంఘంలో ప్రాతినిధ్యంవహించే చైనా ప్రతినిధివర్గమే సరైనదిగా గుర్తించబడుతుం

దనీ ఉద్ఘాటించాడు తరువాత ఆయన ఈ అంశంమీద చర్చ ప్రారంభించడానికి ట్సియాంగును పిలిచాడు.

ట్సియాంగ్ సోవియట్ యూనియనుపైన చైనా అభియోగాన్ని ముందుపెడుతూ, మొదట ఐక్యరాజ్యసమితి నియమావళిలోని రెండవ నిబంధనను పేర్కొన్నాడు. ఆ నిబంధన ఇది: "సభ్యులంతా తమ అంతర్జాతీయ సంబంధాలలో, ఏరాజ్యంయొక్క రాజకీయ స్వాతంత్ర్యానికీ, లేక రాష్ట్రసీతికీ ప్రతికూలంగా బలాత్కారపద్ధతులు ప్రయోగించబడినా, బెదరింపులు చేయబడినా వాటిని ఆపుచెయ్యాలి...సభ్యులంతా... ఈ నిబంధనప్రకారం తాము ఆమోదించిన ఈ విధులను సద్బుద్ధితో, విశ్వాసంతో సఫలీకృతం చెయ్యాలి." చైనాలో సోవియట్ చర్యలు, సమితి నియమావళియొక్క అసలు అంతర్థాన్నీ, అవతారికను, ఒకటవ నిబంధనను, రెండవ నిబంధనను ఉల్లంఘించినవిగా ఉండడమే అసలు తన ప్రభుత్వంయొక్క వివాదమని ఆయన కమిటీవారితో చెప్పాడు.

1945 చైనా – సోవియట్ ఒడంబడికను, దానికి అనుబంధించిన ఒడంబడికలను ప్రస్తావిస్తూ, వీటిప్రకారం సోవియట్ బాధ్యతలు మొత్తంమీద నాలుగువిధాలుగా ఉన్నాయని పేర్కొన్నాడు. అవి ఇవి: (1) జాతీయప్రభుత్వాన్నే చైనా కేంద్ర ప్రభుత్వంగా భావిస్తూ దానికి పూర్తిగా నైతిక సహకారం, భౌతికంగా సహాయంచేయడం. (2) మంచూరియాపై చైనాకుగల సంపూర్ణాధికారాన్ని మన్నించడం, దాని రాష్ట్రసీతిని, పరిపాలనాన్యాయన్ని గుర్తించడం. (3) మంగోలియా ప్రజాతంత్ర రిపబ్లిక్ యొక్క రాజకీయ స్వాతంత్ర్యాన్ని, రాజ

నీతిని మన్నించడం (4) సింకియాంగ్ అంతరంగిక వ్యవహారాల్లో జోక్యం కలిగించుకోకుండా వైదొలగి ఉండడం. ఈ బాధ్యతలేవీకూడా సోవియట్ యూనియను నెరవేర్చలేదని ఆయన చెప్పాడు.

తన ఆరోపణలను నిరూపించడానికి, ఈ ఉపసంఘం ఎదుట ట్సియాంగ్ తన ప్రసంగాన్ని కొనసాగిస్తూ "చైనా కేంద్రప్రభుత్వం మంచూరియాలో తన జాతీయాధికారాన్ని పునఃస్థాపించే విషయంలో సోవియట్ యూనియన్ ఆటంక పరుస్తూ ఎలాంటి చర్యలకు, కార్యక్రమాలకు దిగింది" చెప్పడానికే "సోవియట్ మిలటరీకి సంబంధించిన అంకెలు, వాస్తవాంశాలు; మంచూరియాలోని చైనా కమ్యూనిస్టులకు చేసిన ఆర్థిక సహాయానికి సంబంధించిన వివరాలు" సంగ్రహంగా తెలపడానికే పూనుకున్నాడు. సోవియట్ యూనియన్ చైనా కమ్యూనిస్టులకు తమ ఆయుధాలేకాక జపనీయుల ఆయుధాలు కూడా ఇవ్వడంద్వారాను, వారి సైన్యాలకు సైనికోద్యోగులకు తర్ఫీదు ఇవ్వడంద్వారాను, జపాన్ యుద్ధఖైదీలను వాళ్ళ ఉద్యోగాల్లో పెట్టుకోడానికి వీలుకలిగించడం ద్వారాను, వారి సైనికచర్యల్లో పాల్గొనడానికి తమ స్వంత సైనికబలాలను పంపించడంద్వారాను, వారు తమ సహజసంపదలను అభివృద్ధి పరుచుకునేందుకుగాను విస్తృతంగా ఆర్థిక, సాంకేతిక సహాయం చేయడం ద్వారాను, వారి యంత్రపరిశ్రమలు, రాకపోకల మార్గాలు యథాస్థితికి తీసుకరావడం ద్వారానూ సహాయంచేసిందని కమిటీవారితో చెప్పాడు. తరువాత ట్సియాంగ్ మంచూరియాపైన సోవియట్ పన్నిన ఆర్థికపథకాలను గురించి

ఆలోచించవలసిందని అడిగాడు. ఇలా అడిగి వెంటనే జరిగిపోయిన విషయమైనా—పారిశ్రామిక ఆస్తులను సోవియట్ తొలగించడాన్ని గురించి ప్రస్తావించాడు. జపనీయుల నష్టపరిహార విషయంలో ఎడ్విన్. డబ్ల్యూపాలే అందజేసిన నివేదికను ఉదహరించాడు. ఈ నివేదిక ప్రకారం "మంచూరియానుంచి సోవియట్ సైన్యం తొలగించుకపోయిన ఆస్తి మొత్తం విలువ 80కోట్ల అమెరికను డాలర్ల"ని చెప్పాడు

ఇక వెలుపలి మంగోలియా విషయంలో ట్సియాంగు, సోవియట్ ఉద్యోగులు వెలుపలి మంగోలియా సేనను నడుపుతున్నారనీ, "స్వతంత్రరాష్ట్రం అని చెప్పబడే ఈ రాష్ట్రంలో రాజకీయ, పరిపాలనా యంత్రం యొక్క అన్ని భాగాలతోను" వారు పీఠం పెట్టుకుని ఉన్నారని పేర్కొన్నాడు. సింకియాంగు ఆంతరంగిక వ్యవహారాల్లో సోవియట్ జోక్యం కలిగించుకోడాన్ని గురించి మాట్లాడుతూ ట్సియాంగు, సోవియట్ యూనియన్ కలతలు పుట్టిస్తున్నదనీ, అక్కడ ఒక తూర్పు టర్కీస్తాన్ రిపబ్లిక్‌ని స్థాపిస్తున్నదనీ చెప్పాడు. రాష్ట్ర, రాజకీయ విస్తరణ కోసం సోవియట్ యూనియన్ ఏబదవ అంగదళాన్ని తన నూతన ఆయుధంగా ఉపయోగిస్తున్నదనీ, చైనా కమ్యూనిస్టుపార్టీ "పూర్తిగా మాస్కో నాయకుల చేతులలోని కీలుబొమ్మ" అనీ ఆయన చెప్పాడు. జాతీయవాద ప్రభుత్వానికి అంటగట్టిన అనేక ఆరోపణలను, అవినీతిని స్పష్టంగా ఖండించడానికి ప్రయత్నిస్తూ ట్సియాంగు, "తరతరాలబట్టీ పోగుచేయబడిన" దారిద్ర్యం చైనాలో గూడుకట్టుకున్నదనీ, అలాంటి దారిద్ర్యాన్ని కూడా లక్ష్యపెట్టకుండా చైనా ప్రభుత్వం జపానుదాడిని ఎదుర్కొని

సుదీర్ఘమైన సమరం కొనసాగించిందనీ, ఇంతకూ చైనా ప్రభుత్వానికి సంయుక్తరాష్ట్రాలు చేసిన సహాయం 12 కోట్ల 50 లక్షల డాలర్లు మాత్రమేననీ, అదే సమయంలో సంయుక్త రాష్ట్రాలు గ్రీసుకు 31కోట్ల 80 లక్షల డాలర్లు సహాయంచేశాయనీ వివరించాడు.

తుదకు చైనా ప్రతినిధి, తనప్రభుత్వం మంచూరియాలో తన అధికారాన్ని పునః ప్రతిష్ఠించుకునే ప్రయత్నాలను ఆటంకపరిచినందుకు సోవియట్ యూనియన్‌పై జనరల్ అసెంబ్లీ వారు ఒక తీర్పును ప్రకటిస్తారని ఆశించాడు. సభ్యులుగా ఉన్న అన్ని రాజ్యాలవారికీ ఇకముందు చైనా కమ్యూనిస్టులకు సైనిక, ఆర్థిక సహాయంచేయకుండా ఉండవలసిందని జనరల్ అసెంబ్లీ సిఫార్సు చేస్తుందని ఆశించాడు. "చైనా కమ్యూనిస్టులచే నిర్వహింపబడే ఏ పరిపాలనతోకూడా, సమితి సభ్యులుగా ఉన్న ఏరాజ్యంవారూ రాజకీయ సంబంధాలకు సమ్మతించకుండా ఉంటారని"కూడా అతను ఆశించాడు. ఈమూడు ఆశలుకూడా తరువాత ఒక చిత్తు తీర్మాన రూపంలో వ్రాసి విచారించే నిమిత్తం ప్రథమోపసంఘానికి అందచేయ బడింది. ఆ తీర్మానంలో సభ్యులుగా ఉన్న అన్ని రాజ్యాలవారినీ "చైనాలో ఉన్న ప్రస్తుత పరిస్థితిని అవకాశంగా తీసుకుని ఎవరూకూడా చైనా పరిపాలనా నీతికి, రాష్ట్రనీతికి, రాజకీయ స్వాతంత్ర్యానికి విరుద్ధమైన ఎలాంటి పనికీ పూనుకో కూడదని" గట్టిగా కోరవలసిందిగా కూడా విజ్ఞప్తి చేశాడు.

పిమ్మట మూడురోజులకు రెండవ సమావేశం జరిగింది. అందులో ప్రధాన ప్రాసంగికుడు సంయుక్తరాష్ట్ర ప్రతినిధి

వర్గానికి చెందిన ఫిలిప్ జెస్సూప్. ఆయన సుదీర్ఘమైన ఉపన్యాసం చేస్తూ, సోవియట్ యూనియనుకు డైరెన్ రేవులోను, చైనా తూర్పురైల్వే, దక్షిణ మంచూరియా రైల్వేలపైనను, పరిమితమైన హక్కులు మంజూరు చేయాలని సంయుక్తరాష్ట్రాల అభిప్రాయమైనట్లు చెప్పాడు. అంతేకాని సోవియట్ యూనియన్ డైరెన్ ప్రాంతాన్ని రైల్వేలను పూర్తిగా అదుపులో పెట్టుకోవాలని చూడడంద్వారాను, ఉత్తర రాష్ట్రంలో కీలుబొమ్మ పరిపాలనలు స్థాపించడంద్వారాను ఆ సర్వాధికారానికి హాని కలిగిస్తుందని ఎన్నడూ అనుకోలేదన్నాడు. ఇలా ప్రసంగించి తుదకాయన ఒక సమష్టి తీర్మానం ముసాయిదా ఉపసంఘంవారికి అందచేశాడు. ఆతీర్మానాన్ని సంయుక్త రాష్ట్రాలతోపాటు, ఆస్ట్రేలియా, మెక్సికో, పాకిస్తాన్, ఫిలిప్పైన్సు దేశాలు బలపరిచాయి. తీర్మానంలోని ప్రధానభాగం ఇలా ఉంది: "దూరప్రాచ్యంలోని అంతర్జాతీయ సంబంధాలను మరింత సుస్థిరం చేయాలని కాంక్షిస్తూ 'జనరల్ అసెంబ్లీ 'అన్ని రాజ్యాలవారినీ ఈ క్రిందివిధంగా అనుసరించమని గట్టిగా కోరుతోంది: (1) చైనా రాజకీయ స్వాతంత్ర్యాన్ని మన్నించడం, చైనాతో తమకుగల సంబంధాలలో ఐక్యరాజ్యసమితి సూత్రాల ప్రకారం నడుచుకోవడం. (2) చైనా ప్రజలు ఇప్పుడు, ఇకముందు స్వేచ్ఛగా, తమ ఇష్టమొచ్చిన రాజకీయసంస్థలను ఎంచుకునే హక్కును, స్వతంత్రమైన విదేశీవిధానంగల ప్రభుత్వాన్ని నడుపుకునే హక్కును మన్నించడం. (3) ప్రస్తుతం చైనాకు సంబంధించి ఉన్న ఒడంబడికలన్నింటినీ మన్నించడం (4) అక్కటి ప్రాంతాలను తమ ప్రభావంక్రిందికి తీసుకొచ్చ

కోడానికి యత్నించకుండా ఉండడం లేక చైనా రాజ్యంలోపల విదేశీయుల అదుపులో పరిపాలనలను సృష్టించకుండా ఉండడం. చైనా రాజ్యంలోపల ప్రత్యేకాధికారాలు, స్వత్వాలు కోసం చూడకుండా ఉండడం.'' ఇంతకు మునుపున్న చైనీయుల చిత్తు తీర్మానాన్ని తీసివేసి దాని స్థానంలో ఈ సమిష్టితీర్మానాన్ని ఉంచాలని ఉద్దేశించారు. కాని అందుకు జెస్సూప్, దాన్ని బలపరచిన తక్కిన నాలుగు ప్రతినిధివర్గాల ప్రతినిధులతోపాటు పట్టినపట్టు విడుకకుండా వ్యతిరేకించాడు.

చైనా ప్రతినిధి, ఈ సమిష్టి తీర్మానం చైనా చిత్తు తీర్మానంలోని తుదిపరిచ్ఛేదం (పేరాగ్రాఫ్) యొక్క వివరణ పాఠంమాత్రమేనని ఎత్తిచూపాడు. వెనిజులాకు చెందిన కార్లస్ స్టోక్, అసలు చైనా చేసిన నేరారోపణ సరియైనదో కాదో నిశ్చయంగా తేల్చుకోడం మొట్ట మొదటపని అని పేర్కొన్నాడు. చైనావారి అభియోగం అంతర్జాతీయ న్యాయస్థానానికి పంపాలన్న ఒక సూచనకు సమాధానంగా చైనాప్రతినిధి ట్స్యాయాంగ్ ఒక్క డైరెన్‌కు సంబంధించిన వివాదంతప్ప, సోవియట్ యూనియన్‌పై తెచ్చిన తక్కిన అభియోగాలన్నీకూడా న్యాయస్థానం యొక్క విచారణాధికారంక్రిందికి చేరవని ఉద్ఘాటించాడు. పీపింగ్ పరిపాలన చైనా అంతటినీ అదుపులో ఉంచదనీ, అది ప్రజానీకంచేత సమర్థించబడింది కాదనీకూడా ఆయన పేర్కొన్నాడు.

అప్పుడు హైతీ, పెరూ ప్రతినిధులు చైనా తీర్మానానికి అభ్యంతరం వెలిబుచ్చారు. గుర్తింపు అనే ప్రశ్న వివిధ ప్రభుత్వాలు కలిసి మాత్రమే నిశ్చయించ వలసిన విషయమని

చెప్పారు. సాల్వడార్ కు చెందిన మార్టినెజ్ మోరోన్ ఈ పెద్ద రాజ్యాలవారి వైఖరులను విమర్శించాడు. సోవియట్ యూనియన్, ఛర్మానాను, యాల్టా ఒడంబడికను, 1945 లో జరిగిన చైనా-సోవియట్ ఒడంబడికను-వీటన్నిటినీ ఉల్లంఘించి చైనా కమ్యూనిస్టులకు నైతికంగా భౌతికంగాసహాయంచేసినట్లు చైనా ప్రతినిధి రుజువు చేశాడనీ, కనుక ఇక చైనా చిత్తు తీర్మానాన్ని సమర్థించక పోవడానికి హేతువేమిటో తెలీడం లేదనీ మార్టినెజ్ పేర్కొన్నాడు.

చైనా చిత్తు తీర్మానాన్ని బలంగా సమర్థించిందల్లా చిలియన్ ప్రతినిధివర్గం. ఈ ప్రతినిధి వర్గానికి చెందిన కార్లస్ వెలెన్ జుయేలా, సమష్టి తీర్మానాన్ని బలపరుస్తూ అందులోని ప్రధాన నిబంధనలన్నీ ఇదివరకే ఉల్లంఘించ బడినాయని పేర్కొన్నారు. ఆ తీర్మానంలో అన్నిరాజ్యాల వారినీ చైనా యొక్క రాజకీయ స్వాతంత్ర్యాన్ని మన్నించమని కోరినప్పుడు ఇక కమ్యూనిస్టులక్రింద ఉన్న చైనా ప్రజాతంత్ర రిపబ్లిక్ ఏనాడో సోవియట్ కూటమిలో సభ్యుడయినట్లు లెక్క అయిపోయి, అది తన స్వాతంత్ర్యాన్ని కోల్పోయిందని ఆయన గట్టిగా దెబ్బలాడాడు. నిష్కపటంగా, నిష్కర్షగా మాట్లాడిన మరోవ్యక్తి న్యూజిలాండుకు చెందిన సర్ కారల్ బెరెన్డ్సెన్. బహుశా ఈ విషయంలో జనరల్ అసెంబ్లీవారు చేతులు కడుక్కోవాలని ఉద్దేశించినట్లయితే, ఆవిషయం మర్యాదగాను బహిరంగంగాను ఒప్పుకోడం మంచిదని ఆయన పేర్కొన్నాడు. బ్రిటిష్ ప్రతినిధి సర్ టెరెన్స్ షాన్ అభిప్రాయం వేరు విధంగా ఉంది. ఈ చెప్పబడే ప్రభుత్వం కనుక దేశం మొత్తంమీదకాని

లేక దేశంలో ఎక్కువ భాగంమీదకాని బలమైన అధికారాన్ని కలిగి ఉన్నట్లయితే అప్పుడు కనీసం అభియోగాన్ని ప్రత్యేకంగా గుర్తించ వీలవుతుందనీ, అలాకాక తక్కిన విషయాలను లెక్కలోకి తీసుకోవలసి వచ్చినప్పుడు, నమ్మకంమీద కంటె వాస్తవంమీదనే నిర్ణయం ఆధారపడి ఉంటుందనీ మొండిగా మాట్లాడాడు ఆయన.

క్యూబా, ఈక్వెడార్, పెరూ ప్రతినిధివర్గాలచే ఒక కొత్త తీర్మానం అందచేయబడింది. సోవియట్ యూనియనుపై చైనా తెచ్చిన అభియోగాలు ఒక తాత్కాలిక (Interim) ఉపసంఘం వారిచేత పరిశీలించబడాలనీ, తరువాత ఆఉపసంఘం వారు దానిమీద తమ నివేదికను తయారుచేసి రాబోయే అసెంబ్లీ సమావేశానికి అందించాలనీ ఈ కొత్తతీర్మానపు సారాంశం అయిఉన్నది. చిలీ, ఇరాక్ ప్రతినిధివర్గంవారు తాము ఈ కొత్త తీర్మానాన్ని సమర్ధిస్తామని వెల్లడించారు. ఈ త్రైరాజ్య తీర్మానం ఓటుకు పెట్టబడి నెగ్గింది. ఈ తీర్మానం పంచరాజ్య సమష్టి తీర్మానానికేమీ విరుద్ధం కాదుకనుక, దాన్నికూడా ఓటుకుపెట్టారు. అదికూడా నెగ్గింది. కనుక అప్పుడు ఈరెండు తీర్మానాలుకూడా తరువాత విచారణ నిమిత్తం జనరల్ అసెంబ్లీలో ప్రవేశపెట్టవలసి ఉన్నది. అసెంబ్లీలో చివరకు వీటిని ఆమోదించడమో లేక త్రోసిపేయుడమో జరుగుతుంది.

డిసెంబరు 7 న జరిగిన 272 వ జనరల్ అసెంబ్లీ సంపూర్ణ సమావేశంలో, సోవియట్ ప్రతినిధి ఈ విషయం మొత్తంపట్ల అనంగీకారాన్ని వెలిబుచ్చాడు. ఇదివరకటి అభి

ప్రాయాలనే పునఃవ్యక్తంచేస్తూ, చైనా ప్రతినిధివర్గానికి ఎలాంటి అధికారం లేదనీ, అది చైనా ప్రజలకు ప్రాతినిధ్యం వహించదనీ, ఈ అభియోగానికి సంబంధించిన చర్చలో సోవియట్ ప్రతినిధి వర్గం పాల్గొనదనీ, దీనిపైచేసే ఏ నిర్ణయాన్నికూడా తాము లెక్కలోకి తీసుకోమనీ పేర్కొన్నాడు. దీనికి జవాబుగా ట్సియాంగ్, పీపింగ్ పరిపాలన ప్రజలమద్దతులేని తోలుబొమ్మ పరిపాలన అనీ ఇహ పోతే తాను ప్రాతినిధ్యం వహిస్తున్న ప్రభుత్వం సక్రమంగా ప్రజలచే ఎన్నుకోబడిన ప్రభుత్వమనీ స్థిరీకరించి చెప్పాడు. చైనా కమ్యూనిస్టులకు సైనిక, ఆర్థిక సహాయం చేయకుండా ఉండడం సభ్యులయినరాజ్యాల ప్రాథమికవిధి అయిఉన్నదనీ, ఒక ప్రభుత్వం తన వాణిజ్యసౌకర్యాలు సురక్షితంగా ఉంచుకోడంకోసం పీపింగ్ పరిపాలనను గుర్తించడం సరైనదికాదనీ దెబ్బలాడాడు. సయుక్తరాష్ట్రాల తరఫున జెస్సూప్, చైనా సమస్యపట్ల సోవియట్ ప్రతినిధివర్గం అవలంభించిన వైఖరిని విమర్శించారు. ఇది జనరల్ అసెంబ్లీ యొక్క నియమాలకు, వ్యవహారపద్ధతికి విరుద్ధమనికూడా పేర్కొన్నాడు. ఆ మరుసటిరోజు – 273 వ సంపూర్ణ సమావేశంలో ఈ రెండు తీర్మానాలూ ఓటింగ్‌కు పెట్టారు. రెండూకూడా నెగ్గాయి. ఆవిధంగా సోవియట్ యూనియనుపై చైనా తెచ్చిన అభియోగాన్ని తాత్కాలికోపసంఘం వారికి పంపడం జరిగింది.

1950 ఫిబ్రవరి 7న ఈ జనసంఘం చైనా అభియోగాన్ని విచారణకు తీసుకుంది. ఆ సందర్భంలో ప్రభుత్వకార్యదర్శి అచెసన్ జనవరి 12న నేషనల్‌ప్రెస్ క్లబ్ వారి ముందుచేసిన ఉపన్యాసాన్ని ట్సియాంగ్ ఎత్తివాసుకున్నాడు. ఆప్రసంగంలో

సోవియట్ యూనియన్ చైనా ఉత్తరరాష్ట్రాలను చైనానుంచి విడగొడుతున్నట్లు పేర్కొనబడింది. దానిపై అతను తన ప్రభుత్వం కమ్యూనిస్టులలో పోరాటం కొనసాగించడానికి నిశ్చయించుకున్నదని చెప్పుతూ, అంతర్జాతీయ ఆంగ్ల ధర్మశాస్త్రవేత్త, లాటెర్‌పాక్ట్ పేరు ఉదహరించాడు. ఒక తిరుగుబాటు తత్వంగల పరిపాలనను అకాలంలో గుర్తించడానికి అంగీకరించడం అంతర్జాతీయ న్యాయసూత్రాలకు విరుద్ధమని ఎత్తిచూపాడు. తాత్కాలిక కమిటీ ఏమిచర్య తీసుకోలేదు. మార్చిలో సెక్రటరీ - జనరల్ ట్రిగ్వేలీ ఒక యాదాస్తు ప్రకటనను (మెమోరాండం) అందరికీ అందచేశాడు. చైనా ప్రతినిధివర్గం దృష్టిలో, ఐక్యరాజ్యకూటమిలో ఎర్రచైనాకు సభ్యత్వం ఇప్పించేందుకు ఐక్యరాజ్యాల ప్రతినిధులను తమవైపు త్రిప్పుకోడానికి ప్రయత్నించడం గమనించదగ్గ విషయమని ఆ ప్రకటనలో తెలియచేశాడు. దానిపై చైనాప్రతినిధి, లీ పంపిన యాదాస్తు ప్రకటన "ఉద్దేశపూర్వకంగా చైనాను సమితిలో పరాభవించడమే" నని ఆరోపించాడు. "సెక్రటరి యేట్ నిష్పక్షపాతబుద్ధి వ్యవహరిస్తుందన్న ప్రజావిశ్వాసాన్ని పాడుచేయడమే" లీ ప్రధానోద్దేశమని కూడా నేరం ఆపాదించాడు.

1950 నవంబరు ఆఖరున ప్రథమోపసంఘంవారు చైనా అభియోగం విషయం ఆలోచించే నిమిత్తం అనేక సమావేశాలు జరిపారు. ట్సియాంగ్, సోవియట్‌యూనియన్‌పై పునః నేరారోపణలు కావించాడు. అంతేకాక చైనాకమ్యూనిస్టు పరిపాలన టిబెట్‌లో సోవియట్ విస్తరణకు ఒక సాధనంగా

ఉపయోగపడుతున్నదనీ, ఈ పాలకవర్గం "కన్ఫ్యూషియస్. లో యెట్స్, మెన్షియస్ మొదలయినవారి మహాకావ్యాల్నీ, ఈ మహాకావ్యాలపై 2500 సంవత్సరాలబట్టీ వస్తున్న శ్రేష్ఠమైన వ్యాఖ్యానాలతో ఇతర సాహిత్య సంపదతోసహా" గులబెట్టమని ఆజ్ఞాపించిందనీ, ఈ పరిపాలన ఒక తీవ్రమైన, వ్యాప్తమైన ప్రతిఘటనోద్యమంతో ముఖాముఖి ఎదుర్కొంటున్నదనీ గట్టిగా దెబ్బలాడాడు. అదేరోజు జరిగిన రెండవ సమావేశంలో సోవియట్ ప్రతినిధి జాకోబ్ మాలిక్ ఒక ప్రసంగం చేశాడు.

చర్చలో సోవియట్ పాల్గొనడంవల్ల ఫిర్యాదికీ నేరస్తుడికీ మధ్య ఒకరకమైన ముఖాముఖివాదన సాధ్యమవుతుందని అన్నాడు. చైనాప్రతినిధివర్గంచే సోవియట్యూనియనుపై చేయబడిన కొన్ని ప్రకటనలకు ఎదురువాదం చేయడానికి ప్రయత్నించారుమాలిక్. మంచూరియాలోని సోవియట్నాయకుడు, కావలసినంత వ్యవధిలో సోవియట్ సైన్యాలను ఉపసంహరించే విషయం కొమిన్టాంగు అధికారులకు తెలియచేశాడని స్థిరీకరించి చెప్పాడు. సోవియట్ యూనియను చైనాకమ్యూనిస్టులకు ఆయుధాలు సరఫరాచేసిందన్న అభియోగంపై మాట్లాడుతూ ఆయన వైట్ పేపరును, (రాజ్యాంగవిషయాన్నిగూర్చి పార్లమెంటువారికి ప్రభుత్వవర్గంవారు పంపే పత్రం) అచ్ సెన్ యొక్క ఉత్తరం మరొకరికి పంపడాన్నిగురించి ఉదహరిస్తూ, చైనా ప్రజావిమోచనసైన్యం జాతీయవాద బలాలదగ్గరనుంచి లెక్కలేనన్ని సంయుక్తరాష్ట్ర యుద్ధపరికరాలను స్వాధీనం

చేసుకున్నదని పేర్కొన్నాడు. చైనా ఉత్తరరాష్ట్రాలను సోవియట్ యూనియను కలుపుకుంటున్నదన్న అబ్ సెన్ ఆరోపణను గురించిమాట్లాడుతూ, ఆయన కేవలంఇదివరకు విషిన్స్కీ నిరాకరించడాన్ని ఉదహరించాడు. సోవియట్ యూనియను యాల్టా ఒడంబడికను ఎన్నడూ ఉల్లంఘించలేదని చెబుతూ, సోవియట్ జపానుపై యుద్ధానికి పూనుకోడంవల్ల, యుద్ధంలో సోవియట్ కనీసం 2 లక్షలనుంది అమెరికను ఉద్యోగుల ప్రాణాలనైతేనేం జపానుకు లొంగిపోవడానికి సిద్ధంగాఉన్న సోల్జర్లనైతేనేం కాపాడిందని ఉద్ఘాటించాడు. పీపింగులో ప్రజాప్రభుత్వం చైనా గ్రంథాలను, మహాకావ్యాలను తగులబెట్టమని ఆజ్ఞాపించిందన్న విషయం ఆయన ఒప్పుకోలేదు. ఆ ఆరోపణ కేవలం అబద్ధం, అపవాదు తప్ప మరేంకాదన్నాడు.

ఇలా వేర్వేరు విషయాలపై వివాదం జరుగుతుండగా మధ్యలో సిరియన్ ప్రతినిధివర్గం ఒక కొత్త చిత్తు తీర్మానాన్ని ప్రతిపాదించింది. "జనరల్ అసెంబ్లీ వారు——ఈ సమస్యపై విచారణ కొనిసాగించి, అభియోగంతో ప్రత్యక్ష సంబంధం గల ఇంకా ఎక్కువ సమాచారాన్ని వాస్తవాలను వీలయితే సేకరించమని తాత్కాలికోపసంఘాన్ని ఆజ్ఞాపించడానికి నిశ్చయిస్తున్నారు" అని ఆ తీర్మానంలో పేర్కొబడింది. ఆస్ట్రేలియా ప్రతినిధి, దూరప్రాచ్యంలోని పరిస్థితి దృష్ట్యా ఈ విషయాన్ని ఇంతటితో ప్రక్కకు నెట్టేసెయ్యడమే తెలివైన పని అని చెప్పాడు. ఈజిప్టు, పెరూ ప్రతినిధులు ఈ విషయాన్ని అవతలికి నెట్టేసే అభిప్రాయానికి అంగీకరించలేదు. డల్లెన్‌కూడా ఈ ఉద్దేశం తప్పన్నాడు. వాస్తవానికి ఒక గొప్పరాజ్యం నేరా

రోషణలకు గురికాక తప్పదనీ, అంతమాత్రంచేత తగినంత కారణం లేకుండా సమస్యను కప్పి పుచ్చకూడదనీ అన్నాడాయన. న్యూజిలాండ్ ప్రతినిధి సర్ కారల్ బెరెన్డుసెన్ అసలు మాలిక్ చెప్పేదీ ట్యేయాంగ్ చెప్పేదీ పరస్పర విరుద్ధంగా ఉన్నందువల్ల వాస్తవాలు సరిగ్గా ఎరుకపడలేదనీ, లేక విచారణ నిష్ప్రయోజనమని స్థిరపరచబడలేదనీ దాని ప్రకారమే రుజువవుతున్నదని పేర్కొన్నాడు. తుదకు సిరియా చిత్తుతీర్మానం ఆమోదించబడింది.

జూన్ 24 న ప్రారంభమైన కొరియా యుద్ధంలో కమ్యూనిస్టు చైనా జోక్యం కలిగించుకున్నది అప్పుడు కొరియాలో ఉన్న ఐక్యరాజ్య సమితి విచారణ సంఘం నివేదిక ప్రకారం, ఉత్తరకొరియా బలాలు దక్షిణకొరియా రాష్ట్రంపై దండెత్తాయని తెలిసింది. కొరియా యుద్ధం తీవ్రంగా కొనసాగడానికి చాలాముందు, కమ్యూనిస్టు చైనాకు ఐక్యరాజ్యసమితి నించి ఒత్తిడి వచ్చింది 1951 ఫిబ్రవరి 1 వ తేదీన అది ఒక దురాక్రమణ చేసే రాజ్యం అని, ప్రకటించారు. మే 18 న యుద్ధసామగ్రులను ఎవరూ చైనాకు పంపరాదని నిషేధించింది. ఈ విధంగా, చైనా ప్రతినిధివర్గం ఏమి ఆశించిందో, ఏమి ఆర్థించిందో-అదిచాలమటుకు సిద్ధించింది. అయితే కొరియాలో వచ్చిన మార్పులవల్ల మాత్రమే ఇది జరిగింది.

సోవియట్ యూనియనుపై చైనా తెచ్చిన అభియోగం తాత్కాలికోపసంఘంలో 1951 సంవత్సరమల్లా అలాగే పడేసి పెట్టడం జరిగింది. 1952 జనవరి 26 న ప్రథమోపసంఘంవారి

502వ సమావేశంలో, చైనాప్రతినిధి సోవియట్‌యూనియన్‌పై తన అభియోగాన్ని తిరగతోడాడు. అది సమితినియంత్రృత్వం 1945లో జరిగిన చైనా-సోవియట్ ఒడంబడికను ఉల్లంఘించిం దని తిరిగీ పేర్కొన్నాడు. తుదకు చైనాపట్ల సంధివిధులను సోవియట్ ఉల్లంఘించడాన్ని జనరల్ అసెంబ్లీ గుర్తించవల సిందిగా కోరుతూ మరొకతీర్మానాన్ని ప్రతిపాదించాడు. అందు మీాదట రష్యాప్రతినిధి మాలిక్ తన ప్రభుత్వంపక్షాన ప్రతి వాదనచేస్తూ మాట్లాడారు సోవియట్‌యూనియను 1945లో జరిగిన చైనా-సోవియట్ ఒడంబడికను ఉల్లంఘించడం జరగలే దనీ, ఎంచేతనంటే ఆ ఒడంబడికస్థానంలో 1950 ఫిబ్రవరి 14న మరొక క్రొత్తఒడంబడిక చేసుకొనడం సంభవించిందనీ తీవ్రంగా వాదించాడు మాలిక్. యుక్రేన్, బైలోరష్యా, చెకోస్లోవా కియా, పోలెండ్‌లు మాలిక్ చెప్పినదాన్ని బలపరుస్తూ, మళ్ళీ అదే చెప్పారు. క్యూబాప్రతినిధి, చైనా మోపిన ఆరోపణలను సోవియట్‌యూనియను ఇంతకాలంబట్టికూడా ప్రతివాదంచేత ఖండించుకోలేకపోయిందని పేర్కొన్నాడు. సోవియట్‌యూని యను తన ప్రతివాదనలో కేవలం అసంగతాలను, అసత్యా లను పదేపదే వల్లిస్తూ, సంయుక్తరాష్ట్రాలను దూరుతున్నదని ఉద్ఘాటించాడు పెరూప్రతినిధి. అమెరికా సంయుక్తరాష్ట్ర ప్రతి నిధి కూపర్, సోవియట్‌యూనియను 1945లో చైనాతో చేసు కున్న సంధిని ఉల్లంఘించి, తద్వారా అంతర్జాతీయబాధ్యతలకు పవిత్రతకుకూడా భంగం కలిగించిందని జనరల్ అసెంబ్లీవారు నిర్ణయించినట్లు చెబుతూ, చైనా చిత్తుతీర్మానాన్ని ఆమో దించవలసిందని గట్టిగా కోరాడు.

అప్పుడు మాలిక్ మళ్ళీ ప్రసంగించాడు. 1945 నాటి చైనా - సోవియట్ ఒడంబడికకంటె, 1950 లో చైనాకమ్యూనిస్టులతో జరిగిన సోవియట్ ఒడంబడిక ఎక్కువ సమంజసమైనదని సమర్థిస్తూ, సోవియట్ యూనియన్ చైనాతో చేసుకున్న ఒప్పందాలను ఉల్లంఘించినదనడం సహేతుకమైనమాట కాదన్నాడు. మాలిక్ చెప్పినదానికి ప్రతిగా చైనాప్రతినిధి ట్సియాంగ్, 1945 ఒడంబడికతో, 1950 ఒడంబడికను పోల్చి అనుకూలమైనదని చెప్పడానికి హేతువు, చైనాకమ్యూనిస్టు ప్రభుత్వం సోవియట్ ప్రభుత్వానికి ఒకసాధనోపకరణం కావడమేనని తీవ్రంగా వాదించాడు. తరువాత చిత్తుతీర్మానం ఓటుకు పెట్టబడింది. తీర్మానానికి 24గురు అనుకూలంగాను 9 మంది వ్యతిరేకంగాను ఓటుచేశారు. 25 దేశాలవారు తటస్థంగా ఊరుకున్నారు.

పిమ్మట తీర్మానం అంగీకరించడానికో లేక అనంగీకారం తెల్పడానికో దాని ఇష్టంవచ్చినట్లు చేయడానికి జనరల్ అసెంబ్లీ వారికి పంపారు. 1952 ఫిబ్రవరి 1న జరిగిన అసెంబ్లీ సంపూర్ణ సమావేశంలో సంయుక్తరాష్ట్రాల తరఫున కూపర్, తొలి కమిటీ చర్చలలోను, సంపూర్ణ సమావేశం చర్చలలోను కూడా, సోవియట్ యూనియన్ మంచూరియాలోని తన ప్రవర్తనను ఎప్పుడు తీవ్రమైన ప్రతివాదన ద్వారా సమర్థించుకోడానికి పూనుకోలేదని ఎత్తిపొడిచాడు. సోవియట్ ప్రతివాదనల్లా, తాను గుర్తించనటువంటి ఒక ప్రభుత్వానికి తనపై బలవంతాన నేరారోపణ చేసేందుకు చట్టబద్ధమైన హక్కు లేదన్న ఒకానొక తుచ్ఛమైన వివాదంపై కేంద్రీకృత మయి

నదని కూడా ఆయన ఉద్ఘాటించాడు. చైనా ప్రతినిధివర్గంచే ప్రతిపాదించబడిన తీర్మానం తుదకు ఓటుకు పెట్టబడింది. తీర్మానానికి అనుకూలంగా 25, ప్రతికూలంగా 9 వచ్చాయి. 24 గురు తటస్థంగా ఉన్నారు. తీర్మానంలోని ప్రధానభాగం ఇది :

"సోవియట్ సోషలిస్టు రిపబ్లికులసమితి చైనా జాతీయ ప్రభుత్వం జపాను లొంగిపోయిన తరువాత మూడు తూర్పు రాష్ట్రాలలో (మంచూరియా) చైనా జాతీయాధికారాన్ని పునః ప్రతిష్ఠించుకునే ప్రయత్నాలను ఆటంకపరిచిందనీ, చైనా జాతీయప్రభుత్వానికి వ్యతిరేకంగా చైనాకమ్యూనిస్టులకు సైనిక, ఆర్థికసహాయాలు చేసిందనీ 'జనరల్ అసెంబ్లీ వారు' గ్రహిస్తున్నారు. జపాన్ లొంగిపోయినది మొదలు సోవియట్ సోషలిస్టు రిపబ్లికుల సమితి తన చైనా సంబంధాలలో, 1945 అగస్టు 14న చైనా - సోవియట్ యూనియన్‌ల మధ్య జరిగిన స్నేహ సహకార సంధిప్రకారం నడుచుకోలేదని అసెంబ్లీ వారు నిర్ణయిస్తున్నారు".

ఐక్యరాజ్యసమితిలో సోవియట్ యూనియనుపై చైనా తెచ్చిన అభియోగంవల్ల, చైనా - సోవియట్ సంబంధాలు అద్దంలో చూపినట్లు స్పష్టంగా విశదమైనాయి. ఈ అభియోగం ఒక ప్రధానమైన విషయాన్ని బయటపెట్టింది. అంతేకాదు. చైనాచుట్టూ కేంద్రీకృతమైన సాధారణ అంతర్జాతీయ సంబంధాల పరిస్థితికూడా స్పష్టంగా కనిపించేటట్లు చేసింది. ఒక సందిగ్ధమైన, చిక్కులతోకూడిన అంతర్జాతీయ సమస్యను సంబాళించడంలో ఐక్యరాజ్యసమితి శక్తిసామర్థ్యాలకు ఇది ఒక పెద్ద

పరీక్షకూడా అయింది. చైనా ప్రతినిధివర్గం తన అభియోగానికి సంబంధించిన వాస్తవ కథనాన్ని అందరిముందూ పెట్టడంద్వారా మంచిపని చేసిందని చెప్పవలసిఉంది. అయితే, సాంకేతిక, యుక్తి ప్రయుక్తులదృష్ట్యా చూస్తేమాత్రం, ఈ అభియోగాన్ని విశదీకరించడంలో ఏదో కొరవడినట్లు కనుపిస్తుంది. మొదటిది, దఖలుపరిచిన కొన్ని సత్యాలు, కొంత ధర్మశాస్త్రానికి అనువుగా ఉండే తలంపుతో వాటిని పకడ్‌బందీగా కూర్చిపెట్టారనడానికి వీలున్నది. ఇహ రెండవది, అభియోగాన్ని గురించి ప్రభుత్వ సంబంధంగా నొక్కిచెప్పే విషయంలో అది, సోవియట్ కూటమికిచెందిన ప్రతినిధివర్గాల చేతుల్లోకి పోయింది. ప్రతీకారంగా ఈ ప్రతినిధివర్గాలు కేవలం జాతీయవాద ప్రభుత్వాన్ని అవమానించడంపైనే దృష్టిని కేంద్రీకరించాయి. చైనా తన అభియోగాన్ని వివరించడంలో, దానికి సంబంధించిన వాస్తవాలను, వాదనలను పకడ్‌బందీగా - చైనా రాజ్యంపట్ల చైనా ప్రజలపట్ల సోవియట్ యూనియను అపరాధాలను అధర్మాలను ఎత్తిచూపే విధంగాకనుక ప్రత్యేకపరిచినట్లయితే, దాని వాజ్యెం మరింత బలంగాను, మరింత మద్దతును సాధించగలదిగాను ఉండేదని అగుపిస్తోంది. చైనాలో ఉన్న పరిస్థితిపట్ల ఇప్పు డిక్కడ ఉన్న వివిధ ప్రభుత్వాల వైఖరీ, వాటికి కలిగిన ఆగ్రహం ఈసందర్భంలో స్పష్టంగా వ్యక్తమయినాయి ఈ ప్రభుత్వాలు అన్నీ పీపింగ్ పరిపాలనను గుర్తించకూడదని స్పష్టంగా సిఫార్సుచేశాయి. చాలాప్రభుత్వాలు జాతీయవాద ప్రభుత్వాన్ని గుర్తిస్తూనే ఉన్నాయికూడా. కాని అదే తరు

ణంతో అవి, తమస్థితిని మార్చుకునేందుకు సంపూర్ణ స్వేచ్ఛను ఇచ్చినతర్వాత ఆ తరువాత పరిస్థితుల మార్పునుబట్టి స్పష్టంగా ఏదో ఒకటి చెయ్యాలని కోరుతున్నాయి.

విస్తృతమైన వ్యవస్థ, సాధనసంపత్తి ఉన్నప్పటికీ, ఐక్యరాజ్యసమితికి చైనా అభియోగాన్ని న్యాయంగాను, పకడ్బందీగాను సంభాళించే క్షమత లేకపోయింది. ఈ అభియోగముపై అనేకపర్యాయములు చర్చలు కొనసాగినప్పటికికూడా, వాస్తవంగా అక్కడ దానివిషయమై తీవ్రమైన పరిశీలనగాని, దాని విలువఏమిటో నిర్ణయించడంగాని జరగలేదు. కొన్ని ప్రతినిధివర్గాలుమాత్రం ఈ అభియోగంపట్ల తమ తీవ్రఆసక్తిని కనపరిచాయి ప్రధానరాజ్యాలవారు రంగరూ—సోవియట్ యూనియను, గ్రేటుబ్రిటను, ఫ్రాన్సు, సంయుక్తరాష్ట్రాల వారు—ఈ విషయాన్ని వీలయినంత త్వరలో ముగించివూపు చేయాలనుకున్నారు. సోవియట్ప్రతినిధివర్గం, ఈ విషయాన్ని పుట్టకుండానే గిల్లిపారేస్తే పీడా వదిలిపోయిఉండేదని చెప్పింది. చైనా తెచ్చిన ఈ అభియోగం అటూఇటూ కొట్టుకలాడి కొట్టుకలాడి, ఒక ఉపసంఘంనుంచి మరొక ఉపసంఘానికి ఒక పిల్లిశవంలాగానో లేక ఉడుకు బంగాళదుంపలాగానో నెట్టివేయబడుతుంది. అంచాత ఎవరూ దీన్ని తాకడానికిగానీ, తగలవేయడానికిగాని ఎవరికీ శ్రద్ధలేకపోయింది చైనా ప్రతినిధివర్గం ఆరోపించినవిధంగా సోవియట్యూనియనుకనుక నిజంగా దురాక్రమణకు దిగిందంటే ఐక్యరాజ్యసమితి లెక్కలేకుండా దాన్ని ఏనాడో జీర్ణించుకుంది. అదికూడా తేలిపోయింది.

# 6

# సోవియట్ రష్యా, చైనా ప్రజాతంత్ర రిపబ్లికు

## చైనా-సోవియట్ ల సూచనసంధి, ఒడంబడికలు

**1949** జూన్ 30 న మావ్-సే-టుంగ్ విదేశీ విధానాన్ని గురించి చెపుతూ ఇలా అన్నాడు "'మీరు ఏదో ఒక వైపుకే మొగ్గండి'...ఒక్క చైనాలోనే కాదు యావత్ప్రపంచంలోకూడా ఎవరైనా కానీండి, ఏదో ఒక వైపుకే అటు సామ్రాజ్యవాదంవైపో లేక ఇటు సామ్యవాదంవైపో మొగ్గి తీరాలి. తాటస్థ్యంఅనేది కేవలం మోసం. ఈ మూడో మార్గం అనేది అసలులేదు." చైనా కమ్యూనిస్టులు అధికారంలోకి వచ్చిన తరువాత, మావ్ యొక్క ప్రియతమమైన విధానం, ఒకే త్రాటిమీద నడవడం అన్ని ప్రధాన మూల సూత్రంలో భద్రంగా, భక్తితో కాపాడ బడుతూ వచ్చింది. తరువాత దీని స్థానంలో ఒక లాంఛన ప్రాయమైన రాజ్యాంగాన్ని ప్రవేశ పెట్టారు. దానిముందుపీఠికలో కొంతభాగం ఇలా చెబుతోంది: "చైనా ఇప్పటికే సోవియట్ సోషలిస్టు రిపబ్లికుల మహా సమాఖ్యను, ఇతర ప్రజాస్వామ్యాలతోను నిత్యమైన మైత్రిని నిర్మించుకున్నది ... ఈ మైత్రి ఎడతెరిపిలేకుండా అభివృద్ధి కాంచుతూ, దృఢతరమవుతూ వస్తుంది." మావ్ చెప్పిన 'ఒకవైపు మొగ్గు' విధానం ఆ విధంగా కమ్యూనిస్టు చైనా విదేశ వ్యవహారాలలో ఒక ముఖ్యమైన కీలకం అయింది.

1949 డిసెంబరులో మావ్ - సే-టుంగ్ మాస్కోకు ఒక ప్రతినిధివర్గాన్ని తీసుకుపోయాడు. ఈ ప్రతినిధివర్గం ప్రధానోద్దేశం చైనా - సోవియట్ రష్యాల మధ్య సంధి సంప్రతింపులు నడుపడం ఎ. వై. విషిన్‌స్కీ, చౌ - ఎన్ - లేలు "1945 అగస్టు 14న చైనా - రష్యాలమధ్య జరిగిన వారివారి సంధి, ఒడంబడికలు చెల్లవనీ చెబుతూ, ఇరుప్రభుత్వాలవారూ మంగోలియా ప్రజాతంత్ర రిపబ్లికు స్వాతంత్ర్యం విషయంలో పూర్తిగా పూచీ పడుతున్నట్లు స్థిరపరచుకుంటూ" పరస్పరం పత్రాలు వ్రాసుకుని ఒకరికొకరు అందించుకున్నారు. అదే తరుణంలో ఇరుపక్షాలవారూ "సోవియట్ ప్రభుత్వం నష్టపరిహారమేమీ కోరకుండా మంచూరియాలో జపాన్ స్వంతదార్ల నుంచి సోవియట్ ఆర్థికసంస్థలచే సంపాదించబడిన ఆస్తులను చైనా ప్రజాతంత్ర రిపబ్లికుకు ఇచ్చేటట్లు నిర్ణయించుకుని" దానికి సంబంధించిన పత్రాలు ఒకరికొకరు వ్రాసి ఇచ్చుకున్నారుకూడా.

ఈ స్నేహ, బాంధవ్య, పరస్పర, సహకారాల సంధి ప్రకారం, ఒప్పందానికి వచ్చిన ఇరుపక్షాలవారూ అత్యంత సన్నిహిత సహకారంతో ప్రవర్తించి, జపానుకాని లేక "దానితో ఏదోవిధంగా సహకరిస్తూన్న మరేరాజ్యమైనా కాని" తిరిగీ దాడి ప్రారంభించేటట్లయితే దాన్ని ఎదుర్కోడానికీ, "ప్రపంచము మొత్తంమీద శాంతిభద్రతలు కాపాడే ఉద్దేశంతో కొనసాగే అన్ని అంతర్జాతీయ చర్యలలోనూ" ఇరువురూ పాల్గొనడానికీ, "జపానుతో సాధ్యమైనంతత్వరలో శాంతిసంధిఏర్పాటు చేసుకోడానికీ," "చైనా, రష్యాల సాధారణ అభిరుచులకు సంబంధించిన అన్ని ప్రధాన అంతర్జాతీయ సమస్యలలోను

పరస్పరం ఆలోచనలు, సలహాలు ఇచ్చిపుచ్చుకోడానికీ," "చైనా సోవియట్ యూనియనుల మధ్య ఆర్థిక, సాంస్కృతిక సంబంధాలను దృఢతరం కావించుకోడానికీ, అభివృద్ధి చేసుకోడానికీ ఏర్పాటు జరిగింది. ఈ సంధిప్రకారమే, ఒప్పందానికివచ్చిన ఇరుపక్షాలవారూ ఒకరినొకరు మోసగించే తలంపుతో ఒకరికి వ్యతిరేకంగా ఒకరు పరాయివాళ్ళతో స్నేహసంబంధాలు నెరపకూడదనీ," "భిన్నశక్తియులతో కలవడంగాని, లేక ఏ ఒక్కరికయినా ప్రతికూలంగా సాగే చర్యలలోగాని, కార్యకలాపాల్లోగాని పాల్గొనరాదనీ" ఖరారు పడ్డారు.

చైనా చాంగ్‌చున్ రైల్వే, పోర్టు ఆర్థర్, డైరెన్ రేవులను గురించి జరిగిన ఒడంబడిక ప్రకారం సోవియట్ ప్రభుత్వం ఈ క్రిందివిధంగా పూచీ పడుతున్నది: (1) నష్టపరిహారమేమీ కోరకుండా "చైనా చాంగ్‌చున్ రైల్వే సంయుక్త నిర్వహణకు సంబంధించిన తన యావత్తు హక్కులను పెకింగ్ ప్రభుత్వానికి బదలాయింపు చేయడానికి. (2) సోవియట్ సైన్యాలను ఆర్థర్ రేవునుంచి ఉపసంహరించుకుని అక్కడఉండే ఉద్యోగాలు మొదలయిన ఏర్పాట్లు ఎంతో కొంత సొమ్ము నష్టపరిహారంగా పుచ్చుకుని, జపానుతో శాంతిసంధి చేసుకున్న తరువాతగాని, లేక "1952 సంవత్సరాంతం దాటకుండాగాని" వాటిని పెకింగ్ ప్రభుత్వమునకు స్వాధీనం చేయడానికీ- కాని ఈ విషయంలో, జపానుతోగాని లేక జపానుతో కలిసిన మరొక రాజ్యంతో గాని యుద్ధం వచ్చేటట్లయితే సోవియట్ రష్యా తిరిగీ ఆర్థర్ రేవును నౌకాశ్రయంగా ఉపయోగించుకోవచ్చునని" అనుకున్నారు. (3) "ఇప్పుడు డైరెన్‌లో తాత్కాలికంగా నిర్వ

హింపబడుతున్న లేక సోవియట్ యూనియన్‌చే గుత్తకుతీసుకో బడిన యావదాస్తులను" 1950 వ సంవత్సరంలోనే క్రమేణా పెకింగ్ ప్రభుత్వానికి స్వాధీనపరచడానికీ, డైరెన్ పరిపాలన పెకింగ్ ప్రభుత్వం చేతుల్లో ఉన్నప్పుడు ఇక డైరెన్ రేవును గురించి "జపానుతో శాంతి చేసుకున్న పిదప ఆలోచించ బడుతుందనీ."

ఈ ఒడంబడిక - చైనా చాంగ్‌చున్ రైల్వేపైనగల సోవియట్ అధికారాలను హక్కులను బదలాయింపు చేయడం నిలిపి ఉంచడంవల్ల, ఆరైల్వేమీద చైనా-సోవియట్ సయుక్త పరిపాలన మార్పులేకుండా, యథాతథంగా ఉండిపోతుందనీ, పోర్టు ఆర్థర్‌లో సోవియట్ సైన్యాలను ఉపసంహరించడం, రేవులోని కట్టడాలు మొదలయినవాటిని బదలాయించడం ఆపి ఉంచడం, వీటివల్ల పోర్టు ఆర్థర్ పౌర పరిపాలన పెకింగ్ ప్రభుత్వంయొక్క ప్రత్యేక అధికారం క్రింద ఉండిపోతుందనీ విశదపరుస్తోంది. కాని ఆ ప్రాంతంలో సైనికవ్యవహారాలు మాత్రం చైనా-సోవియట్ సంయుక్త విచారణసంఘం అధీనంలో ఉంటాయి. అప్పుల మంజూరుకు సంబంధించిన ఒడంబడికతో సోవియట్ ప్రభుత్వం పెకింగ్ ప్రభుత్వానికి 30 కోట్ల డాలర్ల అప్పు మంజూరు చేసేటట్లు, ఆ మొత్తం సోవియట్ యూనియనునుంచి ఖరీదుచేసే వివిధరకాల పారిశ్రామిక, ఇంజనీరింగు పరికరాల నిమిత్తం పెకింగ్ ప్రభుత్వంచే చెల్లించబడాలనీ ఏర్పాటు జరిగింది. ఈ పై సంధి, ఒడంబడికలు సంతకాలయిన తరువాత, ఇరుపక్షాలవారూ ఎంతగానో పొంగిపోతు

న్నట్లు కనుపించారు. ఈ నూతన విధానాల ప్రాశస్త్యాన్ని గురించి గొప్పగా చెప్పుకున్నారుకూడా.

ఈకొత్త చైనా - సోవియట్ సంధి, ఒడంబడికలు స్వభావంలోను, స్వరూపంలోను కూడా మొత్తంమీద వెనుకటి క్రెమ్లిను - జాతీయవాద ప్రభుత్వాలమధ్య జరిగిన ఒడంబడికలనే పోలిఉన్నాయి. అయితే వాటికి వీటికీ కొన్ని ప్రధానమైన భేదాలుకూడా లేకపోలేదు. పూర్వపు సంధి, ఒడంబడికలలోని విషయాలతో జతపరిచి, వ్యత్యాసాలను పరిశీలించినప్పుడు, ఈ కొత్తవి చైనాకు ఎక్కువ అనుకూలంగా ఉన్నట్లు అగుపిస్తాయి.

(1) క్రొత్త ఒడంబడికనుబట్టి చైనా - సోవియట్ మైత్రి మరింత విస్తృతమయ్యే అవకాశం ఏర్పడింది. 1945 నాటి చైనా-సోవియట్ ఒడంబడిక ప్రకారం ఒక్క జపాన్మాత్రమే మళ్ళీ దాడి ప్రారంభిస్తే దాన్ని అరికట్టడానికి సంయుక్తంగా చర్యలకు పూనుకోవాలని ఉంది. 1950 నాటి చైనా - సోవియట్ ఒడంబడిక ప్రకారం, ఏమైనా, ఇరుపక్షాలవారూ కలిసి జపాను దాడినిగాని లేక జపానుతో ఏవిధంగానైనా కలిసి దాడి జరిపే మరే రాజ్యాన్నిగాని, ఎదుర్కోవాలని ఉన్నది. ఈ వ్యత్యాసాన్నిబట్టి చూస్తే నూతన చైనా-సోవియట్ మైత్రి, జపానులాగానే లేక అంతకంటె ఎక్కువగా సంయుక్త రాష్ట్రాలను ఉద్దేశించి ఏర్పాటు చేసుకున్నట్టు స్పష్టంగా సూచితమవుతోంది. పెకింగ్ ప్రభుత్వపు సాధికారసంస్థ - జెన్మిన్ జీ-పోవ్, 1950 ఫిబ్రవరి 26 వ తేదీ సంచికలోని ప్రధానవ్యాసంలో "చైనా -

సోవియట్ మైత్రి, ఇప్పుడు తిరిగి జపాను దౌర్జన్య వాదాన్ని ప్రోత్సహిస్తూన్న అమెరికను సామ్రాజ్యవాదంపై ఒక "దెబ్బతీయటం" అని పేర్కొన్నది.

(2) చైనా చాంగ్‌చున్ రైల్వే విషయంలో జరిగిన పాత ఒడంబడిక – కేవలం ముప్పయి సంవత్సరాలు మాత్రమే రైల్వేను నడపడానికి ఉద్దేశించింది. ఆవ్యవధి అయిపోగానే రైల్వే తిరిగి చైనాకు చెందవలసి ఉంది. కొత్త ఒడంబడిక ప్రకారం అలాకాక, "1952 సంవత్సరాంతం దాటకుండానే" రైల్వేను తిరిగి చైనాకు అప్పగించాలని ఖరారు జరిగింది. ఏమైనా, అటుపిమ్మట సోవియట్ ప్రభుత్వం ఈ ఖరారును నిలబెట్టుకోనూ లేదు, దానినుంచి తప్పించుకోనూ లేదు. తరువాత సోవియట్ ప్రభుత్వం మళ్ళీ తన మనస్సు మార్చుకుంది. ప్రజాతంత్ర చైనాలో ఒక నివేదిక (1955 జూన్ 16) ప్రకారం పెకింగ్, మాస్కోలు కలిసి 1955 మే 25 న ఒక సంయుక్త ప్రకటనను జారీచేశాయి. సోవియట్ రష్యా తన సాయుధబలాలన్నింటినీ ఆర్థర్ రేవునుంచి ఉపసంహరించుకున్నదని అందులో ప్రకటించబడింది.

(4) సోవియట్ ప్రభుత్వం పెకింగ్ ప్రభుత్వానికి "ఇప్పుడు తాను గుత్తకుపుచ్చుకున్న డైరెన్‌లోని ఆస్తులన్నింటినీ" స్వాధీనం చేస్తానని పూచీపడింది. 1945 లో డైరెన్‌ను గురించి జరిగిన ఒడంబడికలో ఈలాంటి పూచీ లేదు.

(5) సోవియట్ ప్రభుత్వం, "మంచూరియాలో జపాను యజమానులనుంచి సోవియట్ ఆర్థికసంస్థ సంపాదించుకున్న

ఆస్థిని" నష్టపరిహారం లేకుండా పెకింగ్ ప్రభుత్వానికి స్వాధీన పరుస్తానని ఖరారుపడింది. 1945 లో సోవియట్ ప్రభుత్వం జాతీయవాద ప్రభుత్వానికి ఇలాంటి ఖరారు ఇవ్వలేదు. ఈపై ఖరార్లను అనుసరించి, ఆస్తులు బదలాయింపు చేయడం లాంఛనప్రాయంగా, 1950 అగస్టు 28 నాటికి పూర్తి అయింది. ఈ ఆస్తులలో సైనిక శాలలు, గిడ్డంగులు, ఒక పెట్రోలియం పారిశుద్ధ్యశాల, ఒక యంత్రాల కర్మాగారం, ఒక సిమెంటు ఫ్యాక్టరీ, ఒక గాజుఫ్యాక్టరీ, డైరెన్ రేవుకు చెందిన సమస్త పరికరాలు, సిబ్బంది మొదలగు ఏర్పాట్లు, సాంస్కృతిక - విద్యావిషయిక సంస్థలు, బాడుగ ఇళ్ళు, సిమెంటు, పంచదార, సబ్బులు మొదలయినవి తయారుచేసే చిన్న పరిశ్రమల స్థలాలు, కాగితం, సిగరెట్లు ఇత్యాదులు తయారుచేసే ఫ్యాక్టరీలు, 11 సినిమాథియేటర్లు, ఇంకా ఎన్నో ఇమిడి ఉన్నాయి. భారీ పరిశ్రమలకోసం చేసిన ఏర్పాట్ల తాలూకు పెద్ద మొత్తాలేవీ తిరిగీ స్వాధీనం చేయబడలేదు. అవి సోవియట్ అధికారులు, జపాను సైన్యానికి చెందినవని భావించారు. కనుక అవి "యుద్ధంలో కొల్లగొట్టిన" ఆస్తులుగా పరిగణించబడ్డాయి.

(6) 1950 ఒడంబడికలో సోవియట్ ప్రభుత్వం, పెకింగ్ ప్రభుత్వానికి 30 కోట్ల డాలర్లు అప్పు ఇవ్వడానికి అంగీకరించింది. మరి 1945 లో ఈ అప్పు జాతీయ ప్రభుత్వానికి, సోవియట్‌వారి నైతిక మద్దతు, భౌతిక సహాయం "పూర్తిగా జాతీయప్రభుత్వానికి చైనా కేంద్రప్రభుత్వంవలె ఇస్తుందన్న" ఒక అస్పష్టమైన విశ్వాసంతో మాత్రమే మంజూరుచేయడం

జరిగింది. ఏమైనప్పటికీ, సోవియట్ పెకింగ్ ప్రభుత్వంతో చేసుకున్న అప్పు ఒడంబడిక ప్రతివిషయంలోనూ చాలా స్పష్టంగాను, నిశ్చితంగాను ఉన్నది. చైనా చాలా విశాలమైన, విస్తారంగా జనంతో నిండిఉన్న రాజ్యం అనే దృష్టితోను, తరతరాలుగా సమరంలో ప్రగ్గి మారణమైపోయిందన్న దృష్టితోను, చైనా పారిశ్రామికాభివృద్ధికి, జాతీయ పునర్నిర్మాణానికి 30 కోట్ల డాలర్లకంటె ఇంకా చాలా పెద్దమొత్తం అవసరమై ఉంది.

(7) వెలుపలి మంగోలియాకు సంబంధించిన ఒడంబడికలో పెకింగ్ ప్రభుత్వం కేవలం ఇంతకుముందే జరిగిపోయిన ఒక సత్యాన్ని రూఢిపరిచింది. రానున్న చైనా చరిత్రకారులు ఈ సత్యాన్నిగురించి విచారపడినట్లయితే, అందుకు వారు బహుశా జాతీయవాద ప్రభుత్వంపైననే ఎక్కువ నింద వేయావచ్చు.

చైనాకు అనుకూలంకాని ఈ కొత్త సాధనాలను గురించి వారు అంతగా పట్టించుకోలేదు. అవి ఎలా ఉన్నాయో అలాగే ఉండిపోయాయి. 1945 లో సోవియట్ ప్రభుత్వం "మూడు తూర్పు రాష్ట్రాలూ (మంచూరియా) చైనాలో భాగంగా తాను భావిస్తున్నట్లు" ప్రకటించింది. 1950 నాటి చైనా - సోవియట్ ఒడంబడికలో మంచూరియాలోని చైనా ప్రభుతను గురించి ఏమీ ఉదహరించబడలేదు. సింకియాంగ్‌ను గురించీ అదే చెప్పిఉండవచ్చు. 1945 ఒడంబడిక ప్రకారం డైరెన్‌ను స్వేచ్ఛమైన ఒక అంతర్జాతీయ నౌకాశ్రయంగా చేయవలసి ఉంది. కొత్త ఒడంబడికలో, "ఏమైనా, డైరెన్ రేవువిషయం తరువాత, జపానుతో శాంతిసంధి ముగిసినపిమ్మట ఆలోచించ

బడుతుందని" పేర్కొనబడింది. ఈలోగా డైరెన్ రేవు సోవియట్ వశంలోను, పర్యవేక్షణక్రిందను ఉంటుంది.

అన్నిటికంటె ముఖ్యంగా, 1945 ఒడంబడిక పరస్పరం రాజ్యతంత్రాలు ఆలోచించుకునే విషయంలో మహానంగా ఉంటే, 1950 ఒడంబడిక సోవియట్ - పెకింగ్ ప్రభుత్వాల మధ్య, పరస్పరం రాజ్యతంత్రాలు ఆలోచించుకునే విషయంలో ఒక స్పష్టమైన ఏర్పాటుచేసిందని చెప్పాల్సి ఉంటుంది. సాంకేతికంగా, ఇది ఒక సమానమైన, అన్యోన్య ఆధారంపైన నిలవబడి ఉంది. ఏమైనప్పటికీ, కమ్యూనిస్టు దేశాలమధ్య సోవియట్ రష్యా ఒక పెద్ద నాయకరాజ్యంగా గుర్తించబడిందని గుర్తించుకోవాలి. సోవియట్ అధికారానికీ అభిరుచులకూ ఇతర కమ్యూనిస్టురాజ్యాల అధికారాలూ అభిరుచులూ లోబడినవిగా ఉండాలి.

మావో-సే-టుంగ్ 'ఒకవైపు మొగ్గు' విధానం ఒక స్పష్టమైన, నిశ్చితమైన రూపంలో ఉంది. యావత్తు అంతర్జాతీయ సమస్యల సరళిలోనూ, కమ్యూనిస్టు చైనా సోవియట్ రష్యాతో సహకరించాలి. చైనా, సోవియట్ రష్యాతో ఆప్తమైన ఆర్థిక, సాంస్కృతిక సహకారానికి పూనుకుంటుంది. సోవియట్ రష్యాకు ప్రతికూలంగా కొనసాగే ఏ చర్యలలో గాని, కార్యకలాపాల్లోగాని, స్నేహ సహకారాలలోగాని చైనా పాల్గొనబోదు. తన రాజ్యతంత్రాలు నడపడంలో చైనా సోవియట్ రష్యాతో సంప్రతిస్తుంది. బహుశా చాలమటుకు తన ఘనమిత్రం పోయేదోవనే అనుసరిస్తుందికూడా. ఒక్క మాటలో చెప్పాలంటే, చైనా తన అభిరుచులకుతోడు సోవి

యట్ అభిరుచులను ఆలోచించి వాటిని నెరవేర్చాలి. ఆ విధంగా సోవియట్ ప్రభుత్వం కమ్యూనిస్టు చైనా యొక్క స్వదేశీ విదేశీ విధానాలను తన అదుపులో ఉంచుకోగల స్థితిలో ఉంది. వీలయినంతవరకూ సోవియట్ రష్యా ఈ అవకాశాన్ని తన ఉపయోగాలకు అవసరాలకు ఉపయోగించుకోడానికి ఏమాత్రం సందేహం ఉండదు. చైనా వ్యవహారాలపై పడిన ఈ గుప్తమైన సోవియట్ ప్రభావం ఆచరణలో, కమ్యూనిస్టు చైనా ఎప్పటి కప్పుడు తన జాతీయాభివృద్ధిలోను, పునర్నిర్మాణంలోను గడించుకునే ఆర్థికసంపద నంతాకూడా, అందరికంటె ముందుగా తాను కొనుక్కునే, గుత్తకుతీసుకునే హక్కులాంటిది అవుతుంది. గుత్తకొనడానికి వీలున్న ఈ హక్కులో, రష్యాకు అంతులేని లాభాలు, ఉపయోగాలు ఎన్నో ఉన్నాయి. ఇవన్నీ పూర్తిగా రూపొందినప్పుడు, పూర్వంలో సాంప్రదాయకమైన పశ్చిమసామ్రాజ్యవాదులు పెట్టుకున్న కొండంతకోరికలు, ఆశలు అన్నీ తప్పకుండా కొట్టుకపోతాయి. అతి విశాలమైన చైనీయ వర్తకాభివృద్ధిలోగాని లేక చైనీయుల కాయకష్టాన్ని లేక వస్తుసాధనాలనుదోపిడీ చేయడంలోగాని లేక చైనా పరిశ్రమలలో ఆర్థికపెట్టుబడుల అభివృద్ధిలోగాని లేక చైనాప్రజల సాంస్కృతిక పరిణామాన్ని కలిగించే కృషులలోగాని, సోవియట్ ప్రభుత్వం అపారమైన అవకాశాలను, ప్రయోజనాలను సంపాదించగలుగుతుంది. వాటిని పశ్చిమఖండపు పెట్టుబడిదేశాలకు ఇవ్వ నిరాకరిస్తుంది. ప్రపంచవ్యాప్తంగా సాగుతున్న పెట్టుబడిదార్ల-కమ్యూనిస్టుల పోరాటంలో ఇది అందరూ ఎరిగిన ఒక మార్క్సిస్టు-లెనినిస్టు వ్యూహరచన. ఇది పెట్టుబడిదారీ

రాజ్యాలు వాటి విపణివీధులను; వెనుకబడిన దేశాలలోను, వలసరాజ్యాలలోను వాటి పెట్టుబడులను కొల్లోవేయేటట్లు చేయడానికీ, ఆవిధంగా పెట్టుబడిదారీ విధానంలో అంతరంగిక సంఘర్షణలు వృద్ధిఅయేటట్లుచేసి ఆవిధంగా దాన్ని ద్వారలో పడగొట్టడానికీ ఉద్దేశించబడింది. చైనాలో సోవియట్ ప్రాబల్యాయి ఆవ్యూహరచనను సఫలంచేసుకొనేటంతవరకూ వెళ్ళింది.

చైనా–సోవియట్ సంధి, ఒడంబడికలు ప్రచురితమైన తరువాత ఒకటి రెండురోజులకు, వీటివిషయమై మరికొన్ని వార్తలు వెలువడ్డాయి. ఈ కొత్త ఒడంబడికలకు చేర్చి కొన్ని రహస్య అనుబంధమరణశాసనాలుకూడా ఉన్నాయనీ, వాటి ద్వారా కమ్యూనిస్టు చైనా సోవియట్ రష్యాకు కావలసినన్ని హక్కులు కలిగించిందనీ తెలియవచ్చింది. అసలు ఆసక్తితో గుర్తుంచుకోవలసిన విషయం ఏమిటీ అంటే, 1939 లగాయితూ కూడా సోవియట్ ప్రభుత్వం ఒక బలీయమైన రహస్య రాజ్యతంత్ర అభిరుచిని అభివృద్ధిచేస్తూ వచ్చింది. 1939 తొలిభాగంలో మాస్కోలో సాగిన నాజీ–సోవియట్ సంభాషణలప్పుడున్నూ, 1940 కడపటిభాగంలో బెర్లిన్‌లో జరిగిన సంభాషణలప్పుడున్నూ, 1945 ప్రారంభంలో జరిగిన యాల్టా ఒడంబడికప్పుడున్నూ, సోవియట్‌రష్యా రహస్యవైఖరి పుష్కలంగా ప్రదర్శితమైంది. ఈపై ఉదాహరణలను బట్టి చూస్తే కాలక్రమేణ మరికొన్ని పెకింగ్–మాస్కో రహస్య ఒడంబడికలు లోకానికి ఇంకా వెల్లడి అవవలసి ఉన్నాయనడంలో ఆశ్చర్యమేమీ లేదు.

1950 ఫిబ్రవరి 14 న సంతకాలయిన సంధి, ఒడంబడికలే కాక, సోవియట్ అధికార్లు చైనా కమ్యూనిస్టులు ఇంకా అనేక ఇతర ఒడంబడికలుకూడా పూర్తి చేసుకున్నారు. పెకింగ్ ప్రభుత్వం ఏర్పడి, సోవియట్ ప్రభుత్వంచే అది గుర్తించబడిన తరువాత, వారిమధ్య జరిగిన మొదటి రెండు ఒడంబడికలు తంతివార్తలద్వారా టెలిఫోన్ల ద్వారాను జరిగాయి. అంటే ఈ రెండు దేశాలమధ్య అత్యంత సన్నిహితమైన తంతి తపాలా మార్గాలు ఏర్పరచుకోబడినాయన్నమాట. ఒక ఒప్పందం ప్రకారం ఈ రెండు దేశాలమధ్య సరాసరి రైలుమార్గం ఒకటి 1951 ఏప్రిల్ 1 వ తేదీనుండి నడపడానికి ఏర్పాట్లు జరిగాయి.

1950 ఫిబ్రవరి 14 న జరిగిన అప్పు మంజూరు ఒప్పందాన్ని సాధించుకునే నిమిత్తం కమ్యూనిస్టు చైనాకు చెందిన ఒక వాణిజ్య ప్రతినిధివర్గం సోవియట్ విదేశాంగ వాణిజ్య మంత్రిత్వశాఖ 1950 ఏప్రిల్ 19 న రెండు ఒడంబడికలపై సంతకాలు చేశాయి. 1951, 1952 సంవత్సరాలలో తిరిగీ ఇదే పని చేయడం జరిగింది.

చైనా – సోవియట్ సంధి చాలా సన్నిహితమైన ఆర్థిక సహకారంకోసం ఏర్పాటు చేసుకోబడిందని మళ్ళీ ఒకమాటు గుర్తుకుతెచ్చుకోవాలి. ఈ షరతును సాధించడంకోసం పెకింగ్, సోవియట్ ప్రభుత్వాలు సింకియాంగ్‌లో పౌర విమానయానానికీ సహజసంపదలను అభివృద్ధికీ సంబంధించిన రెండు ప్రత్యేకమైన ఒప్పందాలు చేసుకున్నాయి. ఈ పై ఒప్పందాలు, చైనా ఆర్థికవ్యవస్థ సోవియట్ ఆర్థికవ్యవస్థలో ఒక భాగంగా లీనమైపోవడానికీ, చైనా వర్తకం రష్యావైపు ఆకర్షింప బడడానికీ ఒక

బలమైన ధోరణిని కల్పించినట్లు కనిపిస్తోంది. వారు మావో సే టుంగ్ యొక్క ఒకవైపు మొగ్గువిధాన ఫలితాలను ఆచరణలో చూపించారు.

## చైనా - సోవియట్ల మైత్రి, సహకారం :

1949 అక్టోబరునుంచీ కూడా మాస్కో, పెకింగ్ ప్రభుత్వాలు అనేక సందర్భాలలో సమానాంతర చర్యలను తీసుకుంటూ వచ్చాయి. ఈ సమానాంతర రాజ్యతంత్రం మావ్ సే టుంగ్ 'ఒకవైపు మొగ్గు' విధానాన్నే ఆశ్రయించి ఉంటుంది. రాజ్యతంత్రాల్లో సహకరించుకోడమే కాకుండా, ఈ ఇరుపక్షాలవారూ విజ్ఞానశాస్త్ర సహకారానికీ, సాంస్కృతిక సహకారానికీకూడా పూనుకున్నారు. అనేక వేలమంది సోవియట్ విజ్ఞానశాస్త్రవేత్తలు, చైనా సాంస్కృతిక రంగంలో పనిచేసేవారు "సోవియట్ అభ్యుదయ భావాలను" వ్యాప్తి చేయడంకోసం చైనాకు వచ్చారు. తత్ఫలితంగా సోవియట్ పరమైన నూతన చైనా రూపొందసాగింది.

తాను అధికారం చేబట్టినప్పటినుంచీకూడా పెకింగ్ ప్రభుత్వం, ఐక్యరాజ్యసమితిలో చైనా జాతీయవాద ప్రభుత్వాన్ని చైనా ప్రతినిధిగా ఉండకుండా తొలగించి తాను ఆ స్థానం ఆక్రమించాలని కోరుతూవచ్చింది. 1950 లో అసెంబ్లీ ప్రారంభమైనప్పుడు సోవియట్ ప్రతినిధి ఈవిషయంలో ఒక ప్రతిపాదన చేశాడు. ఐక్యరాజ్య సమితినుంచి చైనా జాతీయవాద ప్రతినిధివర్గాన్ని బహిష్కరించాలనీ, పెకింగ్ ప్రభుత్వం తాలూకు ప్రతినిధిని అసెంబ్లీకి, దానితాలూకు ఇతర సంస్థలకు

హాజరుకావడానికి ఆహ్వానించాలనీ చెప్పాడు. ఏమైనా, ఈ ప్రతిపాదన ఓటింగ్‌లో వీగిపోయింది. తరువాత సంవత్సరం నవంబరులో సమితి జెనరల్ అసెంబ్లీ సాధారణ ఉపసంఘం, జాతీయవాద ప్రతినిధివర్గాన్ని బహిష్కరించి పెకింగ్ ప్రతినిధిని అసెంబ్లీలో పాల్గొనా నివ్వాలనే ప్రతిపాదననుకూడా విచారణ లోకి తీసుకోకూడదని ఒక తీర్మానం చేసింది. అప్పటినుంచీ కూడా ఐక్యరాజ్యసమితి సమావేశంలో పెకింగ్ ప్రతినిధిని పాల్గొననివ్వాలని సోవియట్ ప్రతిపాదన చెయ్యడం ఏటేటా మామూలయిపోయింది.

కొరియాసమరం తీవ్రం అవుతున్నకొలదీ కమ్యూనిస్టు చైనా అంతకంతకూ అందులో మునిగిపోతూవచ్చింది. అంతాత యుద్ధం సాగుతూన్న ప్రాంతంలో "పోలీసుచర్య" జరుపుతున్న ఐక్యరాజ్యసమితితో వైరం తెచ్చుకున్నది. ఐక్యరాజ్యసమితి పెకింగుపై తీసుకునే నిందాస్పదమైన, లేక శిక్షాస్పదమైన చర్య లన్నింటికీకూడా మాస్కో అభ్యంతరం తెల్పుతూ, పెకింగును సమర్థించడానికి ప్రయత్నిస్తూవచ్చింది. పెకింగు ప్రభుత్వం ప్రపంచరాజ్యాల సమితిలో సోవియట్ ప్రతిపాదన లన్నింటినీ పునరుద్ఘాటిస్తూ సమర్థిస్తూ వచ్చింది.

ఐక్యరాజ్యసమితికి ప్రతికూలంగాను, పోటీగాను కమ్యూనిస్టులు తమ స్వంత ప్రపంచసంస్థ నొకదాన్ని "ప్రపంచశాంతి కాంగ్రెస్" అన్న పేరుతో 1949 ఏప్రియల్‌లో పారిస్‌నగరంలో ఏర్పాటు చేసుకున్నారు. అందులో డెబ్బయిరెండు దేశాల వారు సభ్యులుగా ఉన్నారని చెప్పారు. అప్పటినుంచీకూడా ఈ

ప్రపంచశాంతికాంగ్రెస్ కార్యకలాపాల్లో పెకింగుప్రభుత్వం చాలా శ్రద్ధగా పాల్గొంటూ వచ్చింది. ఇక ఇప్పుడు ప్రపంచ శాంతిసంఘం అనే దొకటి ఏర్పాటుచేయబడింది. దీని ప్రధాన కర్తవ్యమల్లా తీవ్రంగాను, పటిష్ఠంగాను ప్రచారోద్యమాలు బయలుదేరతీసి, అమెరికా సంయుక్తరాష్ట్రాలు ప్రధాన యుద్ధోన్మాద రాజ్యమనీ, అది ప్రపంచశాంతిని భగ్నపరిచే ముఖ్య రాజ్యమనీ ఎత్తిచూపుతూ, దానిపై నేరారోపణ చేయుడమే. ఈ ప్రపంచశాంతిసంఘం వెనకాల ప్రబలమైన మాస్కో ప్రభావం ఉన్నదని ప్రత్యేకించి చెప్పవలసిన పనిలేదు.

రాజ్యతంత్ర సమస్యారంగంలో పెకింగుప్రభుత్వం, సోవియట్ ప్రభుత్వం మొత్తంమీద ఒకే వైఖరినీ, ఒకే విధానాన్ని అవలంబించాయి. ఐక్యరాజ్యాలు అందించిన ఒక రిపోర్టు ప్రకారం, కొరియాలో 1949, 1950 సంవత్సరాలలో "సోవియట్లు ఉత్తరకొరియను దళాలకు తమ మందుగుండు సామగ్రులను, చైనాకమ్యూనిస్టులు తమ సుశిక్షితమైన సైన్యాలను అందించాయని" తెలియవచ్చింది. సాంకేతికంగా సోవియట్ యూనియను కొరియాయుద్ధంలో పాల్గొనలేదు. కాని తాటస్థ్యము (లేక ఒకరిజోలికి పోకుండా ఉండడము)- అని చెప్పబడే ఈ సోవియట్ విధానం అసలుకంటె అగుపించడం ఎక్కువగా ఉంది. కొరియాయుద్ధంలో విమానాలు, టాంకులు, ఫీల్డుగన్లు; ఇంకా అనేకమైన ఇతర నవీన ఆయుధాలు ఉపయోగించబడ్డాయి. మరి వీటిని చైనాకాని ఉత్తరకొరియాకాని తయారుచేయలేవు. నిజంగా, వీటిని ఖరీదుచేసే స్తోమతకూడా వాటికి లేదు, ఈ ఆయుధాలన్నీకూడా నేరుగా సోవియట్ యూనియను

నుంచి వచ్చినవే. కడకు విరామసంధిసంప్రతింపులు కొనసాగు తున్న కాలంలో ఒకసారికంటె ఎక్కువసందర్భాల్లోనే మాస్కో, పెకింగులు తమ ఏకత్వాన్ని ప్రదర్శించాయి. కొరియాలో యుద్ధఖైదీలను తిరిగి ఆ దేశానికి అప్పగింత పెట్టేవిషయంలో ఐక్యరాజ్యసమితి జనరల్ అసెంబ్లీ వారి రాజీతీర్మానాన్ని ఈ రెండు దేశాలవారూ నిరాకరించారు. యుద్ధం విరామసంధి ఒడంబడికపై సంతకాలు జరిగినతరువాత సుమారు రెండునెలలకు సోవియట్ ప్రభుత్వం, ఆర్థిక పునర్నిర్మాణంకోసం ఉత్తరకొరియాకు లక్షకోట్ల డాలర్లు మంజూరుచేస్తామని ప్రకటించింది. పెకింగ్ ప్రభుత్వం తాము పుష్కలమైన ఆర్థిక, సాంకేతిక సహాయాన్ని ఇస్తామని ఉత్తరకొరియాతో 10 సంవత్సరాల ఒడంబడిక ఒకదానిపై సంతకంచేసింది.

కొరియా, ఇండోచైనాలలో శాంతి విషయమై చర్చలు సాగించేందుకు ఏర్పాటయిన జెనీవా సమావేశంలో, సంయుక్త రాష్ట్ర ప్రభుత్వపు విదేశాంగమంత్రి డల్లెస్, తనకు సోవియట్ రష్యా కమ్యూనిస్టు చైనా విధానాలలో భేదం ఏమీ కనుపించడంలేదని నివేదించాడు. పెకింగ్, మాస్కో—రెండూకూడా సంయుక్తరాష్ట్రాలు తన దురాక్రమణకు ఆధారంగా జపాన్‌ను శక్తిమంతం కావిస్తున్నదని నేరారోపణ చేశాయి. ముఖ్యంగా 1951 లో జపాన్‌తో జరిగిన ప్రత్యేక శాంతిసంధి చూచి ఈ ఇరువురు మిత్రులకూ కన్నుకుట్టింది. ఎక్కడలేని ఆగ్రహావేశాలను తెచ్చిపెట్టింది. ఈ ఒడంబడిక చిత్తు ప్రతిని చాలా జాగ్రత్తగా పరిశీలించిన తరువాతనే సోవియట్ ప్రభుత్వం దీనిపై

ఎన్నో వ్యాఖ్యానాలు చేసింది. ఈ చిత్తుప్రతిలోని అనేక నిబంధనలు జపాన్‌కు వ్యతిరేకంగా పూర్వం మిత్రుల మధ్య జరిగి ఉన్న ఒడంబడికలను ఉల్లంఘించేవిగా ఉన్నాయని చెప్పింది. విదేశాంగమంత్రి చౌ-ఎన్-లే పెకింగ్ ప్రభుత్వం దీనితో పూర్తిగా సమ్మతిస్తున్నదని పేర్కొన్నాడు. తరువాత, సంయుక్తరాష్ట్ర ప్రభుత్వం జపాన్ విషయమై ఒక శాంతి సంధి మహాసభను కూర్చింది. దానికి సోవియట్ ప్రభుత్వాన్ని ఆహ్వానించారు. మహాసభలో సోవియట్ ప్రతినిధి ఆంద్రీ గ్రొమికో ఆ శాంతిసంధిని నిశితంగా విమర్శించాడు. జపాన్ తిరిగి సైనిక తత్వాన్ని, దురాక్రమణను ప్రారంభించడానికి ఈ ఒడంబడికలో ఎలాటి హామీ లేదని పేర్కొన్నాడు. మహాసభ ముగుస్తుండగా ఆయన పత్రికలవారికి ఒక ప్రకటన జారీ చేశాడు. అందులో ఆయన సోవియట్‌యూనియన్‌ను గురించేకాక, పెకింగ్ ప్రభుత్వం చైనాల తరఫున కూడా మాట్లాడాడు. "చైనా ప్రజాతంత్ర రిపబ్లిక్ పాల్గొనకుండా.........దూర ప్రాచ్యంలో శుద్ధమైన శాంతి ఏర్పాటనేది ఏది జరగడం సాధ్యంకాదు" అని ఆయన ఉద్ఘాటించాడు.

పెకింగ్, మాస్కో ప్రభుత్వాలు రెండూ కూడా, ఫార్మోజాలో జాతీయవాద ప్రభుత్వం అక్రమమైనదనీ, చైనాకు ప్రాతినిధ్యం వహించడానికీ, చైనా ప్రజల తరఫున మాట్లాడడానికీ దానికి హక్కు లేదనీ గట్టిగా దెబ్బలాడాయి. 1950 జూన్‌లో, ప్రెసిడెంటు ట్రూమన్ సంయుక్తరాష్ట్రాల సప్తమ నౌకాదళాన్ని పహరాతిరగడానికి ఫార్మోజా సముద్ర అఖాతంలోకి పొమ్మని ఆజ్ఞాపించినప్పటినుంచీ, వారు సంయుక్త

రాష్ట్రాలు ఒకదురాక్రమణ దారనీ, ఫార్మోజాను ఆక్రమించు కున్న ఆసి ఆదీవిని తన దురాక్రమణ చర్యలకు ఒక సైనిక కేంద్రంగా మార్చుకుంటున్నదనీ నేరారోపణ చేస్తూ వచ్చారు. జాతీయవాద వార్తా సంస్థలు సోవియట్ జలాంతర్గాములు చైనా సముద్రజలాలలో తిరుగుతున్నాయని తరుచు వర్త మానాలు పంపుతూ వచ్చాయి. ఈ వర్తమానాలను సరి చూడడం అంత తేలికయిన పనికాదు. కాని ఒక విషయం మాత్రం నిజం. ఫార్మోజాలో మకాంచేసి ఉన్న అమెరికన్ శాబర్ జెట్లతో సరితూగేందుకు చైనా కమ్యూనిస్టులు సోవి యట్ మిగ్ జెట్ఫైటర్లను తమక్రింద ఉంచుకున్నారు. దీన్ని బట్టి చాంగ్ కై షేక్ కడపటి కోటబురుజును కూలద్రోయు డానికి చైనా కమ్యూనిస్టులు అనుసరించే విధానాలలో సోవి యట్ ప్రభుత్వం కావలసిన మద్దతంతా ఇస్తున్నదని స్పష్ట మవుతోంది.

పెకింగ్ - మాస్కోలు రాజ్యతంత్రాలలో సహకరిస్తూ రావడం ఇండో చైనాలోకూడా మనకు కనుపిస్తుంది. పెకింగ్, మాస్కో - రెండూకూడా వియత్‌మిన్‌కు అండగా ఉండి, కావలసినంత నైతిక సహకారాన్ని, వీలైనంత భౌతికసహా యాన్ని ఇస్తూవచ్చాయి. అదేతరుణంలో రెండు రాజ్యాలూ కూడా సంయుక్తరాష్ట్రాల విధానాన్ని ఎదుర్కొంటూ వచ్చాయి. జెనీవా మహాసభ జరుగుతున్నప్పుడు, సోవియట్ యూనియనుకు, కమ్యూనిస్టు చైనాకు ప్రాతినిధ్యం వహిస్తున్న మాలటోవ్, చౌ-ఎన్-లేలు ఒకరు చెప్పిందే మరొకరు చెప్పుతూ, అక్షరాలా ఒకరు పలికిందే మరొకరు పలుకుతూ,

అవిచ్ఛిన్నంగా తమ ఉద్దేశాలలోను అవసరాలలోను సంపూర్ణ ఐకమత్యం ప్రకటిస్తూవచ్చారు. ఆగ్నేయ ఆసియా విషయం లోను, ప్రపంచశాంతి విషయంలోనుకూడా మొత్తంమీద పెకింగ్, మాస్కోలు అదేవిధంగా, ఒకరు చెప్పిందే ఒకరు చెప్తూ, ఏక స్వరంతో భేదంలేకుండా ప్రవర్తించారు. 1954 అగస్టు 11 న చౌ-ఎన్-లే "ఆగ్నేయాసియా ఒడంబడిక సంస్థ అని చెప్పబడే దురాక్రమణ కూటమిని సంయుక్తరాష్ట్రాలు ఏర్పాటుచేయడాన్ని" పెకింగ్ ప్రభుత్వం తీవ్రంగా ప్రతిఘటిస్తుందని ప్రకటించాడు. సెప్టెంబరు 14 న సోవియట్ విదేశాంగ మంత్రిత్వశాఖ, ఆగ్నేయ ఆసియా సమష్టి రక్షణసంధికి సంబంధించిన చర్యలన్నీకూడా "బలపడుతున్న శాంతి కార్యకలాపాలను ప్రతిఘటిస్తూ కేవలం దానికి విరుద్ధంగా సాగించేవను లేవని" చెప్తూ ఒక ప్రకటన జారీచేసింది.

మావ్-సే-టుంగ్ "ఒకవైపు మొగ్గువిధానం" చైనా స్వాతంత్ర్యాభివృద్ధిలోను, జాతీయ పునర్నిర్మాణంలోను కూడా కమ్ముకున్నది. కమ్యూనిస్టుగా మావ్, తన యావత్తునూ సోవియట్ కమ్యూనిస్టు సంస్థలకోసం, ఆ సంప్రదాయాలకోసం, పశ్చిమదేశాల పెట్టుబడిదారీ ధోరణికి, వ్యతిరేకంగా ఉండే ఇంకా అలాంటి ఇతరవాటికోసం ధారపోయసాగాడు. 1950 ఫిబ్రవరి 17 న మాస్కో రైల్వేస్టేషన్‌లో వీడ్కోలు పుచ్చుకొనిపోతూ చేసిన ఉపన్యాసంలో ఇలా చెప్పాడు :

"నేను సోవియట్ యూనియనులో మకాం చేసిన కాలంలో ...... నేను, సోవియట్ కార్మికులు, కర్షకులు

సామ్యవాద వ్యవస్థను నిర్మించడంలో నిమగ్నులయి ఉండడం, గొప్ప ఫలితాలను సాధించడం కళ్ళారా చూచాను...ఇదంతా కూడా చైనా కమ్యూనిస్టుల చారిత్రాత్మక నిశ్చయాన్ని ధృడ పరుస్తోంది- సోవియట్ ఆర్థిక, సాంస్కృతిక, అనుభవాలు, ఇంకా ప్రధానమైన అభివృద్ధులు, ఇవన్నీకూడా చైనా పున ర్నిర్మాణానికి ఒక చక్కటి నమూనా అవుతాయి" మరొక ప్రముఖ చైనా కమ్యూనిస్టు నాయకుడు, లియూ-షో-చాయ్, 1949 అక్టోబరు 5 న చైనా-సోవియట్ మిత్రతాసంఘాన్ని ఆవిష్కరించే సందర్భంలో ఇలా పేర్కొన్నాడు: "చైనా - సోవియట్ యూనియనులమధ్య మైత్రి, సహకారం ఇంత విలు వైనదని మేం ఎందుకు ప్రత్యేకంగా నొక్కి చెపుతున్నామూ అంటే, ఇంతకుముందు సోవియట్ ప్రజలు నడిచిన బాటనే - మేం సరిగ్గా అనుసరించవలసి ఉంది..."

చైనాకువచ్చిన మొట్టమొదటి సోవియట్ సాంకేతిక నిపుణులు, వైద్య నిపుణులు, పెకింగ్‌లో సోవియట్ రెడ్‌క్రాస్ హాస్పిటల్ ఒకటి కట్టారు. అందులో అనేకమంది సోవియట్ డాక్టర్లు పనిచేస్తున్నారు. వారు తమ రోగులకు వైద్యం చేయ డమే కాకుండా, "ఎంతో అభ్యుదయకరమైన వైద్యవిజ్ఞానాన్ని అత్యంత నవీనపద్ధతిని" వ్యాప్తి చేస్తున్నారు.

అంతర్యుద్ధ కాలంలో చైనా రైలుమార్గాలు పెద్దపెట్టున నష్టానికి, విచ్ఛిత్తికి గురి అయినాయి. ఆ తరుణంలో ఎంతో అనుభవంకల సోవియట్ రైల్వే నిపుణులు చైనాకువచ్చి చెడి పోయిన రైలుమార్గాలను, విరిగిపోయిన వంతెనలను బాగు

చేశారు. దాని ఫలితంగా, 1950 సంవత్సరాంతం వచ్చేసరికి చైనాలో రైలుమార్గాలు తిరిగీ ఎంతో కట్టుదిట్టం, చక్కగా పనిచేయసాగాయి. కొత్త రైలు మార్గాలు నిర్మించడంలో కూడా సోవియట్ నిపుణులు ఎంతగానో తోడ్పడ్డారు. వీరికి తోడు, రైల్వేల నిర్వహణలో చైనీయులకు చక్కటి తర్ఫీదు ఇవ్వడంకోసం సోవియట్ రైల్వే నిర్వహణ నిపుణులు కూడా చైనాకు వచ్చేశారు.

హుయాయ్ నదీ ప్రాజెక్టు నిర్మించే సందర్భంలో సోవియట్ ఇంజనీరింగు నిపుణులు పనిచేయడానికి అవకాశం కలిగింది. ఈనది తీవ్రమైన వరదలకు మూలస్థానం. చైనా కమ్యూనిస్టులకు గల ఆధారాలను బట్టి, సోవియట్ నిపుణులు-ముఖ్యంగా జల శక్తి శాస్త్రానికి చెందిన ఇంజనీర్ బుకోవ్ ఈ ప్రాజెక్టుకు చిహ్నాలను ఏర్పాటు చేశాడు. సోవియట్ ఇంజనీరింగ్ పద్ధతుల ప్రాధాన్యాన్ని ప్రశంసించినప్పటికీ, చైనా ప్రజలు ఈ ప్రాజెక్టు పూర్తిగా చైనా వస్తుసంపదతోను, చైనీయులు తమ స్వంత చేతులతోను నిర్మించుకున్నందుకు చాలా గర్వపడ్డారు.

సోవియట్ పారిశ్రామిక, వ్యవసాయక నిపుణులు కూడా చైనా వచ్చి పనిచేశారు. కాని వీరు చెప్పుకోదగ్గంత ఘనకార్యాలను సాధించినట్లు కనుపించదు. సోవియట్ శిల్పశాస్త్ర, పారిశ్రామిక పద్ధతులను తెలుసుకొని వాటి ప్రకారం, గనులు, ధాతువులు, యంత్ర పరికరాలు, నేత, మొదలయిన పరిశ్రమలలో కొంత అభ్యున్నతి సాధించినట్లు నివేదించబడింది. ఈ అభ్యుదయాన్ని వీలయినంతశోభాసమన్వితంగా ఆకర్షకంగా చిత్రించడానికి ప్రయత్నించారనడానికి సందేహం లేకుండాని

మొత్తంమీద వారుసాధించినది అంత ఆకర్షకంగా లేదు. ముఖ్యంగా బ్రహ్మాండమైన జనసంఖ్యతో కూడుకున్న చైనా వంటి విశాలదేశానికి ఇదికష్ట సాధ్యమైన విషయమే. పారిశ్రామికరంగంలోను, వ్యావసాయిక రంగంలోను, ఇలాగే జరిగింది. ఇక ఇప్పుడు, అనేక సంవత్సరాలు చైనా-సోవియట్ విజ్ఞానశాస్త్ర సహకారం కొనసాగిన తరువాతకూడా, సాగించినవి—వాటి స్వభావంలో తక్కువవని, విస్తృతిలో పరిమితమైనవని తేలింది.

ఇక పారిశ్రామిక పరికరాలు, వ్యవసాయ పనిముట్లు, యంత్రాలు మొదలయిన ప్రధాన వస్తువుల సప్లయి విషయంలో సోవియట్ సహాయం ఎలాఉంది? చైనా కమ్యూనిస్టు పత్రికా సాహిత్యంలో వెలువడిన ఒక క్రమరహితమైన విసుర్లను బట్టి చూస్తే, ఇలాంటి సహాయం సముద్రంలో కాకిరెట్టలా బహు స్వల్పంగాను అరుదుగాను జరిగిందని నివేదికలవల్ల తెలుస్తోంది. 1952 ప్రారంభంలో, అప్పటికే, పంచవర్ష ప్రణాళిక ఆరంభిస్తారని కమ్యూనిస్టు చైనాలో చెప్పుకోసాగారు. సంవత్సరం చివర, అగస్టులో ప్రధాని చౌ-ఎన్-లే మాస్కోకు ఒక పెద్ద ప్రతినిధివర్గాన్ని తీసుకెళ్ళాడు. తాము ఆశిస్తున్న ప్రాజెక్టును నడిపేందుకు సహాయం అర్థించడానికే వీరు వెళ్ళారన్నది స్పష్టం సంప్రతింపులు కొనసాగాయి — ఊరికే కొనసాగింపబడ్డాయి కూడా. దీన్నిబట్టి అవసరమైన సహాయాన్ని మంజూరు చేయుడానికి మాస్కో సిద్ధంగాలేదని సూచనగా తెలియవచ్చింది. 1953 సెప్టెంబరు వరకుగాని దీన్నిగురించి ఒక్క ప్రకటనా వెలువడలేదు, సెప్టెంబరు 15 న మావ్-సే-టుంగ్,

సోవియట్ సహకారానికి కృతజ్ఞతలు తెలుపుతూ మావెం కోకు ఒకవార్తపంపాడు. తక్కిన విషయాలతోపాటు అందులో ఇలా పేర్కొన్నారు: "సోవియట్ మహాప్రభుత్వం, ఇప్పుడు చైనాలో కట్టిన లేక పునర్నిర్మించిన... నూతన ఉద్యమాలలో, క్రమపద్ధతిన ఆర్థిక, సాంకేతిక సహాయం విస్తృతంగా కావించ డానికి అంగీకరించినందుకు కృతజ్ఞత... చైనాప్రజలు క్రమ క్రమంగా తమ బ్రహ్మాండమైన భారీ పరిశ్రమలను స్వయంగా నిర్మించుకోగలరు." ఈ ఒడంబడికను సాధించడానికి మొదట్లో సోవియట్ కొంత కృషిసలిపినట్లు కనుపిస్తుంది. ఏమైనప్పటికీ 1954 జనవరి 24 తేదీన లండనునుంచి వచ్చిన ఒక అసోసి యేటెడ్ పత్రికావార్త ప్రకారం సోవియట్ ప్రభుత్వం, చైనా కోర్కెలన్నింటినీ సఫలీకృతంచేయలేదనీ– దృఢమైన పనిముట్లు, యంత్రసామగ్రులు సప్లయిచేయలేదనీ, చైనానుంచి వ్యవసా యోత్పత్తు లన్నింటినీ తాను తీసుకోనుకూడా లేదనీ సోవియట్ ప్రభుత్వం చెప్పినట్లు తెలుస్తోంది.

1955 వేసవివచ్చేసరికి పెకింగునాయకులు, పరిస్థితిని సరిగ్గా అంచనా వేయవలసిన తరుణం ఆసన్నమైనదని భావించి, ఆర్థికసమస్యలకు సంబంధించిన విపులమగు నివేదికలను తయారు చేశారు. ఈ నివేదికల పూర్తిపాఠాలు బ్రిటిష్‌వారు సంపా దించగలిగారు. ముఖ్యమైనవిషయాలనేకం ఆరాతీయగలిగారు; అవి ఇవి : రష్యా ఉచితంగాచేసే సహాయం, ఎక్కువగా 156 (సిక్) ప్రధాన పారిశ్రామికసంస్థల నిర్మాణంలో సహాయపడే టందుకు పథకాలు తయారుచేసేవారిని, ఇంకా ఇతర నిపుణు లను పంపడమే. రష్యానుంచి వచ్చే సామగ్రులకు పెకింగు

చాలా ఎక్కువ మొత్తాలు చెల్లిస్తోంది. చైనా తమకు అత్యవసరమైన ఆహారపదార్థాలు, ఇంకా ఇతరవస్తువులను తూర్పు యూరోపుకు రవాణాచేసి వాటికి బదులుగా అక్కడనుంచి పారిశ్రామిక సామగ్రులను తెప్పించుకుంటోంది. ఈ పరిస్థితి రష్యానుంచి ప్రధాన పారిశ్రామిక సామగ్రులు తమకు ఉచితంగా లభిస్తాయని ఆశించిన చైనాకమ్యూనిస్టునాయకులకు పెద్దపెట్టున ఆశాభంగం కలిగించింది. సోవియట్‌నుంచి చైనాకు వచ్చే శిల్పశాస్త్రసంబంధమైన సహాకారం-సాంకేతిక, పారిశ్రామిక విజ్ఞానము నేర్పడంమాత్రమే. ఈ పరిస్థితి ప్రధానంగా ఊహాజనితమైన రాజకీయ విచారణలపై ఆధారపడిఉన్న మావ్-సే-టుంగ్ ఒకవైపుమొగ్గు విధానంలో దోషమున్నదని ఎత్తిచూపుతోంది. చైనాను పారిశ్రామికదేశంగా చేయడానికి పశ్చిమ శిల్పశాస్త్రసంబంధమైన విజ్ఞానాన్ని తెలుసుకోవడం అక్కడి ప్రధాన వస్తూత్పత్తులనుకూడా సేకరించగలిగి ఉండడం ఎంతో ముఖ్యం. కేవలం ఒక్క-సోవియట్‌రష్యామీదనే ఆధారపడడం, పారిశ్రామిక నిర్మాణవిధానంలో కావలసినంత ప్రతిబంధకమే కాక, తలకుమించిన బోలెడు ఖరీదుకూడా అవుతుంది

చైనా-సోవియట్ స్నేహ సంఘం రష్యా మహాభక్తుడు, ల్యూషోయ్-చ్యూ చేత నడుప బడుతోంది. దాని ఉద్దేశాలు ఇవి. "చైనా-సోవియట్ యూనియన్‌లమధ్య స్నేహసంబంధాలను మరింత అభివృద్ధిచేయడం, దృఢతరం చేయడం చైనా-సోవియట్ సాంస్కృతిక, ఆర్థిక సహాకారాన్ని పెంపొందింపచేయడం విజ్ఞానశాస్త్రాన్ని సాధించడంలోను, సాంస్కృతిక పునర్నిర్మాణంలోను, ఆర్థిక, రాజకీయరంగాలలోను సోవి

యట్ రష్యా గడించిన అనుభవాలను చైనాలో ప్రవేశపెట్టడం శాశ్వతమైన ప్రపంచశాంతికోసం సాగే సంయుక్త పోరాటంలో ఈ రెండు దేశాల సౌమనస్యాన్ని మరింత గట్టిచే [illegible] శక్తివంతం కావించడం" సోవియట్ అనుకూలమైన భావాలను నమ్మకాలను పెంపొందించడం కోసం పుస్తకాలు, కరపత్రాలు, వార్తా పత్రికలు ప్రచురించడం ఈ సంఘం బాగా విరివిగాను, విస్తృతంగాను సాగించింది. జనబాహుళ్యంలో ప్రచారం కావడానికి ఈ సంఘం అలాంటి సాధనాలనే ఉపయోగించిందికూడా. చలనచిత్రాలు, రేడియోప్రసారాలు, ప్రెస్సు, మొదలయినవాటిద్వారా ఈపని కొనసాగించింది. ఏటికేటికి ఇతర దేశాలతో సాంస్కృతిక సంబంధాలకోసం (వోక్స్) ఏర్పడిన సోవియట్ సొసైటీనుంచి తగినంత సహాయాన్ని పొందింది.

"వోక్స్" ద్వారా చైనా-సోవియట్ స్నేహసంఘం అరవైనాలుగు సోవియట్ సాంస్కృతిక సంఘాలతో అత్యంత సన్నిహితసంబంధం ఏర్పరచుకున్నది. క్రమం తప్పకుండా దానికి సంగీతపు రికార్డులు, చలనచిత్రాలు, సాహిత్యగ్రంథాలు, పంపుతూ వచ్చింది. ఇవన్నీకూడా చైనీయ విప్లవాత్మక పోరాటానికీ, జాతీయ పునర్నిర్మాణానికీ సంబంధించినవే. ఒక చైనా "వాడెవిల్లే" దళం మాస్కోకు పంపబడి, చాలా విజయవంతముగా వ్యవహరించింది. తరువాత సంవత్సరాలలో ఇలాంటి దళాలు అనేకం దాన్ని అనుసరించాయి. సోవియట్ ప్రజలకు తెలియచేసేటందుకు ఇతరప్రయత్నా లనేకం కొనసాగాయి. కమ్యూనిస్టుచైనా ఎక్జిబిషన్లు నడపడానికీ, గ్రంథాలు తర్జుమా

చేయడానికీ, నవీన చైనాకళను ప్రదర్శనశాలలద్వారా చూపడానికి పూనుకున్నది. గడచిన కొద్దిసంవత్సరాలలో, అనేక చైనా ప్రతినిధివర్గాలు సోవియట్ రష్యాను సందర్శించాయి కూడా. ల్యూ-షాయ్-చ్యూ అందించిన ఒక నివేదిక ప్రకారం "సోవియట్ యూనియన్‌లో విద్య అభ్యసించేటందుకు చైనా అనేక వందలమంది విద్యార్థులను అక్కడికి పంపింది, ఇకముందు కూడా అనేకమంది విద్యార్థులను అక్కడికి పంపుతుంది." అని తెలియవచ్చింది. చైనాలో సోవియట్ సాంస్కృతిక ప్రభావాన్ని విస్తరింపచేయడంలో సోవియట్ ప్రభుత్వం మొదటినుంచీ కూడా అంతులేని ఆసక్తిని ప్రదర్శిస్తూ వచ్చింది. 1949 లో ఫెడెయేవ్, సిమనోవ్‌ల నాయకత్వాన ఒక సోవియట్ సాంస్కృతిక ప్రతినిధివర్గం చైనాకు తరలివెళ్ళి, చైనాలో వివిధప్రాంతాలు దర్శిస్తూ అక్కడ నెలరోజులపాటు గడిపింది. ఈ ప్రతినిధివర్గంలోని సభ్యులు కొందరు వివిధ విషయాలమీద చైనా ప్రజలకు ఉపన్యాసాలిచ్చారు. చైనాలో అమెరికన్ ప్రభావాన్ని నిందించి, నాశనంచేసి తద్వారా సోవియట్ ప్రభావాన్ని ప్రవేశపెట్టుకునేందుకు త్రోవను నిష్కంటకంగా చేసుకోడమే వీరి ప్రధాన ఉద్దేశం అయింది. 1952 నవంబరు నెలకు 'సోవియట్ మైత్రి' మాసం అని నామకరణం చేశారు. దేశవ్యాప్తంగా సాగే ఈ ఉద్యమానికి పుష్టిని, తుష్టిని ఇచ్చేటందుకు సోవియట్ ప్రభుత్వం ఒక బ్రహ్మాండమైన సాంస్కృతిక ప్రతినిధివర్గాన్ని చైనాకు పంపించింది; ఇందులో కళాకారులు, సినిమాలలో పనిచేసేవారు, సోవియట్

సైన్యంతాలూకు అరుణపతాక గాయక, నృత్యబృందం - వీరంతా ఉన్నారు. పెకింగ్ పశ్చిమప్రాంతంలో క్రొత్తగా నిర్మించిన సోవియట్ ప్రదర్శనశాలా కేంద్రంవద్ద, సోవియట్ ఆర్థికసాంస్కృతిక విజయాలను తెలిపే ఒక అద్భుతమైన ప్రదర్శనాన్ని ఏర్పాటు కావించారు. ఇది 1954 డిసెంబరు 23 వరకూ నడిచింది.

మానవప్రవర్తనను మార్చడానికి జ్ఞానాన్ని భావాలను మారిపోయడానికీ విద్య ప్రధానమైన సాధనం అందుచేత కమ్యూనిస్టు చైనాలో విద్యపై సోవియట్ ప్రభావం ప్రబలంగా పరివ్యాప్తమైందని ముఖ్యంగా గుర్తుంచుకోవాలి. సోవియట్ విద్యావిషయిక నిపుణుల దర్శకత్వంక్రింద, చైనాలో విద్యావిధానం ఆకారంలోను, అర్థంలోనూ కూడా సోవియట్ పద్ధతులపైన తిరిగి పోతపోయడం జరిగింది. 1953 మే 23 న మాస్కో రేడియో, సోవియట్ పాఠ్యగ్రంథాలు చైనా భాషలోకి "పెద్దపెట్టున తర్జుమా" చేయబడతాయనీ, అవని చైనా విశ్వవిద్యాలయాల్లో ఉన్న నిపుణులచేత కొనసాగించబడుతుందనీ ప్రకటించింది. సోవియట్పండితులు కూడా చైనా విద్యావిధానంలో ప్రముఖపాత్ర నిర్వహించారు. 1950 అక్టోబరు మొదట్లో నవచైనా సాధికార వార్తాసంస్థ, 85 మంది సోవియట్ అధ్యాపకులు చైనా పీపిల్స్ యూనివర్సిటీలో ప్రత్యేక పదవులందు నియమితులయినారని తెలియజేసింది. చైనాలో సోవియట్ సాంస్కృతిక ప్రభావం వ్యాప్తి చెందడానికీ, సోవియట్ రష్యాను గురించిన గ్రంథాలు, సోవియట్

రచయితల అనువాదగ్రంథాలు ప్రచురించడానికీ మరొక బల మైనసంస్థ ఏర్పాటయింది. మార్క్సిజం - లెనినిజంమీద స్టాలినిజంమీద అసంఖ్యాకంగా గ్రంథాలు ప్రచురింపబడి, దేశం నలుమూలలా పంచిపెట్టబడినాయి. సోవియట్ సాహిత్య గ్రంథాలుకూడా అనువదింపబడి, ప్రచురింపబడినాయి. సాహి త్యానికి స్టాలిన్ బహుమతిపొందిన గ్రంథాలన్నీకూడా వీటిల్లో ఉన్నాయి.

చైనాలో సోవియట్ సాంస్కృతిక ప్రభావాన్ని వడ పోత పోసినట్టు పోసి దింపడానికి, వివిధరకాల సినిమాలు, ఎక్జి బిషన్లుకూడా చక్కటిసాధనా లయినాయి. చైనీయుల్లో బాగా పేరుగడించుకున్న అమెరికను చలనచిత్రాలను తీసేసి వాటిస్థానే సోవియట్ చిత్రాలను చూపసాగారు. దేశం అంతటాకూడా సోవియట్ జీవితాన్ని, వారు సాధించిన విజయాలను చిత్రించే ఎగ్జిబిషన్లు పలుతావుల్లో ఏర్పాటు కావించబడినాయి. “1951 సెప్టెంబరు లగాయతూ 1952 అగస్టువరకూ ఈసంఘం 19,000 పైచిలుకు చలనచిత్ర, ఛాయాచిత్ర ప్రదర్శనలు ఇవ్వగలిగిందనీ, ఈ ప్రదర్శనాలను 4 కోట్ల 90 లక్షల పైచిలుకు ప్రేక్షకులు చూచారనీ” ఒక సాధికార నివేదికలో తెలియజేశారు. సోవియట్ రష్యానుగురించి ఉపన్యాసాలుకూడా చాలా క్రమ పద్ధతిలో నడుపబడినాయి. రష్యనుభాష బోధించే బడులు అనేక ప్రాంతాలలో స్థాపింపబడినాయి. తరువాత సంవత్సరాలలో, చైనా పాఠశాల లన్నింటిలోనూ ఇంగ్లీషుతీసేసి దాని స్థానంలో రష్యనుభాషను ఉపభాషగా పెట్టారు. దీని అర్థం ఉన్నత పాఠ

శాలలలోని పట్టభద్రులంతా రష్యనుభాష నేర్చుకోవాలన్న మాట.

రాజ్యతంత్రాలలో చైనా – సోవియట్ సహకారం సంయుక్తరాష్ట్రాలకోసమే ఉద్దేశించబడింది. ఇది నూటికి నూరు పాళ్ళు స్పష్టం. ఇందుకు పత్రాలూ సాక్ష్యాలు ఉన్నాయి. సందేహానికి తావులేదు. కాని ఎందుకిలాగ ? చైనా కమ్యూనిస్టులు కమ్యూనిస్టులే; ఇక వారెన్నటికీ వ్యావసాయిక సంస్కర్తలు కారు. కమ్యూనిస్టులు కనుక, వారు సహజంగా తమ సోవియట్ కామ్రేడ్స్‌తో చేతులుచేతులు పట్టుకుని తిరుగుతారు. వారూవీరూ ఏకమై ప్రపంచ విప్లవాన్ని ప్రజ్వలింపజేస్తారు. పెట్టుబడిదారీ విధానాన్ని ప్రతిఘటిస్తారు. పెట్టుబడిదారీ కూటమికి నాయకుడని తాము భావిస్తున్న సంయుక్త రాష్ట్రాలను సాధిస్తారు. చైనాలో సోవియట్ పలుకుబడి బలపడాలంటే, అక్కడ అమెరికను ప్రభావాన్ని దూషించాలి, అక్కడ లేకుండా తుడిచిపెట్టాలి. అమెరికను ప్రతికూల వాతావరణం ఎక్కువ లేకపోయినా – కొంత అయినా సోవియట్ ప్రచార, దురోద్బోధనలవల్లనే అక్కడ ఉన్నది. సోవియట్ రష్యా, కమ్యూనిస్టు చైనా – రెండూకూడా సాంస్కృతిక సామరస్యంకోసం, ఆర్థిక అభిన్నత్వంకోసం ఆసియాలో విస్తరించాలనే కాంక్ష పెట్టుకున్నాయి. ఏమైనా సంయుక్తరాష్ట్రాలకు, దాని మిత్రకోటిని ప్రతికూలంగా వారిరువురూ ఏకమయ్యారు. వారు ఆశించిన పథకం భగ్నమైంది. దాంతో వారు సంయుక్తరాష్ట్రాలపట్ల విరోధధోరణి అవలంబించారు.

ఫార్మోజా విషయంలో, జాతీయవాదు లింకా తమ పోరా టాన్ని మానుకోలేదని, తిరిగి దేశమంతా స్వాధీనం చేసుకోవ డానికి యత్నిస్తారని వారికి తెలుసు. సంయుక్త రాష్ట్రాలు ఫార్మోజాదీవిని "ఆక్రమించింది" (ఇది పెకింగ్, మాస్కోలు చేసే వాదం) కనుక పెకింగ్, మాస్కోలు సంయుక్తరాష్ట్రాలను తమ శత్రువులుగా భావిస్తున్నాయి.

ఇక ఇప్పుడు చైనా – సోవియట్ విజ్ఞానశాస్త్రసహ కార విషయంలోకివస్తే, సోవియట్ నిపుణులు పారిశ్రామిక పథకాల విషయంలోను, వాటిని నడిపే విషయంలోను చాలు విజ్ఞానశాస్త్రశిక్షణ, అనుభవాలద్వారా కావలసినంత సేవ చేశారు. ఇక పరిశ్రమలలోను, వ్యవసాయంలోను నూతనా భ్యుదయం సాధించేటందుకు ఎంతగానో అవసరమైన ప్రధాన ఉపకరణాల విషయంలో సోవియట్ రష్యానుంచి వచ్చే సప్ల యిలు మాత్రం చాలా తక్కువ అయిపోయినవి. రెండవ ప్రపంచ సంగ్రామకాలంలో సోవియట్ రష్యా విశేష వస్తు నష్టానికి గురిఅయింది. అది ముందు స్వవిషయంలో దృష్టిని కేంద్రీకరించుకుని మళ్ళీ కోలుకునేసరికి కొన్ని సంవత్సరాలు పట్టవచ్చుననీ, అంచాత ప్రస్తుతానికి అది చైనాకు పారిశ్రామిక ఉపకరణాలను అంతగా సప్లయి చేయలేదనీ భావించుకోవచ్చు. సోవియట్ రష్యా కనుక ఎగుమతులు చేయగల పెట్టుబడిదారీ దేశం అయిఉండి, మూలధనం పెట్టగలిగిఉండి – మాటవరుసకు ఒకలక్ష కోట్ల డాలర్లు ఏటేటా చైనాకు ఇవ్వగలిగి ఉన్నట్ల యితే, చైనాలో ఆర్థికాభివృద్ధి ఈపాటికే కొండంతలుగా పెరిగి

ఉండేది. ఈ పరిస్థితులవల్ల చైనా ఆర్థికాభివృద్ధి చాలా మందంగా ఉండకతప్పదు.

సాంస్కృతికరంగంలో చైనా-సోవియట్ సహకారభార మంతా ఒకవైపు మొగ్గినవిధమైంది. ప్రచారసాధనంకోసం పన్నిన వలయావత్తున్నూ- విద్యావిధానం యావత్తున్నూ, సోవియట్ అభిప్రాయాలు, ఆదర్శాలు, సోవియట్ సంస్థలను శ్లాఘించడాలు, సోవియట్ ఆచారాలు-వీటిని వ్యాపింపచేయ డము కోసం చేసిన కృషికిమాత్రం ఉపకరించినాయి. మరిచైనా సాంస్కృతికప్రభావం ఏమో సోవియట్‌రష్యాకు చిన్న చిన్న పిల్ల కాలువలమాదిరిగా మాత్రమే పోతోంది. నిజానికి, అతి వేగంగా అంతటా వెదజల్లబడుతున్న ఈ సోవియట్ ప్రభావం, ఉండిఉండి ఒక్కమాటుగా మావ్ సేటుంగ్ కమ్యూనిజాన్ని గూర్చి చెప్పినట్లు "కొండలను పిండిచేసి సముద్రాలను అల్ల కల్లోలం చేయజాలిన ఒక మహాశక్తి" ని పుట్టిస్తుందేమో! కాని చైనా ఆత్మలేక చైనాప్రజల మనస్తత్వం కొండలకంటె సముద్రాలకంటెకూడా గొప్పదిగా కనుపిస్తుంది. 1952 మే 25 తేదీగల నాన్‌ఫాన్‌జీ-పావో (ఒక కమ్యూనిస్టుపత్రిక) లోని ప్రధానవ్యాసంప్రకారం, చైనా విశ్వవిద్యాలయాల్లోనూ, కాలేజీ ల్లోనూ గల మేధావులంతా అనేకసంవత్సరాలబట్టి కమ్యూ నిస్టుపరిపాలనక్రింద ఉన్నతరువాతకూడా, ఇంకా "అమెరికాను ప్రేమించు, అమెరికాను శ్లాఘించు, అమెరికాకు భయపడు; అన్న ధోరణిలోనే" ఉంటూ, "కమ్యూనిస్టు ప్రతికూల సోవి యట్ వ్యతిరేక భావాలను" మన్నిస్తున్నారని తెలియవచ్చింది.

దీన్నిబట్టి చూస్తే సోవియట్ ప్రభావం ఇంతవరకూ ఎలాంటి అగాధమైన ఫలితాన్ని కలిగించలేదని తేలుతోంది. అమెరికను పండితులు, విజ్ఞానవేత్తలు చైనా ప్రజల మనస్సుల్లో నాటిన అమెరికను అభిప్రాయాలు, ఆదర్శాలు అలాగే నాటుకుని ఉన్నాయనీ, అవి ఒక రాత్రిరాత్రికే తుడిచిపెట్ట సాధ్యమయ్యేవి కావని స్పష్టపడుతోంది.

1951, 1952 సంవత్సరాలలో చైనా కమ్యూనిస్టులు అవినీతి, దుర్వ్యయం, నిరంకుశాధికార ప్రభుత్వ పద్ధతులపైన త్రిదోష నిర్మూలన ఉద్యమాలు, లంచగొండితనం, పన్నుల ఎగవేత, దగా, ప్రభుత్వపు ఆస్తుల దొంగిలించడం, ప్రభుత్వ రహస్యాలు బయల్పర్చడం – వీటిపైన పంచదోష నిర్మూలనోద్యమం అవసరమని భావించారు. ఈ నిర్మూలనోద్యమాలు చైనా ప్రజలలో, లోలోపల దాగి ఉన్నప్పటికీ – విరివిగా వ్యాప్తమైన అసంతృప్తినీ, ఆగ్రహాన్నీ వ్యక్తంచేస్తున్నాయి. అప్పటి నుంచీ, ఇన్ని సంవత్సరాలూ దేశం నలుమూలలా అట్టిచర్యలు తరుచుగా సాగిపోవుతున్నవనీ, విప్లవపు ప్రతీఘాతకులను ఉరి తీయడం జరుగుతున్నదనీ వార్తలు వస్తూనే ఉన్నాయి. తుదకీ విషయాలన్నీ కూడా, చైనాలో వ్యాపించిన సోవియట్ ప్రభావం ఇంతమటుకూ చైనా ప్రజల మనస్తత్వాన్ని, సాధారణ దృక్పథాన్ని ఏమాత్రం మార్చలేదని స్పష్టపరుస్తున్నాయి. కనుక చైనా కమ్యూనిస్టులు తమ అధికారాన్ని కొనసాగించాలనుకుంటే, చైనా–సోవియట్ మైత్రిని పెంపొందించాలనుకుంటే వారు ఒక ముఖ్యమైన పనికి, ఒక ప్రాథమిక కర్తవ్య

నిర్వహణకు తక్షణం పూనుకోవాలి - వారు ప్రజల జీవనో పాధిని పెంపు చెయ్యాలి. వారు ప్రజలకు ఒక నైతిక జ్ఞానాన్ని ప్రసాదించాలి. వారికి స్వేచ్ఛను, రక్షణను ఇవ్వాలి. చైనా కమ్యూనిస్టులు కనుక తమ ఈ విద్యుక్త ధర్మాన్ని నెరవేర్చక పోయి నట్లయితే, అప్పుడు వారు సాగించిన ప్రచారం, వ్యాపింపచేసిన సోవియట్ ప్రభావం వ్యర్థమైన పోతాయి. అంతేకాదు. వారి పరిపాలనా వ్యవస్థ యావత్తూ - రెండు వేల సంవత్సరాల క్రితం చ్యూస్-షీ-హ్యుయాంగ్ ట్సీ అనుసరించిన తరువాత రాజవంశం కూలినట్లుగా కూలిపోతుంది.

